మానవులందరు సమాన హక్కులు కలవారుగా సృష్టించబడ్డారు; భగవంతుడు వారికి కొన్ని తిరుగులేని హక్కులను ప్రసాదించాడు. ఆ హక్కులు ఇవి: జీవించడం, స్వాతంత్ర్య మనుభవించడం, సుఖపడడానికి ప్రయత్నించడం — ఇవన్నీ నగ్న సత్యాలని మా విశ్వాసం. ఈ హక్కులను సాధించ డానికే మానవులకు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. వాటికి న్యాయమైన హక్కులను ప్రజలే యిస్తారు. ఏదైనా ఒక ప్రభుత్వం ఈ లక్ష్యాలను నాశనం చేయగలదైతే దానిని మార్పు చేసుకోడానికిగాని, రద్దు చేసుకోడానికిగాని ప్రజలకు అధికారం కలదు. తమ సౌఖ్యానికి, భద్రతకు తోడ్పడగల రీతిగా ప్రజలు చర్యలు తీసుకోవాలి. అందుకై సూత్రా లను తయారుచేసుకొని, తగు అధికారాలతో నూతన ప్రభుత్వాన్ని స్థాపించుకోడానికి ప్రజలు హక్కు కలవారు.

అమెరికా స్వాతంత్ర్య ప్రకటన.

జూలై 4, 1776.

THIS PAMPHLET IS BASED UPON THE BOOK "OUR CONSTITUTION AND GOVERNMENT," WRITTEN BY CATHRYN SECKLER-HUDSON, AMERICAN UNIVERSITY, WASHINGTON, D. C., AND DISTRIBUTED FREE BY THE IMMIGRATION AND NATURALIZATION SERVICE OF THE UNITED STATES DEPARTMENT OF JUSTICE TO PUBLIC SCHOOLS THROUGHOUT THE UNITED STATES FOR USE BY CANDIDATES PREPARING FOR THE DUTIES AND RESPONSIBILITIES OF CITIZENSHIP.

PUBLISHED BY HIGGINBOTHAMS LIMITED. AND PRINTED AT KUBERA PRINTERS LTD., MADRAS.

# విషయ సూచిక

# 1

# అమెరికా రిపబ్లిక్‌కు పునాది

అమెరికా ప్రజాస్వామిక విధానం 160 సంవత్సరాల క్రిందట ప్రారంభమైంది. అప్పటినుంచీ అది అమెరికా ప్రజాభ్యుదయాన్ని, క్షేమాన్ని కాపాడుతూంది. ఈ ప్రజాస్వామ్యానికి ఆదిలో మూలకారకులైన వారు 55 మంది నాయకులు. వారు 1787 లో పెన్సిల్వేనియా రాష్ట్రంలోని ఫిలడెల్ఫియాలో సమావేశమై అమెరికా ప్రజాస్వామిక విధానాన్ని స్థాపించారు. ఆదిలో ఉన్న 13 బ్రిటిష్ కాలనీలలోని 12 కాలనీలకు చెందిన ఈ అమెరికా ప్రముఖులు ఆ సంవత్సరం వసంతకాలంలో, క్రొత్తగా స్వాతంత్ర్యం పొందిన అమెరికా ఎదుర్కొంటున్న ఒక విషమ పరిస్థితిని తొలగించడానికి కొన్ని నాళ్ళు సమావేశాలు జరిపారు. అంతకుముందు ఆరు సంవత్సరాల క్రితమే పదమూడు కాలనీలు బ్రిటిష్ ప్రభుత్వాధికారంపై తిరుగుబాటు జరిపి స్వాతంత్ర్యాన్ని సంపాదించాయి. తమ భద్రతకోసం ఇవి ఒక ఒడంబడిక చేసుకొని, కాన్ఫెడరేషన్‌గా ఏర్పడి, 1781 నాటికి కాన్ఫెడరేషన్ సూత్రాలను ఆమోదించాయి. కాని, ఈ సూత్రాలలో లోపాలున్నాయని ఈ ఆరు సంవత్సరాల కాలంలో గ్రహించబడింది.

అందుచేత, అప్పట్లోగల కాంటినెంటల్ కాంగ్రెస్ సభ్యులు 1787 ఫిబ్రవరిలో సమావేశమై, ఈ సూత్రాలను సవరించేటందుకు తమతమ ప్రతినిధులను ఫిలడల్ఫియాకు

పంపవలసిందని 13 ప్రభుత్వాలనూ కోరారు. ఈ ప్రతినిధుల సమావేశం 1787 మే 25 వ తేదీన స్వాతంత్ర్య మందిరంలో (ఇండిపెండెన్స్ హాలులో) జరిగింది. 1776 లో అమెరికా స్వాతంత్ర్య ప్రకటనపై సంతకాలుకూడా ఈ స్వాతంత్ర్య మందిరంలోనే జరిగాయి. అమెరికా స్వాతంత్ర్యాన్ని మారు మ్రోగించిన లిబర్టీ బెల్ (స్వాతంత్ర్య ఘంట) కూడా ఇక్కడే ఉన్నది. ఈ మందిరం, యీ ఘంట చరిత్రప్రసిద్ధి చెందాయి. ఆ నాడిక్కడ సమావేశమైన 55 మంది ప్రముఖుల చర్చలు 1787 సెప్టెంబరు 17 వ తేదీన సమాప్తమయాయి. వారి చర్చల ఫలితంగానే అమెరికా ప్రజాస్వామిక విధానానికి పునాది ఏర్పడింది. ఈ నాటికీ పునాది అదే—అమెరికా రాజ్యాంగ చట్టం అదే.

ఫిలడల్ఫియాలో కూడిన 55 మంది ప్రముఖులు అనేక తరగతులవారు; వివిధ స్వభావాలు కలవారు; విభిన్న దృక్పథాలు కలవారు. అయినప్పటికీ తమ ఏకలక్ష్యం విషయంలో ఏకగ్రీవాభిప్రాయాన్ని కుదుర్చుకున్నారు. ఈ లక్ష్యం రాజ్యాంగ చట్టం ఉపోద్ఘాతంలో స్పష్టంగా, క్లుప్తంగా వ్యక్తపరుచబడింది.

ఉపోద్ఘాతంలో ఉన్నదిది: "అమెరికా ప్రజలమైన మేము ఇప్పటికంటె ఉత్తమమైన యూనియన్‌ను, ధర్మ పరిపాలనను, ప్రశాంత పరిస్థితులను నెలకొల్ప దలచాము. మా రాజ్యాల భద్రతకు సమష్టి రక్షణను, సమష్టి క్షేమాన్ని పొందదలచాము. మేము, మా సంతతివారు స్వాతంత్ర్యాన్ని

అనుభవించ దలచాము. అందుచేత, అమెరికాకు ఈ రాజ్యాంగ చట్టాన్ని స్థిరపరుస్తున్నాము."

దీనిలో తెల్పబడిన లక్ష్యాల సాధనకు అవసరమైనది ప్రజలకోసం, ప్రజలు స్థాపించిన ప్రజాప్రభుత్వం; ప్రజల సమ్మతితో ప్రజల క్షేమానికి పనిచేసే ప్రభుత్వం. ఈ ప్రభుత్వాధికారులు ప్రజల వోట్లద్వారా ఎన్నుకోబడాలి. ప్రజలలో అధిక సంఖ్యాకుల వాంఛలకు వీరు బాధ్యత వహించాలి. ఆనాడు ఇంగ్లండులో ప్రజలకు కొంతవరకు మాత్రమే స్వపరిపాలనాధికారం కలదు. ప్రపంచంలోగల ఆనాటి ప్రభుత్వాలతో పోల్చి చూచినట్లయితే, ప్రజలే పరిపాలకులనే అమెరికా నూతన సిద్ధాంతం సంపూర్ణంగా విప్లవాత్మక మైనట్టిది.

అయితే, ఆదిలో అమెరికాకు వలస వచ్చినవారు ఇంత సంపూర్ణస్వాతంత్ర్యంకోసం వచ్చినవారు కారు. తమ స్వదేశాలలో ఏదో ఒక విధంగా దమననీతి అనుసరించ బడుతున్నదనీ, ఆ బాధలు విరగడవాలనీ కొందరు వచ్చారు. కొన్ని దేశాలలో జనసామాన్యం ఆర్థికంగా అభివృద్ధికాగల అవకాశాలు లేవు. ఆ రాజ్యాల ఆర్థికవ్యవస్థలు ఆ విధంగా ఉండేవి. వాటిని తప్పించుకొని బాగుపడాలనే ఆశతో కొందరు వచ్చారు. తమ వ్యవహారాలను తామే చక్కబెట్టుకో గలమని వారందరికీ ధైర్య మున్నది. వారు తమ అభీష్టాను సారం వృద్ధికాలేనిరీతిగా ఇతరులు జోక్యం కలిగించుకోడాన్ని ఏమాత్రం సహించలేదు. ఈ స్వాతంత్ర్యేచ్ఛ ఎంతవరకు

వెళ్ళినదంటే, రాజ్యాంగ సూత్రాలను స్థిరపరచడంలో తన స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లవచ్చుననే సంశయంతో నార్త్ కెరొలీనా ప్రభుత్వం కలడెల్ఫియాకు తన ప్రతినిధులను పంపడం మానివేసింది. శక్తిమంతమైన కేంద్రప్రభుత్వం ఏర్పడితే తనకు స్వాతంత్ర్యం ఉండదేమోనని అది భయపడింది.

రాజ్యాంగ చట్టాన్ని అనుసరించి ప్రభుత్వాధికారులను ఎన్నుకొని, ప్రభుత్వాన్ని కంట్రోలులో ఉంచవలసిన ప్రజలు విభిన్న సంతతులవారు; విభిన్న విశ్వాసాలు, ప్రయోజనాలు కలవారు. వారిలో అధిక సంఖ్యాకులు ఇంగ్లండునుంచి వచ్చారు. మిగిలినవారు స్వీడన్, నార్వే, ఫ్రాన్సు, హాలెండ్, ప్రష్యా, పోలెండ్, ఇంకా ఇతర దేశాలనుంచి వచ్చారు. వారందరు నూతన ప్రపంచ (అమెరికా) సృష్టికి తోడ్పడ్డవారే. వారు వేర్వేరు మతవిశ్వాసాలు కలవారు. వారిలో జమిందారులు, శక్తిమంతులు, నిరుపేదలు, ఋణగ్రస్తులు, అమెరికాలో పనులకై పంపబడిన బందీలు మొదలైన పలురకాలవారున్నారు. అదేవిధంగా రైతులు, వ్యాపారస్థులు, యంత్రనిపుణులు, నావికులు, సైనికులు, సాహసోపేతులు, సాలెవారు, కమ్మరులు, ఒక రేమిటి అన్ని జాపతులవారూ ఉన్నారు. అందుచేత. అమెరికాకు వచ్చిన ప్రజలలో సయితం ఎన్ని విభేదాలుండాలో అన్నీ ఉన్నాయి. భావస్వాతంత్ర్యం మొదలైనవి కలవారి మధ్య ఎన్ని విభేదాలుంటాయో వారిలో కూడా అన్నీ ఉన్నాయి. బ్రిటన్ ఆధిపత్యాన్ని తొలగించుకో డానికి దిగ్విజయంగా సాగిన విప్లవాన్ని కొందరు ప్రతిఘ

టించారుకూడా. ఈ ప్రత్యర్థులు యుద్ధం పనికిరాదని వాదించారు. అయితే, మరేమార్గం అవలంబించాలో గురించి కూడా వారిలో ఏకాభిప్రాయం లేదు.

అప్పటినుంచి అమెరికా ప్రజానీకంలో విభిన్న విధానాలు, దృక్పథాలు, స్వభావాలు వృద్ధిపొందుతూనే వచ్చాయి ఆదిలో గల పదమూడు కాలనీల ప్రజలు ఇంకా పశ్చిమదిశకు విస్తరించారు. క్రొత్తవారు అమెరికాకు వచ్చారు. ఈవిధంగా తూర్పుతీరంనుంచి పశ్చిమతీరంవరకు అమెరికా అంతటా వలసలు ఏర్పడ్డాయి. రెండు తీరాలమధ్య గల 3000 మైళ్ళ పొడవునా గ్రామాలు, పట్టణాలు వెలిసినవి. అనంతమైన ప్రకృతి సంపదలుగల ప్రాంతాలలో ప్రజలు స్థిరపడ్డారు. సారవంతమైన భూములు కొల్లలుగా ఉన్నాయి. కలప, బొగ్గు, రాగి, ఇనుము, పెట్రోలు, నదులు—వీటితో నిండిన దేశం అది.

అందుచేత, అనేక ఇతర దేశాలనుంచివచ్చిన నిపుణులు వీటిని వృద్ధిచేశారు. వారు నైపుణ్యం కలవారేకాక, వివిధ సాంప్రదాయాలు కలవారు. అమెరికాజాతి అభ్యున్నతి పొందుతున్నకొలది, ఒకే ప్రయోజనంకలవారు ఒక వర్గంగా ఏర్పడుతూ, తమ తమ వ్యాపారాలను అభివృద్ధి చేసుకున్నారు. బాస్టన్ నగరంలో ఓడలుగల ఒక వ్యాపారస్థుడున్నా డనుకోండి. అతడు వ్యాపార సరళికి ఎట్టి అవరోధాలు పనికిరావని వాదించేవాడు. ఇల్లినాయిస్ రాష్ట్రంలో ఒక పింగాణీ పారిశ్రామికు డున్నాడనుకోండి. అతడు తన పరిశ్రమను క్రొత్తగా ప్రారంభించాడు. విదేశీసరకులు తన సరకులతో పోటీ రాకూడ

దనే తలంపుతో విదేశీ పింగాణీ సరకులమీాద పన్ను విధించా లనేవాడు. నెబ్రాస్కా రాష్ట్రంలోని రైతు తన సరకులను రవాణా చెయ్యడానికి తక్కువ రేట్లు ఉండాలనేవాడు. ధాన్యా నికి ధర అధికంగా ఉండాలనేవాడు. కాని, ఆ ధాన్యాన్ని రవాణా చేసేవారు ఎక్కువ రేట్లు కావాలనీ, వాటిని కొనే వారు అవి చవుకగా లభించాలనీ అనేవారు.

మొదట్లో ఈవిధంగా ఉంటే, ఆ తరువాతి సంవత్సరాలలో ప్రాంతీయ పక్షపాతాలు కూడా బయలుదేరాయి. న్యూయార్కు బ్యాంకరు అభిప్రాయం ఒకటైతే, దక్షిణ రాష్ట్రాలలోని ప్రత్తిపంటదారుల, లేదా టెక్సాస్‌లోని పశు వుల యజమానుల అభిప్రాయం మరొకటి అయేది. రైతులు మొదలైనవారు ఒకటి వాంఛిస్తే, బ్యాంకర్లు మొదలైనవారు మరొకటి వాంఛించారు. అయితే, ఆ రైతులు మొదలైన వారికికూడా ఏకాభిప్రాయ మనేది లేదు.

రాజ్యాంగ చట్టాన్నిబట్టి ఏర్పడిన రిపబ్లిక్ ప్రభుత్వంలో ఈ వివిధ వర్గాల వారందరు ఉండవలసిందే. అదేసమయంలో ప్రజల ప్రాథమిక స్వత్వాలను కాపాడాలి. పదమూాడు కాల నీలలోను 40,00,000 మంది ప్రజలున్నారు. వారందరినీ కూడ గట్టుకొని, బలీయమైన యూనియన్‌ను ఏర్పరచాలి. తన స్వాతంత్ర్యానికి భంగం కలిగినట్లు ఏవొక కాలనీ భావించని రీగా యూనియన్‌ను కట్టుదిట్టం చెయ్యాలి.

రాజ్యాంగ చట్టాన్ని తయారుచేసిన నాటికి అమెరికను లకు స్వపరిపాలనలో గల అనుభవం ఉపకరించింది. కాని, అది

అంతంత మాత్రమే. కాన్ఫెడరేషన్ తొలి సూత్రాల ననుసరించి ఏర్పాటు చెయ్యబడిన రాజ్యాంగ పరిషత్తుకు ఫెడరల్ ప్రభుత్వమని పేరుపెట్టారు. దాని కొసగబడిన అధికారాలు స్వల్పమైనవి. అందుచేత, జాతీయ ప్రాముఖ్యంగల అంశాలపై కాలనీలు తీసుకోదగు చర్యలనుగురించి అది సలహాలు మాత్రమే ఇవ్వగలిగింది. పన్నులు విధించడానికిగాని, సైన్యాన్ని స్థాపించడానికిగాని, రాష్ట్రాలైన కాలనీల ప్రభుత్వాలు శిరసావహించేలాగ శాసనాలు చెయ్యడానికిగాని దానికి అధికారం లేదు. కేంద్ర ప్రభుత్వాధికారాలు, రాష్ట్ర ప్రభుత్వాధికారాలు సరిగా నిర్వచించ బడలేదు. ఈ ఫెడరల్ ప్రభుత్వస్థాపనవల్ల కలిగిన అనుభవం, ఇటువంటిది ఫలప్రదంగా పనిచెయ్య జాలదని మాత్రమే.

పోతే, పట్టణాల, నగరాల, రాష్ట్రాల స్వపరిపాలన విషయంలోమాత్రం తగినంత అనుభవం కలిగింది. స్థానిక స్వపరిపాలనలు అతి చక్కగా జరిగాయి. అమెరికా ఈశాన్య రాష్ట్రాల చిన్నపట్టణాలలో ప్రజలు సమావేశాలు జరిపి, తమ అవసరాలనుగురించి వాటిలోనే నిర్ణయించుకొనేవారు. వోటింగు హక్కుగల ప్రతివ్యక్తి ఆ సమావేశాలలో తన అభిప్రాయాలను తెల్పేవాడు. ప్రతి రాష్ట్రానికి ఒక గవర్నరు ఉండేవాడు; రాష్ట్ర శాసనసభ ఉండేది. శాసన సభల ప్రతినిధులను ప్రజలు ఎన్నుకొనే వారు.

ఏమైనా పట్టణాలలోనేమి, నగరాలలో నేమి, రాష్ట్రాలలోనేమి స్వపరిపాలనలో ప్రజలకు తగినంత అనుభవం

కలిగింది. నేటి పరిస్థితులతో పోల్చినట్లయితే, విప్లవానంతరం రోజులలో పరిపాలనా వ్యవహారాలను చక్కబెట్టడం కష్టమనిపించదు. అయితే, పదమూడు రాష్ట్రాల ప్రజలకు అంగీకార యోగ్యమైన పద్ధతిగా రిపబ్లిక్ పనిచేయడమంటే, తద్విధంగా నియమావళిని రూపొందించడమంటే సులభకార్యమనుకోరాదు. అప్పటి సమస్యలనేకాక, ఆ తరువాత రాగల సమస్యలనుకూడా యోచించుకోవాలి.

రెండు శతాబ్దాలలో అమెరికాలో రాగల పరిణామాలను ఆ రాజ్యాంగ చట్టరచయితలు ఊహించలేక పోయినప్పటికీ, తగినన్ని మార్పులు రాగలవని మాత్రం ఊహించగలిగారు. అందుచేత, అవసరమైనప్పుడుమాత్రం రాజ్యాంగ చట్టాన్ని సవరించవచ్చునని ఒక సూత్రం చేశారు. వారా సూత్రాన్ని చేర్చడంలో ఎంత వివేకం చూపారో కాలక్రమాన గ్రహించబడింది. రాజ్యాంగ చట్టానికి ఆ తరువాత ఇరవై సవరణలు చెయ్యబడ్డాయి. తద్విధంగా అది ఎప్పటికప్పుడు ఆధునిక రాజ్యాంగ చట్టంగా, ఫలప్రదంగా చెయ్యబడుతూ వచ్చింది.

రాజ్యాంగ చట్ట నిర్మాతలు ఎటువంటి సమస్యలను ఎదుర్కోవలసి వచ్చినప్పటికీ, అది అమెరికా ప్రభుత్వ నిర్మాణ విధానాన్ని నిర్ణయించింది. ఆ విధానం గత ఒకటిన్నర శతాబ్దంగా ప్రజల కుపకరించింది. అప్పట్లోగల పదమూడు రాష్ట్రాలకుగల సమస్యలు, అవసరాలు బహుస్వల్పం. వాటన్నింటికీ అది అనుగుణంగా రూపొందించబడింది. ఇప్పుడు

ప్రజల సమస్యలు, అవసరాలు ఇన్నీ అన్నీ కావు. వీటన్నింటికీ కూడా అదే రాజ్యాంగచట్టం అనుగుణంగా ఉన్నది. అంత నిర్దుష్టంగా అది తయారు చెయ్యబడింది. అప్పుడు పదమూడు రాష్ట్రాలుమాత్రమే ఉంటే ఇప్పుడు 48 రాష్ట్రాలు, 3000 మునిసిపాలిటీలు, సుమారు 1,50,000 పంచాయతీ బోర్డులు మొదలైనవి ఉన్నాయి. కొన్ని రాష్ట్రాలు విస్తీర్ణంలో అనేక యూరప్ దేశాలకంటె పెద్దవి. ప్రతిరాష్ట్రం జిల్లాలుగాను, తాలూకాలుగాను విభజించ బడింది. నగరాలలో పెద్దవీ ఉన్నాయి; చిన్నవీ ఉన్నాయి. మహానగరమైన న్యూయార్కులో 70,00,000 మందికిపైగా ఉన్నారు. న్యూయార్కు నగర పాలనకు సాలీనా 1,00,00,00,000 డాలర్లు ఖర్చవుతాయి. ఇక్కడ ప్రపంచంలోని ఇంచుమించు అన్ని ప్రాంతాల వారూ ఉన్నారు. దక్షిణ డకోటారాష్ట్రంలోని ఒక గ్రామం జనాభా ఆరుమంది. మిగిలిన గ్రామాల, పట్టణాల, నగరాల జనాభాలు ఈ రెండింటిమధ్య ఉంటాయి.

ప్రతి ప్రాంతానికి స్థానికప్రభుత్వం కలదు. ప్రతి స్థానిక ప్రభుత్వానికి రాజ్యాంగచట్టం పరిమితులలో స్వాతంత్ర్యం ఉన్నది. అత్యవసర పరిస్థితులలో తప్ప, స్థానిక ప్రభుత్వాల చర్యల విషయంలో రాష్ట్ర ప్రభుత్వాలు జోక్యం కలిగించుకోరాదు. అదేవిధంగా రాష్ట్రప్రభుత్వాలకు అనేక అధికారాలున్నాయి. వాటికి ఫెడరల్ ప్రభుత్వం భంగం కలిగించకూడదు.

తరచుగా రెండు రాష్ట్రాలకో, ఇంకా ఎక్కువ రాష్ట్రాలకో సమానంగా సంబంధించిన సమస్యలు ఉత్పన్నమౌతూ

ఉంటాయి. అటువంటి సందర్భాలలో సాధారణంగా సమష్టి కృషివల్ల ఆ సమస్యలు పరిష్కరించబడుతాయి. అన్నిచోట్లా పాఠశాలలను స్థాపించవలసిన పూచీ పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వాలదే. విద్యాప్రచారం రాష్ట్రప్రభుత్వాలదే. విద్యాప్రచారం రాష్ట్ర ప్రభుత్వాల పూచీ అయినట్లే ఫెడరల్ ప్రభుత్వం పూచీకూడా. అందుచేత, ఫెడరల్ ప్రభుత్వం ఆ పాఠశాలల, కళాశాలల స్థాపనకు ధనసహాయం చేస్తుంది. మునిసిపాలిటీలలో పేద ప్రజలకోసమై చిన్నయిళ్ళు కట్టడానికీ, అపరిశుభ్ర ప్రాంతాలను పరిశుభ్రం చెయ్యడానికీ రాష్ట్ర ప్రభుత్వాలు, ఫెడరల్ ప్రభుత్వం సహాయపడిన సందర్భాలెన్నో ఉన్నాయి. అప్పుడప్పుడు స్థానిక, రాష్ట్ర, ఫెడరల్ ప్రభుత్వాలు తమతమ అధికారాలను గురించి వివాదాలు పడడం కలదు. అటువంటివాటిని కోర్టులద్వారా పరిష్కరించుకుంటారు. లేదా, చట్టాలను విస్పష్టంగా వివరించుకొని పరిష్కరించు కుంటారు.

అమెరికా సాటిలేని అభివృద్ధి పొందినప్పటికీ, స్వపరిపాలనా విధానంలో మార్పు కలుగలేదు. రాజ్యాంగ చట్టాన్ని అనుసరించి ఏర్పాటు చెయ్యబడిన స్వపరిపాలనా విధానం అన్ని పరీక్షలకు తాళగలిగింది. ప్రభుత్వాన్ని స్వయంగా నడుపుకొంటున్న ప్రజలకు కార్యరూపంలో సుస్థిరమైన ప్రయోజనాలను చేకూర్చింది.

# 2

# రాజ్యాంగచట్టం రచన, ఆమోదము

అమెరికా రిపబ్లిక్ కు పునాదియైన రాజ్యాంగచట్టం రచనకు సమావేశమైన పరిషత్సభ్యులు ఒక్క ప్రధాన సూత్రంలో మాత్రమే ఏకగ్రీవాభిప్రాయం కలవారు. శక్తివంతమైన కేంద్ర ప్రభుత్వం అత్యవసరమని సభ్యులందరు గ్రహించారు. ఆదిలోగల పదమూడు కాలనీలతో ఏర్పడిన కాన్ఫెడరేషన్ ఈ రాజ్యాంగ పరిషత్తుకు పూర్వం ఎనిమిది సంవత్సరాలు పనిచేసింది. ఈ ఎనిమిది సంవత్సరాలుకూడా అది చేసినవన్నీ పొరపాటులే; చేసినవన్నీ తెలివి తక్కువ పనులే. అందుచేత, వివిధ కాలనీల ప్రభుత్వాలపై పెత్తనం వహించగల ఒక కేంద్ర ప్రభుత్వంలేని లోటు కనిపించింది. ఒక్కొక్క కాలనీయే వేరుపడిపోగల సూచనలుకూడా ప్రారంభమయాయి. పరస్పర అవిశ్వాసంకూడా జనించింది. అందుచేత, వెంటనే ఈ పరిస్థితులను నివారించకపోతే విషమ పరిణామా లేర్పడగలవు. ప్రతికాలనీ ప్రభుత్వం మిగతావి ఏమైపోతే తన కేమనే ధోరణివహించి, సొంత వ్యవహారాలను గురించి మాత్రమే ఎక్కువ శ్రద్ధవహించేది. విదేశ శత్రువు ముట్టడి జరిపే పక్షంలో ఈ కాలనీ లన్నీ సమష్టి రక్షణకు సమకట్టక పోవచ్చు ననడానికి ఇదే నిదర్శనం.

ఫెడరల్ ప్రభుత్వానికి ఒసగవలసిన అధికారాలను గురించి రాజ్యాంగ పరిషత్సభ్యులలో అనేక భేదాభిప్రాయా లేర్పడ్డాయి. కేంద్రప్రభుత్వానికి విశేషాధికారాల నిస్తే తమ స్వాతంత్ర్యానికి అవరోధం కలగగలదని పదమూడు కాలనీ

లలోకూడా ప్రతికూలవర్గాలు తీవ్ర మయాయి. కేంద్రప్రభు త్వాధికారానికి లోబడడం వారికి సమ్మతంకాదు. మిగిలిన వర్గాలవారు శక్తివంతమైన కేంద్ర ప్రభుత్వం ఏర్పడాలనీ, అన్ని కాలనీల ప్రభుత్వాల వ్యవహారాల విషయంలో జోక్యం కలిగించుకోడానికి దానికి అధికార ముండాలనీ కోరారు.

ఈ ప్రధాన వివాదానికి తోడు ఇంకా అనేక విషయా లలోకూడా అభిప్రాయభేదా లున్నాయి. రాజ్యాంగ పరిషత్తు లోని ప్రతి సభ్యుడు మొదట తన కాలనీ ప్రయోజనాల కోసమే చూస్తూ, దానిపట్ల మాత్రమే తన భక్తి చూపు తున్నాడు. అంతేకాదు. ఆ సభ్యుడు ఏ వర్గానికి చెందినవాడో ఆవర్గంవారి ప్రయోజనాలను మాత్రమే ఎక్కువగా కాంక్షి స్తున్నాడు. తోటలు గలవాడైతే తోటల యజమానుల పక్షాన, కర్షకుడైతే కర్షకుల పక్షాన, వర్తకుడైతే వర్తకుల పక్షాన పల్కుతున్నాడు. వీటికితోడు పరిషత్సభ్యుల ఆచార వ్యవహారాలలో, రాజకీయ, మత విశ్వాసాలలో అనేక వ్యత్యాసా లున్నాయి.

రాజ్యాంగ పరిషత్తులో చర్చలకు కాలనియతి లేదు. చర్చల ఫలితంగా అందరికీ సమానావసరాలైన కొన్ని అంశాలు వ్యక్తమయాయి. భేదాభిప్రాయాలు క్రమంగా సన్నగిల్లజొచ్చాయి. ఈ క్రింది విషయాలు స్పష్టపడ్డాయి:

కాన్ఫెడరేషన్ సూత్రాలవల్ల అన్ని కాలనీలు అనవసరంగా బాధపడ్డాయి.

అన్ని కాలనీల అవసరాలు ఇంచుమించు ఒక విధమైనవే. చట్టాలను గురించి, స్వాతంత్ర్యం గురించి, స్వపరిపాలనాధికారం గురించి ఒకే విధమైన ఉద్దేశ్యాలు కలవి.

విదేశీయుల దండయాత్రను ఎదుర్కోడానికి ఏ ఒక్క కాలనీకి శక్తి సామర్థ్యాలు లేవు.

తన విదేశ వాణిజ్యాన్ని కాపాడుకోడానికి ఏ ఒక్క కాలనీకి శక్తి లేదు.

ఏ కాలనీకి ఆ కాలనీ చర్యలు తీసుకొనే యెడల అమెరికన్ ఇండియనుల (ఆదిమవాసులు) సమస్య పరిష్కారం కాజాలదు.

ఏ కాలనీకి ఆ కాలనీ కాలువలు మొదలైన జల మార్గాల్ని వృద్ధిపరచుకొనజాలదు.

వాణిజ్య సరళికి, ప్రయాణ సౌకర్యాలకు, పోష్టు సౌకర్యాలకు దేశమంతటా గొలుసుకట్టుగా రోడ్లు అవసరం.

వివాద గ్రస్తమైన అంశాలనుగురించి సభ్యులు వాదోపవాదాలు జరిపారు. తమ ప్రత్యేక ప్రయోజనాలను గురించి వివరించారు. పరిష్కార మార్గాలను గురించి తర్జన భర్జనలు చేశారు. ఈ విధంగా నాలుగు నెలలు జరిగింది. వాదోపవాదాలు తప్ప అసలు పనులు జరుగవేమోనని అనేకసార్లు కొందరు భయపడ్డారుకూడా. కేంద్రప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యాలనే సాకుతో పెద్ద కాలనీలు తమరిని అణచివుంచుతాయని చిన్న కాలనీల ప్రతినిధులు భయంచెంది, పరిష

త్సమావేశంనుంచి వెడలిపోయారు కూడా. అనేక సమస్యల విషయాల్లో సభ్యులు రాజీపడుతూ రావడంవల్ల చివరకు భేదాభిప్రాయాలు తొలగిపోయాయి. కాంగ్రెసులోని ఒక శాసన సభలో పెద్ద కాలనీలతో సమానంగా చిన్న కాలనీలకు కూడా ప్రాతినిధ్యం ఇవ్వడంతో వాటి అనుమానాలు తొలగిపోయాయి. కాలనీ విస్తీర్ణం, జనాభాలతో నిమిత్తం లేకుండా ప్రతిదానికీ సెనేటులో ఇద్దరు ప్రతినిధు లుంటారు. ఇది యిలావుండగా, ప్రభుత్వానికి ఎక్కువ పన్నులు చెల్లించే పెద్ద కాలనీలకు ఎక్కువ ప్రాతినిధ్యం ఉండాలి గదా. వాటికి కాంగ్రెసులోని ప్రతినిధుల సభలో కాలనీల జనాభా నిష్పత్తిని బట్టి ప్రతినిధు లుంటారు. ప్రతినిధులసభలో పెద్ద కాలనీలకు ఎక్కువమంది ప్రతినిధు లుంటా రన్నమాట. కాబట్టి, ఫెడరల్ ప్రభుత్వాదాయాన్ని పెంచడానికి, ఆ ధనాన్ని వ్యయపరచే కేటాయింపులు చెయ్యడానికి ప్రతినిధుల సభకు అధికార మిచ్చారు.

నూతన ప్రజాస్వామిక విధానాన్ని సుస్థిరం చెయ్యడానికి మహత్తర బాధ్యత వహించిన పరిషత్సభ్యులలో అమోఘ ప్రజ్ఞావంతులైన కొందరు నాయకు లున్నారు. వారందరిలో ప్రపంచఖ్యాతి చెందిన జార్జ్ వాషింగ్టన్ కూడా ఉన్నాడు. ఆయనే సభ కధ్యక్షత వహించాడు. ఆయన మేధాసంపన్నుడు; దూరదృష్టి గలవాడు. కాంటినెంటల్ సైన్యానికి సర్వ సేనాపతిగా పనిచేసినవాడు గనుక వివిధ కాలనీల ప్రజల స్థితిగతులను గురించి, వారి సమస్యలను గురించి సంపూర్ణ

సమాచారాలు ఆయనకు తెలుసు. సాహిత్యవేత్త, శాస్త్రవేత్త, రాజనీతి చతురుడు అయిన బెంజమిన్ ఫ్రాంక్లిన్ కూడా వారిలో ఒకడు. రాజ్యాంగ పరిషత్సమావేశం అవిఘ్నంగా కొనసాగడానికి ఆయన శాయశక్తులా కృషిచేశాడు. అదే విధంగా వర్జీనియావాసి జేమ్స్ మాడిసన్, న్యూయార్క్‌వాసి గవర్నర్ మారిస్, పెన్సిల్వేనియావాసి జేమ్స్ విల్సన్ అటువంటివారే. శక్తిమంతమైన ఫెడరల్ ప్రభుత్వం ఏర్పడాలని అనర్గళంగా వాదించిన ప్రజ్ఞాధురీణుడు, యువకుడు అయిన అలెగ్జాండర్ హామిల్టన్ కూడా వారిలో ఉన్నాడు. ఆయన న్యూయార్క్‌వాసి.

ఈ పెద్దలు, తదితరులు చేసిన సూచనలు కేవలం సొంతంగా చేసినవి కావు. వ్రాతమూలకంగా లేని బ్రిటిష్ రాజ్యాంగ చట్టంనుంచి అనేక అంశాలను, సూత్రాలను గ్రహించారు. కాలనీలకు ఆదిలో ఇంగ్లీషుప్రభుత్వం ఇచ్చిన ఛార్టరులనుంచి కొన్ని గ్రహించారు. ఇవి కాలనీల ప్రజలకు చిర పరిచితాలే. ఛార్టర్లలోని అనేక అంశాలు వారి కామోదకరమైనవే కూడా. ప్రభుత్వ ప్రధానలక్ష్యాలకు భంగం కలుగనీయకుండా వారికి ముఖ్య సహాయకారిగా స్వాతంత్ర్య ప్రకటన పత్రం ఉన్నది. దానిలోని సారాంశం—ప్రజాసేవ చెయ్యడం; ప్రధాన స్వత్వాలను కాపాడడమే ప్రభుత్వవిధి అనేవి. కాలనీల రాజ్యాంగచట్టాలు, కాన్ఫెడరేషన్‌లోని కొన్ని సూత్రాలు కూడా తోడ్పడ్డాయి. వాటివలన పాత తప్పులు చెయ్యకుండా సభ్యులు జాగ్రత్తపడ్డారు.

వీటన్నింటికీ తోడు అనేకమంది సభ్యులకు ప్రభుత్వం ఎట్టి రాజకీయ సూత్రాలమీద ఏర్పడాలో గురించి సొంత అభిప్రాయాలు కూడా ఉన్నాయి. ఇతర దేశాలలోని రాజకీయ సిద్ధాంతుల అభిప్రాయాలనుంచి కొన్ని విషయాలు గ్రహించారు. ఫ్రెంచి రచయిత మాంటెస్ క్యూ రచనలనుంచి, ఇంగ్లీషు రాజకీయ సిద్ధాంతి జాన్ లోక్ రచనలనుంచి గవర్నర్ మారిస్ ఒక విషయం గ్రహించాడు. అది కేంద్రప్రభుత్వ అధికారాన్ని మూడు శాఖలుగా విభజించాలనేది—శాసనసభ, కార్యనిర్వహణ శాఖ, న్యాయ శాఖ.

ఒక వేసవికాలమంతా చర్చలు జరిగిన తరువాత రాజ్యాంగచట్టం తుది ముసాయిదాను వ్రాయవలసిందని వారు గవర్నర్ మారిస్‌ను కోరారు. ఆయన ఈ పనిని 1787 సెప్టెంబరు మధ్యనాటికి పూర్తిచేసి, సభ్యుల సంతకాలకై అందజేశాడు. అప్పుడు కొందరు సభ్యులు హాజరుకాలేదు. మరికొందరు సంతకాలు చెయ్యడానికి నిరాకరించారు. మొత్తంమీద 39 మందిమాత్రం సంతకాలు చేశారు. మరొక పనికూడా మిగిలి ఉన్నది. రాజ్యాంగచట్టం ప్రతులను తయారు చేసి, కాలనీ ప్రభుత్వాల ఆమోదానికై పంపించాలి—దీనిని ధ్రువపరచడ మంటారు. ఈ రాజ్యాంగచట్టం ఫలప్రదంగా పనిచెయ్యాలంటే కనీసం తొమ్మిది కాలనీ ప్రభుత్వాలు ఆమోదించాలి.

రాజ్యాంగచట్టం ప్రతిమీద సభ్యులు సంతకాలు చేస్తున్నప్పుడే, కాలనీలు దానిని ధ్రువపరచడం సులభంగా జరిగేది.

కాదనీ, లేదా సర్వాంగీకారం పొందేది కాదనీ తేలింది. డెలవేర్ కాలనీ శాసనసభవారు దానిని ఓం ప్రథమంగా, ఏకగ్రీవంగా ఆమోదించారు. న్యూ జెర్సీ, జార్జియా రాష్ట్రాలు కూడా అదేవిధంగా చేశాయి. పెన్సిల్వేనియా, కనెక్టికట్ కాలనీల శాసనసభలలో అధిక సంఖ్యాకుల సమర్థనతో ఆమోదించబడింది. మసాచుసెట్స్‌లో తీవ్రంగా పోటాపోటీ ఏర్పడింది. రాజ్యాంగచట్టాన్ని ఆమోదిస్తున్నామని తీర్మానం చేసి, చట్టంలో కొన్ని సవరణలు చెయ్యాలనికూడా సూచిస్తూ మసాచుసెట్స్ శాసనసభలో ప్రతిపాదించారు. ఈ తీర్మానం ఆమోదించబడింది గాని, పెద్ద మెజారిటీ రాలేదు. నూటికి పదివంతుల మెజారిటీతో ఆమోదించబడింది. సంవత్సరాంతంలోపుగా మేరీల్యాండ్, దక్షిణ కెరోలినా, న్యూ హాంప్‌షైర్‌లుకూడా రాజ్యాంగచట్టం ముసాయిదాను ఆమోదించాయి. వీటితో కలిపి అవసరమైన తొమ్మిది కాలనీలు ఆమోదించాయి. రాజ్యాంగచట్టం ఆచరణలోకి వచ్చింది.

ఏమైనా, మూడు ముఖ్యమైన, శక్తిమంతమైన కాలనీలు— న్యూయార్క్, వర్జీనియా, ఉత్తర కెరోలినా—చిన్న కాలనీ అయిన రోడ్ దీవి రాజ్యాంగచట్టాన్ని ఆమోదించలేదు. రాజ్యాంగ పరిషత్సభకు హాజరైన ఆరుగురు వర్జీనియా సభ్యులలో ముగ్గురు సంతకాలు చెయ్యడానికి ఇష్టపడలేదు. కాన్ఫెడరేషన్‌లోని కాలనీ లన్నింటిలో పెద్దదైన వర్జీనియా శాసనసభ్యులు రెండు వర్గాలుగా చీలిపోయారు. కాని, వాషింగ్టన్

ప్రభావంవల్ల తుదకు కొద్ది మెజారిటీతో రాజ్యాంగచట్టం ధ్రువపరుచబడింది.

న్యూయార్క్‌లో తగినంతమందిని అనుకూలురుగా చెయ్యాలని అలెగ్జాండర్ హామిల్టన్, జేమ్స్ మాడిసన్, జాన్ జే ప్రయత్నాలు చేశారు. రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించవలసిన కారణాలను పేర్కొంటూ వారు 85 వ్యాసాలు వ్రాశారు. ఈ వ్యాసాలన్నీ ఆ పిమ్మట "ది ఫెడరలిస్ట్" అనే పేరుతో ఒక పుస్తకరూపంలో ప్రకటించబడ్డాయి. ఈనాటికి కూడా అది అమెరికా ప్రభుత్వ స్వభావం తెలుసుకోడానికి మంచి పుస్తకం. చివరకు న్యూయార్క్ కాలనీ శాసనసభలో మూడువోట్ల మెజారిటీతో మాత్రమే రాజ్యాంగచట్టం ధ్రువ పరుచబడింది. ఆ మూడువోట్ల మెజారిటీకి ఈ ముగ్గురు నాయకులు కారకులని అనేకమంది చరిత్రకారులు భావిస్తున్నారు. అనుకూలంగా 30 మంది, ప్రతికూలంగా 27 మంది వోటు చేశారు.

చివరకు ఉత్తర కెరోలినా రాష్ట్రంకూడా ధ్రువపరచింది. చిన్న కాలనీగా తన బ్రతుకు దుస్సాధ్యం కాగలదనే భావంతో రోడ్ దీవికూడా 1790 మే లో ఆమోదించింది.

ఆవిధంగా, ఒక క్రొత్తపద్ధతిగల ప్రభుత్వానికి పునాది వంటి పత్రం రచించబడడం, అది వివిధ ప్రభుత్వాలచేత ఆమోదించబడడం జరిగింది. సుదీర్ఘ చర్చల పిమ్మట ఈ రాజ్యాంగ విధానం తయారైంది. దీనిని బలపరచిన వారిలో అనేకమంది సంశయిస్తూనే బలపరచారు. కాలనీల

ప్రభుత్వాలు ఆమోదించడంలో అనేక చిక్కు లేర్పడ్డాయి. చివరకు అవన్నీ తొలగిపోయాయి.

తొమ్మిది కాలనీల ప్రభుత్వాలు రాజ్యాంగచట్టాన్ని ఆమోదించిన పిమ్మట ప్రజలు నూతన ప్రభుత్వ నిర్మాణానికి పూనుకున్నారు. కాంగ్రెసుకు ఎన్నికలు జరపడం మొదటి మెట్టు. వోటింగు అర్హత కలవారందరు ప్రతినిధుల సభా సభ్యులను ఎన్నుకున్నారు. రాష్ట్ర శాసనసభ్యులు ఇద్దరేసి సెనేటు సభ్యులను ఎన్నుకున్నారు. తరువాత ప్రెసిడెంటు ఎన్నిక జరగవలసి ఉన్నది. ప్రతి రాష్ట్రంలోని వోటర్లు కొందరు పెద్దలను నిర్ణయించి, ప్రెసిడెంటును ఎన్నుకొనడంలో తమ రాష్ట్రం తరఫున వ్యవహరించాలన్నారు. ఈ పెద్దలందరు కలిసి మొదటి ప్రెసిడెంటును, మొదటి వైస్ ప్రెసిడెంటును ఎన్నుకోడానికి సమావేశమయారు. న్యూయార్కు నగరాన్ని తాత్కాలిక రాజధానీ నగర మన్నారు. అమెరికా స్వాతంత్ర్యాన్ని సాధించిన మహానీయుడు, నాయక శిఖామణి అయిన జార్జ్ వాషింగ్టన్ అక్కడే 1789 ఏప్రిల్ 30 వ తేదీన మొట్ట మొదటి ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డాడు. మసాచుసెట్స్‌వాసి జాన్ ఆడమ్స్ మొట్ట మొదటి వైస్ ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డాడు. మేరీల్యాండ్, వర్జీనియా రాష్ట్రాలు ప్రభుత్వ భవనాల నిర్మాణానికి కొంత ప్రాంతాన్ని విరాళమిచ్చాయి. ఆ ప్రాంతాన్నే డిస్ట్రిక్ట్ ఆఫ్ కొలంబియా అంటారు. ఇది సర్వస్వతంత్ర ప్రాంతం. ఫెడరల్ ప్రభుత్వ భవనాలుగల వాషింగ్టన్ నగరం ఇదే.

# 3

# రాజ్యాంగ చట్టము - ప్రభుత్వాధికారానికి మూలము

అమెరికా ప్రభుత్వ కార్య నిర్వహణ విధానంలో రాజ్యాంగ చట్టం తిరుగులేనిది. ప్రభుత్వానికి గల అధికారాల నిచ్చేది అదే. కేంద్ర ప్రభుత్వం ఎంతవరకు చర్యలు తీసుకో వచ్చునో, ఎటువంటి హద్దులలో ఉండాలో అది నిర్వచిస్తుంది. ప్రభుత్వంలోని మూడు ప్రధాన శాఖలయొక్క — కార్య నిర్వాకశాఖ, శాసనశాఖ, న్యాయశాఖ — ప్రత్యేక విధులను, బాధ్యతలను అది కేటాయిస్తుంది. దాని ద్వారానే తుది నిర్ణయాధికారం ప్రజల — వోటరుల — పరమై ఉంటుంది.

ఎన్నికలద్వారా, లేదా నియామకాల ద్వారా అధికారు లకు, తమ విధుల నిర్వహణకు అవసరమైన అధికారా లను ప్రజలే ఇస్తారు. ఎంత పెద్ద పదవినుంచైనా సరే అధికారులు బర్తరఫ్ చెయ్యబడగలరు. ఇందుకు రెండు పద్ధతు లున్నాయి. ఒకటి, మామూలు పద్ధతిలో పదవినుంచి తొల గించడం; రెండు, బొత్తిగా తెలివి తక్కువగానో, అవినీతి కరంగానో ప్రవర్తించిన అధికారిమీద కేసు బనాయించి (ఇంపీచ్ మెంట్) బర్తరఫ్ చెయ్యడం ; తిరిగి ఎన్నికల ద్వారా వారిని ప్రజలు ఆ పదవులలోనే ఉంచవచ్చు ; లేదా వారి స్థానంలో మరొకరిని నియమించుకోవచ్చు.

ఎట్టి పరిస్థితులలోనైనాసరే ప్రతిపౌరుని ప్రాథమిక స్వత్వా లకుగాని, ప్రయోజనాలకుగాని భంగం కలిగించబడదని, అవి తగ్గించ బడవని రాజ్యాంగ చట్టంలో గ్యారంటీలుకూడా కలవు.

అమెరికా ప్రభుత్వ పద్ధతిని ఫెడరల్ రిపబ్లిక్ అంటారు— ఫెడరల్ అంటే సమాన ప్రతిపత్తి గలవారు ఒప్పందం చేసుకొనడ మనే అర్థం. దానిలో ఉన్నవి జాతీయ ప్రభుత్వము, 48 వేర్వేరు రాష్ట్ర ప్రభుత్వాలున్నూ.

ఆది రాజ్యాంగ చట్టంలోని అధికభాగం ఫెడరల్ పద్ధతి స్థాపించడానికే ఉద్దేశించబడింది. శాసనశాఖ ఏ యే అంశాలపై చట్టాలను చెయ్యగలదో దానిలో పట్టిక యివ్వబడింది. కార్య నిర్వాహకశాఖ ప్రధానాధికారిగా ప్రెసిడెంటుకుగల అధికారాలు, విధులు వివరించబడ్డాయి. విదేశాలతో వ్యవహరించేటప్పుడు, రాయబారుల నియమించేటప్పుడు, ఇతర దేశాల ప్రతినిధులకు ఆహ్వాన మిచ్చేటప్పుడు కూడా ఆయనకు గల అధికారా లేటువంటివో దానిలో ఉదాహరించబడ్డాయి.

## ప్రభుత్వ సూత్రాలు

వీటికితోడు రాజ్యాంగ చట్టం కొన్ని ముఖ్యమైన సూత్రాలను నిర్దేశిస్తూంది :

ప్రభుత్వంలోని మూడు ప్రధాన శాఖలు : చట్టాలను ప్రతిపాదించి, ఆమోదించే శాసనశాఖ ;- ప్రభుత్వాన్ని నిర్వహించి, చట్టాలను అమలు పరచే కార్యనిర్వాహకశాఖ; చట్టాలకు నిర్వచనాలు చెప్పి, వివాదాలను పరిష్కరించే న్యాయశాఖ. ఈ మూడు ఒక దానితో ఒకటి సంబంధంలేనివి. ఇవి ప్రజలకు దేనికదే ప్రాతినిధ్యం వహించాలి. ఏ వొక శాఖకూడా మితిమీరిన అధికారాన్ని పొంది శక్తిమంతం

కాకుండా చెయ్యడానికై వాటి అధికారాలు పరిమితం చెయ్య బడ్డాయి. ఈ విధంగా చెయ్యడంవలన ఏ వొక శాఖకూడా సర్వ ప్రాబల్యంపొందకుండా మిగిలినవి అడ్డుపడుతూఉండగలవు.

రాజ్యాంగ చట్టము; కాంగ్రెసులో సక్రమంగా చెయ్య బడే చట్టాలు; ప్రెసిడెంటు అంగీకరించి, సెనేటు ఆమోదించే సంధులు — ఇవన్నీ కలిసి అమెరికా ధర్మశాస్త్రం.

ధర్మశాస్త్రం ఎల్లవారికి సమానంగా వర్తిస్తుంది. దానిని కాపాడడానికి ఎల్లవారికి సమానంగా హక్కున్నది. అన్ని రాష్ట్రాలు సమాన ప్రతిపత్తి కలవి. ఏ రాష్ట్రం విషయంలో కూడా జాతీయ ప్రభుత్వం ప్రత్యేకాభిమానం చూపరాదు.

ప్రతి రాష్ట్రం ఇతర రాష్ట్రాల చట్టాలను గుర్తించి, వాటిని మన్నించాలి.

ప్రతి రాష్ట్రానికి విధిగా రిపబ్లికన్ పద్ధతిగల ప్రభుత్వం ఉండగలదు. ఆ ప్రభుత్వ అంతిమాధికారం ప్రజలదే. ప్రజలు తమ ప్రభుత్వాధికారాలను ఉద్యోగులకు అప్పగించగలరు.

కాంగ్రెసులోని తమ ప్రతినిధుల ప్రతిపాదనల రూపంలో రాజ్యాంగ చట్టాన్ని సవరించుకోడానికి ప్రజలకు సదా అధికార మున్నది. ఆ సవరణను రాష్ట్రాలలో నాలుగింట మూడు వంతులు ఆమోదిస్తేనే అది అమలు జరుగగలదు.

## సవరణకు అవకాశాలు

రాజ్యాంగ చట్టం శాశ్వతంగా నిలవాలన్నా, జాతీయాభ్యున్నతికి అది అనుగుణంగా పరిణామం చెందుతూ ఉండాలన్నా సవరణలు అవసరం. రాజ్యాంగ చట్టం కర్తలు ఈ

విషయాన్ని గ్రహించారు. అయితే, చీటికీ, మాటికీ సవరణలు చెయ్యడానికి వీలుండకూడదనీ, సవరించడం సులభసాధ్యం కాకూడదనీ వారు భావించారు. పూర్వాపరాలు బాగా యోచించుకోనిదే, ప్రజలలో అధిక సంఖ్యాకులు ఆమోదించనిదే సవరణ జరగకూడదు. వాంఛనీయమైన మార్పునకు అల్ప సంఖ్యాకులు అడ్డుతగిలే అవకాశాలుకూడా ఉండరాదు. వీటన్నింటినీ రాజ్యాంగ చట్ట రచయితలు ఆలోచించారు.

తత్ఫలితంగా రాజ్యాంగ చట్టాన్ని సవరించడానికి కొన్ని పద్ధతులను ఏర్పాటు చేశారు. కాంగ్రెసులోని ఉభయ శాసన సభలలోకూడా మూడింట రెండువంతుల మంది సభ్యులు ఆమోదించే పక్షంలో సవరణ చెయ్యవచ్చు; లేదా మూడింట రెండువంతుల రాష్ట్రాల శాసనసభలు రాజ్యాంగ చట్టాన్ని సవరించాలని కోరితే ఆ విధంగా చెయ్యవచ్చు. రెండవ విధంగా జరిగినట్లయితే, కాంగ్రెసు సమావేశం విధిగా జరిగి, చర్చలు జరిపి, రాష్ట్రాలు కోరిన సవరణను చేసితీరాలి. అయితే, రాజ్యాంగ చట్టాన్ని ఈ రెండింటిలో ఏ పద్ధతిగా సవరించా లన్నప్పటికీ, రాష్ట్రాలలో నాలుగింట మూడు వంతులు ఆమోదించాలి. అంతేకాదు. రాష్ట్ర ప్రభుత్వాల తుది ఆమోదానికి ఒక సవరణ పంపబడినప్పుడు ఆ రాష్ట్ర శాసనసభలే ఏదో ఒక నిర్ణయం చెయ్యాలని కాంగ్రెసు ఆదేశించవచ్చు; లేదా రాష్ట్రశాసనసభల నిర్ణయం పనికిరాదని అది చెప్పవచ్చు. అప్పుడు, ప్రజలు ఆ సవరణ సందర్భంగా ఎన్నుకున్న ప్రతినిధులతో రాష్ట్ర ప్రభుత్వాలు సమావేశాన్ని

ఏర్పాటుచేసి, దానిలో నిర్ణయం చెయ్యాలని కాంగ్రెసు అడగవచ్చు. ఈ రెండు పద్ధతులలో ఏది అనుసరించాలో రాష్ట్రాలను ఆదేశించగల అధికారం కాంగ్రెసుకు కలదు.

ఆ యా కాలమాన పరిస్థితుల కనుగుణంగా రాజ్యాంగ చట్టాన్ని సవరించుకొనే ప్రత్యక్ష పద్ధతి అలావుండగా, దానిని ఆచరణలో వృద్ధి చెయ్యగల ఇతర మార్గాలుకూడా కలవు. నూతన జాతీయావసరాలను బట్టి న్యాయ శాఖవారు రాజ్యాంగ సూత్రాల ప్రకారం వ్యాఖ్యానాలు చేస్తారు. ఆ వ్యాఖ్యానాల ననుసరించి రాజ్యాంగచట్టం విస్తృతమైంది. రేడియో, టెలిఫోన్, టెలిగ్రాఫ్, రోడ్లు, రైల్వేలు, ఇంకా అనేకం ఇట్టి వ్యాఖ్యానాల వల్లనే సాగించబడుతున్నాయి. రాజ్యాంగ చట్టంలోని వివిధ భాగాల తాత్పర్య మేమిటో, అవి ఏ ప్రయోజనం కోసం చెయ్యబడ్డవో కోర్టులు అనేక సందర్భాలలో తీర్పులిచ్చాయి. వాటి మూలంగా ఒక విశిష్టమైన రాజ్యాంగ న్యాయశాస్త్రం తయారైంది. ఈ విధంగా నిజానికి రాజ్యాంగచట్టం అతి విశాలమైనదన్న మాట. అయితే, ఆది రాజ్యాంగ చట్టంలోని పద ప్రయోగాలను గాని, భావాలను గాని మార్పు చెయ్యకుండానే ఇది జరిగింది.

కాంగ్రెసులో ఆమోదించబడిన చట్టాలన్నీ ధర్మ శాస్త్రంలో చేర్చబడుతూ ఉంటాయి. వీటన్నిటికీ మూలాధారం రాజ్యాంగ చట్టమే. రాజ్యాంగ చట్టానికి అనుగుణంగానో, లేదా నూతన పరిస్థితుల దృష్ట్యానో కాంగ్రెసులో శాసనాలు చెయ్యబడుతాయి గనుక, వాటి

అర్థం, తాత్పర్యం స్పష్టంగా ఉండదు. అందుచేత, వాటి నమలుపరచే కార్య నిర్వాహకశాఖవారు ఆ యా సందర్భాలను బట్టి విస్పష్టార్థాలను చెబుతారు. వాటికి కోర్టులలో విరుద్ధంగా అర్థం చెప్పబడకపోతే అవి భాష్యమౌతా యన్నమాట. ఇవన్నీకూడా అమెరికా రాజ్యాంగాభివృద్ధికి తోడ్పడుతూ, అనేక వర్గాలవారికి మేలు కలిగిస్తూ ఉంటాయి.

ఈనాడు అనేక అమెరికా ప్రభుత్వ కార్యాలయా లున్నాయి. అనేక శాసనాలు, నిబంధనలు కలవు. రాజ్యాంగచట్ట రచయితలు ఇన్ని అవసరమని ఊహించలేదు. భావిలో ఇటువంటి మార్పు లింకా అనేకం కలగవచ్చు. కాని, ఇవన్నీ రాజ్యాంగచట్టం పరీక్షకు నిలవగలవు. ప్రభుత్వ న్యాయ శాఖవారి అభిప్రాయంలో, ఇవన్నీ రాజ్యాంగచట్ట సమ్మతమై, దాని ఆశయానుగుణమై ఉండాలి. అప్పుడప్పుడు కాంగ్రెసు చేసే చట్టాలను, రాష్ట్రాలు చేసే చట్టాలను, అధికారులు చేసే ఉత్తరువులను, క్రింది కోర్టులుచేసే తీర్పులను న్యాయశాఖవారు త్రోసివేస్తూ, అవి రాజ్యాంగచట్టం ఆశయానికి విరుద్ధమైనవని తీర్పు యిస్తారు.

## హక్కుల బిల్లు

రాజ్యాంగచట్టం చెయ్యబడిన తరువాత మొదటి 160 సంవత్సరాలలో—1949 జనవరి 1 వ తేదీ నాటికి — మొత్తం 21 సవరణలు చెయ్యబడ్డాయి. వాటిలో మొదటి పదింటికి హక్కుల బిల్లు (బిల్ ఆఫ్ రైట్స్) అనిపేరు. అవి మొట్టమొదటి

కాంగ్రెసులో చటుక్కున ఆమోదించబడ్డాయి. (ప్రతినిధుల సభాసభ్యులు 2 సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడుతారు. అలాగ జరిగినప్పుడల్లా క్రొత్త కాంగ్రెసు ఏర్పడిన దన్నమాట. ఆ ప్రకారం కాంగ్రెసుల సంఖ్య లెక్కించ బడుతుంది. ఉదాహరణకు, నాలుగవసారి ఎన్నికలు జరుగగా ఏర్పడిన కాంగ్రెసు నాలుగవ కాంగ్రెసు) హక్కుల బిల్లుప్రకారము కొన్ని వ్యక్తిగత స్వాతంత్ర్యాలకు ఖచ్చితంగా గ్యారంటీ ఇవ్వబడింది. రాజ్యాంగ చట్టంలో ఆ హక్కులకు తగినంత రక్షణ కల్పించబడ లేదని మొదటి కాంగ్రెసు ఎంచి ఆ బిల్లును చేసింది. ఈ హక్కులకు రక్షణ లేదనే కారణంచేతనే ఆది రాజ్యాంగ చట్టాన్ని ధ్రువపరచడానికి కొందరు సమ్మతించ లేదు. మసాచుసెట్స్ రాష్ట్ర శాసనసభవారు రాజ్యాంగ చట్టాన్ని ధ్రువపరచడం సందర్భంగా చర్చలు జరిగినప్పుడు ఈ విషయం వ్యక్తమైంది. అందు మీదట వారు సాధ్యమైనంత త్వరలో వ్యక్తిగతపు హక్కులను గురించి రాజ్యాంగ చట్టానికి సవరణ ప్రతిపాదించగలమని కూడా చెప్పారు.

హక్కుల బిల్లులోని పది సూత్రాలు వ్యక్తుల స్వాతంత్ర్యాల్ని కాపాడడానికి దుర్గం వంటివి. ఒకటిన్నర శతాబ్దం క్రిందటినుంచి అవి ప్రాణప్రదంగా కాపాడబడుతున్నాయి.

వీటిలో మొదటి సవరణ మత స్వాతంత్ర్యాన్ని, వాక్ స్వాతంత్ర్యాన్ని, పత్రికా స్వాతంత్ర్యాన్ని, సమావేశ స్వాతంత్ర్యాన్ని, ప్రభుత్వానికి ఫిర్యాదులను తెల్పుకొనే స్వాతంత్ర్యాన్ని కాపాడుతుంది.

రెండవ సవరణ, ప్రజలు ఆయుధాలను కలిగివుండే హక్కును కాపాడుతుంది.

మూడవ సవరణ, యజమానుల అనుమతి లేనిదే సైనికులు ఏ గృహస్థుల ఇళ్ళలోను ఉంచబడరని గ్యారంటీ ఇస్తూంది.

నాలుగవ సవరణ, వారంటు లేనిదే వ్యక్తులు, ఇళ్ళు, వస్తువులు, పత్రాలు సోదా చెయ్యబడడం గాని, స్వాధీన పరచుకోబడడం గాని జరగదని గ్యారంటీ ఇస్తూంది.

అయిదవ సవరణ, జూరీల విచారణ జరగనిదే ఏ వ్యక్తిని పెద్ద నేరారోపణకు విచారణ చెయ్యరాదని నిషేధిస్తూంది; ఒక వ్యక్తి ఒకే నేరానికి పలుసార్లు విచారణ చెయ్యబడడాన్ని, న్యాయరీత్యా తప్ప శిక్షించబడడాన్ని నిషేధిస్తూంది. నేరారోపణ చెయ్యబడిన వ్యక్తిచేత నేరం ఒప్పించడానికి ఒత్తిడి జరుపరాదని నిషేధిస్తూంది. న్యాయమైన ధర చెల్లించనిదే ఎవరి ఆస్తిపాస్తులను వశపరచుకోరాదని ఈ సవరణ శాసిస్తూంది.

ఆరవ సవరణ, క్రిమినల్ నేరం చేసిన వ్యక్తిని ఆ నేరం జరిగిన ప్రాంతంలోని కోర్టులో బహిరంగంగా, త్వరగా విచారణ జరపాలని ఆదేశిస్తూంది; పక్షపాతం లేని జూరీలు విచారణ జరపాలి; నేరమేమిటో స్పష్టంగా పేర్కొనబడాలి; ముద్దాయితరఫున వాదించడానికి ప్లీడరును ఏర్పాటుచెయ్యాలి; ముద్దాయి తరఫు సాక్షులు విధిగా కోర్టుకు హాజరయేటట్లు చూడాలి;ఆసాక్షులు ముద్దాయి సమక్షంలోనే సాక్ష్యాలివ్వాలి.

ఏడవ సవరణ, ఇరవై డాలర్ల విలువకుమించిన అన్ని దావాలలో జూరీలద్వారా విచారణ జరిపించాలని నిర్దేశిస్తూంది.

ఎనిమిదవ సవరణ, క్రిమినల్ నేరస్థులనుంచి మితి మీరిన జామీనును కోరరాదనీ, మితి మీరిన జరిమానాలను విధించ రాదనీ, క్రూరమైన, లేదా అసాధారణమైన శిక్షలను విధించ రాదనీ ఆదేశిస్తూంది.

తొమ్మిదవ సవరణ, రాజ్యాంగ చట్టంలో పేర్కొన బడలేదనే కారణంతో ప్రజల హక్కులకు భంగం కలిగించ రాదని తెల్పుతూంది.

పదవ సవరణ, కొన్ని హక్కులు రాష్ట్రాల ప్రభుత్వాలకో, లేదా ప్రజలకో చెందాలని చెబుతూంది. అవి కేంద్ర ప్రభుత్వానికి ప్రసాదించబడనివై, రాష్ట్రాలు పొందరాదనే నిషేధం లేనివై ఉండాలి.

## వ్యక్తి స్వాతంత్ర్యాలకు సంపూర్ణ రక్షణ

ఈ సవరణల ప్రాముఖ్యం విశదమే. నియంతృత్వంగల ప్రభుత్వంగాని, దమన నీతిగల ప్రభుత్వంగాని ఏర్పడకుండా, వ్యక్తి స్వాతంత్ర్యాలు భంగపడకుండా ఇవి రక్షణలను కల్పించగలవు. ప్రజాస్వామిక లక్ష్యం ప్రపంచవ్యాప్త మైనందున, అనేక ప్రభుత్వాలు అమెరికా రాజ్యాంగ చట్టాన్ని, హక్కుల బిల్లును అనుకరించి తమ నూతన రాజ్యాంగ చట్టాలను రూపొందించుకున్నాయి. యుద్ధ కాలంలో ఏ ప్రభుత్వంలోనైనా కార్య నిర్వాహకశాఖ అసాధారణాధికారాలను పొందుతుంది; దేశ భద్రతకోసం విదేశాలకు వెళ్ళే సమాచారాలపై సెన్సారింగు ప్రయోగించ

బడుతుంది. అటువంటి యుద్ధ సమయంలో సయితం అమెరికా పత్రికల, పౌరుల స్వాతంత్ర్యానికి భంగం కలిగించబడ లేదు ; ప్రభుత్వ విధానాలను, నిర్ణయాలను విమర్శించే హక్కు నమ్మ చెయ్యబడ లేదు.

ఈమధ్య కొన్ని చిన్న వర్గాలవారు ప్రెసిడెంటు ఆ దేశాల పట్ల అసమ్మతి ప్రదర్శనలు చేశారు. వారు తమ సమావేశ స్వాతంత్ర్యాన్ని వినియోగించుకొని వాషింగ్టన్‌లోని వైట్ హౌస్ వరకు వచ్చి, అక్కడ బారులుగా నిలబడ్డారు. ప్రభుత్వాధికారులు వారి విషయంలో తీసుకున్న చర్య పోలీసులను కాపలా పెట్టడం మాత్రమే. రోడ్డులో వెళ్ళే జనానికి వారు అడ్డు లేకుండా చూడడానికి మాత్రమే పోలీసులను పెట్టారు.

అమెరికా హక్కులబిల్లు ననుసరించి, నేరారోపణ చెయ్యబడిన వ్యక్తి తను నిర్దోషినని వాదించుకోడానికి అన్ని అవకాశాలు కలిగించబడగలవు. విచారణ న్యాయంగా, బహిరంగంగా జరుపబడుతుంది. అతడు దోషి. అని రుజువయే వరకు నిర్దోషిగానే పరిగణించబడుతాడు.

ప్రభుత్వ వ్యవహారాలన్నింటిలో ప్రజలే సర్వాధికారులనే సత్యం హక్కుల బిల్లుద్వారా పునరుద్ఘాటించబడింది.

హక్కుల బిల్లు అనంతరం రాజ్యాంగ చట్టానికి చెయ్యబడిన సవరణలు అనేక విషయాలకు చెందినవి. ఫెడరల్ ప్రభుత్వపు న్యాయశాఖాధికారం పరిమితం చెయ్యబడింది ; ప్రెసిడెంటును ఎన్నుకొనే పద్ధతి మార్పు చెయ్యబడింది ;

బానిసత్వం నిర్మూలించబడింది; అర్హులైన పౌరులందరు వోటు వెయ్యవచ్చుననే హక్కు కలిగించబడింది; వ్యక్తుల ఆదాయాలపై పన్ను విధించడానికి అధికారం ఇవ్వబడింది; రాష్ట్రాల శాసన సభలద్వారా కాక, ప్రజలే సెనేటర్లను ఎన్నుకొనే హక్కు యివ్వబడింది.

అమెరికాలో మత్తు పానీయాల అమ్మకాన్ని నిషేధించడానికి 18 వ సవరణ చెయ్యబడింది. కాని, ఆ తరువాత 21 వ సవరణద్వారా అది రద్దు చెయ్యబడింది.

స్త్రీలకు వోటింగు హక్కు యిస్తూ 19 వ సవరణ, ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు, సెనేటర్లు, ప్రతినిధుల సభా సభ్యులు ఎప్పు డెన్నుకోబడడమో, వారి పదవుల వ్యవధులు ఎప్పుడు ముగియడమో నిర్ణయిస్తూ 20 వ సవరణ చెయ్యబడ్డాయి.

ప్రజలకు స్వపరిపాలనాధికారం ఉండడంలో గల మంచి చెడ్డలకు ఈ రాజ్యాంగ చట్టం, హక్కుల బిల్లు తార్కాణం. నిర్దుష్టమైన పరిపాలనా సూత్రాలను ఎట్టి పరిస్థితులకైనా సరే అనుగుణంగా మార్పు చేసుకోవచ్చుననీ, అయితే ప్రజలకు అధికారమున్నప్పుడే అది సాధ్యమనీ కూడా అవి చాటుతున్నాయి. ప్రజలే బాధ్యతవహించి, సహకార సౌమనస్యాలతో కృషి చేస్తే ఇవన్నీ సాధ్యమని అవి రుజువు చేస్తున్నాయి.

రాజ్యాంగ చట్టంలోని సూత్రాలు, అన్ని సవరణలు ఈ పుస్తకం చివర చేర్చబడ్డాయి.

# 4

# పౌరస్వత్వ బాధ్యతలు

స్వపరిపాలనకై హక్కులు, స్వాతంత్ర్యాలు పౌరస్వత్వ విధులవల్ల, బాధ్యతలవల్ల రాగలవని అమెరికా చరిత్ర, ఇతర ప్రజాస్వామ్యాల చరిత్రలు ఋజువు చేస్తున్నాయి. పౌరులు పన్నులను చెల్లించే రూపంలో ప్రభుత్వానికి ధనం చేకూర్చవలసిన బాధ్యత కలదు. చట్టాలను, నిబంధనలను చెయ్యడంలో ప్రతి పౌరుడు పాల్గొంటాడు. అందుచేత, వాటిని శిరసావహించడం ప్రతి పౌరుని విధి. పౌరస్వత్వ బాధ్యతలలో ఇదొక అంశంమాత్రమే. ఇలాగే ముఖ్యమైనవీ, ఇంతకంటె శ్రద్ధవహించవలసినవీ ఇంకా ఉన్నాయి.

వీటన్నింటిలో ముఖ్యమైనది వోటింగు హక్కులను సద్వినియోగపరచడం. అత్యధిక సంఖ్యాకులకు అత్యధిక ప్రయోజనం కలిగించడమే ప్రజాస్వామిక సూత్రం. వివేకవంతులైనవోటర్లు దానిని దృష్టిలో పెట్టుకుంటారు. ఎవరికి వోటు వెయ్యడమో నిశ్చయించుకోడానికి పూర్వం వారు తమ సంఘావసరాలేమిటో తెలుసుకుంటారు. ముందు రాగల సంవత్సరాలలో తమ దేశం ఎదుర్కొగల సమస్యలను యోచిస్తారు. అవన్నీ తెలుసుకొని వోట్లు వెయ్యడం వారి విధి.

అత్యావసర పరిస్థితులేర్పడినప్పుడు దృఢకాయులైన స్త్రీ పురుషులు తమ జాతీయ రక్షణ నిమిత్తం సైన్యాలలో స్వచ్ఛందంగా చేరడానికి ఉద్యుక్తులవుతారు. సైన్యాలలో పని చెయ్యగల సామర్థ్యంలేని కొందరు అమెరికన్ ప్రముఖులు

గత ప్రపంచ యుద్ధంలో తమకు నైపుణ్యంగల రంగాలలో ప్రభుత్వానికి సహాయపడ్డారు. పరిశ్రమలలో యుద్ధసాధనో త్పత్తులను నిర్మించడానికి వారు చేయూతనిచ్చారు. అమెరికా అంతటా వేలకువేలు ఇదేవిధంగా జీత భత్యాలు వాంఛించ కుండా యుద్ధ ప్రయత్నాలకు సహాయపడ్డారు. స్థానిక సంఘాల సభ్యులుగాచేరి, సైన్యాలలో చేరవలసిందని యువకు లను ప్రోత్సాహపరచారు. దేశభక్తి ప్రేరితులై అటువంటి పనులనేకం చేశారు.

శాంతికాలంలో అమెరికా పౌరుడు తన సంఘాభివృద్ధికి సేవచెయ్యాలనే వాంఛను అనేక విధాలుగా చూపుతాడు. సాంఘిక కార్యకలాపాలలో, రాష్ట్ర ప్రభుత్వ కార్యక్రమా లలో, జాతీయ అభ్యుదయకర ప్రయత్నాలలో అతడు పాల్గొంటాడు. పౌర సమస్యల పరిష్కారంలో ప్రముఖ పాత్ర నిర్వహించే ప్రాంతీయ సంఘాలలో ఎవరికి వారు సభ్యులుగా చేరుతారు. పాఠశాలల పద్ధతులను గురించి, విద్యాభ్యాస విధానం గురించి శ్రద్ధ వహించడానికి ఏర్పడిన సంఘాలు స్కూలుబోర్డులతో కలసి కృషిచేస్తాయి. ఇట్టి సంఘాలలో పిల్లల తండ్రులు, ఉపాధ్యాయులు సభ్యులుగా ఉంటారు. ఇదేవిధంగా అనేక సంస్థలున్నాయి. కొన్ని జాతీయ సమస్యల విషయంలో శ్రద్ధ వహిస్తారు. అవి చర్చలు సమావేశాలు జరిపి దేశానికి ఉపయుక్తంకాగల ధోరణి నవలంబిస్తాయి. అటువంటి పద్ధతులు ప్రజా ప్రతినిధులైన అధికారులమీద బాగా పనిచేస్తాయి.

రాజకీయాలలోనే మునిగి తేలదలచిన వారితోపాటు, ప్రభుత్వ పరిపాలనా పద్ధతులలో కూలంకష జ్ఞానం సంపాదించ గోరుతున్న వారి సంఖ్య ఎక్కువవుతూంది. వీరు శాసనాలను పరిశీలించి, బాగా చదివి, అనుభవజ్ఞులై, ప్రభుత్వ వ్యవహారా లకు చెందిన ఏదో ఒక రంగంలో నిపుణులవుతారు. అనేక అమెరికా నగరాల స్థానిక ప్రభుత్వ కార్యాలయాలలో ప్రధానాధికారులుగా పనిచేస్తున్న వారు ఇట్టివారే. వీరికి రాజకీయ పక్షాలతో సంబంధం లేదు. వ్యాపారాలలో ప్రముఖులైన అనేకమంది కూడా ప్రభుత్వంలో పని చేయడానికి ముందుకు వస్తూంటారు. ప్రభుత్వ పదవిని నిర్వహించడ మంటే దేశ సేవగా ఎంచి వారు తమ ప్రయివేటు వ్యాపారాలను వదలి వస్తారు. ఇటువంటి స్త్రీ పురుషుల సంఖ్య కూడా హెచ్చుతున్నది.

నగరాలలోని కోర్టులు మొదలుకొని ఫెడరల్ కోర్టువరకు జూరీలు పౌరులనుంచే ఎన్నుకోబడుతారు. ప్రభుత్వం ఉత్తరువు చేసి నియమించదు. కాని, గ్రాండ్ జూరీలనేవారిని ప్రభుత్వం ఏర్పాటు చేసి, వారికి అసాధారణమైన అధికారాలిస్తుంది. స్థానిక నాయకులై, అనుభవజ్ఞులై, ప్రజ్ఞావంతులైనవారినే ప్రభుత్వం గ్రాండ్ జూరీలుగా నియమిస్తుంది. క్రిమినల్ నేరాలు చేసినట్లు పబ్లిక్ ప్రాసిక్యూటర్లు ఆరోపణలు చేసిన వారిని గ్రాండ్ జూరీలు విచారణచేసి, సాక్ష్యాలను పరిశీలిస్తారు. అనంతరం వారు దోషులనో, నిర్దోషులనో కేసుమోపి శిక్షించబడవలసినవారో, కారో గ్రాండ్ జూరీలు నిర్ణయిస్తారు.

గ్రాండ్ జూరీల బాధ్యతలు, విధులు అతి ముఖ్యమైనవి. అయితే, కేసుల దర్యాప్తు విషయంలో వారికున్న అధికారాలు ఇంచుమించు అంతులేనివి. ఆ యా సందర్భాలనుబట్టి అవసర మని తోచినట్లయితే, ఏ నేరంలో దర్యాప్తు చెయ్యడానికైనా, ఎవరిని ప్రశ్నించడానికైనా వారి కధికారం ఉన్నది. తమకు సంతృప్తి కలిగించగల ప్రాసిక్యూటర్లను ప్రత్యేకంగా నియమించాలని వారు ఆదేశించగలరు. ఏ ప్రభుత్వాధికారి నైనా సరే సాక్ష్యం యివ్వడానికి కోర్టులకు రప్పించి, వారిచేత ప్రమాణాన్ని చేయించి, విచారణ జరుపగలరు.

## పౌరసత్వ యోగ్యతలు

ఏమైనా, ప్రజాస్వామ్యంలో అత్యున్నతాధికారం గల వారు వోటర్లు. పౌరసత్వంవల్ల కలిగే అత్యధిక ప్రయోజనము, బాధ్యత ఇచ్చేది వోటు. పౌరుడు కానివాడెవడూ వోటు వెయ్యలేడు గనుక, పౌరసత్వ యోగ్యతలను మొదట పేర్కొనడం సముచితం.

అమెరికాలో జన్మించినవా రందరు అమెరికా పౌరులు. వారు ఏ జిల్లాలో నివసిస్తే ఆ జిల్లా పౌరులవుతారు. విదేశాలలో పర్యటిస్తున్న అమెరికనులకుగాని, విదేశాలలో నివసిస్తున్న అమెరికనులకుగాని జన్మించినవారుకూడా అమెరికనులవుతారు. కాని, అందుకు కొన్ని షరతులున్నాయి. అలాస్కా, హవాయి, పోర్టోరికో, వర్జిన్ దీవులు ఈ ప్రాంతాల ప్రజలకుకూడా అమెరికా పౌరసత్వాన్ని యిస్తూ కాంగ్రెసు చట్టాలుచేసింది.

## అన్యులకు పౌరసత్వం

విదేశంలో జన్మించిన వ్యక్తికూడా మరొక పద్ధతిద్వారా అమెరికా పౌరుడు కావచ్చును. అమెరికాలోని విదేశీయుడు పౌరసత్వాన్ని పొందితీరాలనే నిర్బంధం లేదు. పౌరసత్వం పొందకపోతే కూడా ఎవరూ శిక్షించబడరు. అమెరికా పౌరులతో సమానంగా భావస్వాతంత్ర్యం, ఇతర స్వాతంత్ర్యాలు అనుభవిస్తూ, పౌరసత్వాన్ని పొందకుండా అమెరికాలో ఇరవై లక్షలమంది విదేశీయులున్నారు. వారు తమ పిల్లలను ప్రభుత్వ పాఠశాలలకు పంపుకోవచ్చును. ఇతర పౌరులులాగే అన్ని సౌకర్యాలను పొందగలరు. అయితే, పౌరసత్వం పొందనివారికి కొన్ని ప్రయోజనాలు లభించవు. కొన్ని ఉద్యోగాలు అమెరికా పౌరులకు మాత్రమే ఇవ్వబడుతాయి. కొన్ని రాష్ట్రాలలో ప్లీడరీ వృత్తి చేసుకోవాలన్నా, వైద్య వృత్తి చేసుకోవాలన్నా లైసెన్సులు అమెరికా పౌరసత్వం కలవారికే ఇవ్వబడుతాయి. వృద్ధులకు, వ్యాధిగ్రస్తులకు, నిరుద్యోగులకు సౌకర్యాలు చెయ్యడానికి ఉద్దేశించబడిన చట్టాలు పౌరసత్వం లేనివానికి వర్తించవు. అతడు ఎన్నికలలో పోటీ చెయ్యకూడదు. ప్రభుత్వోద్యోగాలలో నియమించబడడు.

పౌరసత్వం పొందదలచిన విదేశీయులు శ్వేత జాతివారై ఉండాలి; ఆఫ్రికాలో జన్మించినవారై ఉండాలి; లేదా, ఆఫ్రికన్ తల్లి దండ్రులకు జన్మించి ఉండాలి; లేదా, పశ్చిమార్ధగోళం దేశాలలోని ఒక జాతికి చెందినవారై

ఉండాలి. అంతేకాదు, ఆ వ్యక్తి చట్టబద్ధంగా అమెరికాకు వచ్చి, వరుసగా అయిదు సంవత్సరాలు నివసించి వుండాలి. ఈ షరతులను పాటించిన ఏ విదేశీయుడైనా సరే అమెరికా పౌరస్వత్వాన్ని పొందవచ్చు. అయితే, అతడు క్రిమినల్ నేరస్థుడైనా, అరాజక వాదియైనా పౌరస్వత్వం యివ్వబడదు.

ఈ షరతులన్నింటినీ పాటించిన విదేశ వ్యక్తి అమెరికా పౌరస్వత్వాన్ని యివ్వవలసిందని ఏ కోర్టులోనైనా దరఖాస్తు పెట్టుకోవాలి. ఇటువంటి ఫెడరల్, రాష్ట్ర ప్రభుత్వాల కోర్టులు సుమారు 2,000 ఉన్నాయి. ఈ పద్ధతిగా పౌరస్వత్వాన్ని యివ్వడానికి వాటి కధికారం ఉన్నది. దరఖాస్తు పెట్టుకున్న వ్యక్తి రెండు సంవత్సరాల అనంతరం, ఏడు సంవత్సరాల లోపున తిరిగి కోర్టులో హాజరై, తన దరఖాస్తులో తెల్పబడిన విషయాలన్నీ యదార్థాలని ప్రమాణం చెయ్యాలి. అనంతరం దానిమీాద సంతకం చెయ్యాలి. ఈ దరఖాస్తులో ఆ వ్యక్తి సక్రమ ప్రభుత్వాలపట్ల తనకు ప్రతికూల భావం లేదనీ, అమెరికా రాజ్యాంగ చట్టంపట్ల తనకు పరిపూర్ణ విశ్వాసం కలదనీ, ఏ విదేశ రాజుతోగాని, పరిపాలకునితోగాని, ప్రభుత్వంతోగాని తనకుగల సంబంధాన్ని వదలుకుంటున్నాననీ తెలియచెయ్యాలి. ఆమెరికా రాజ్యాంగ చట్టాన్ని, శాసనాలను బలపరుస్తాననీ, దానిని కాపాడుతాననీ, అందుకై బయటి శత్రువులనైనా సరే, దేశంలోని శత్రువులనైనా సరే ప్రతిఘటిస్తాననీ ఆ వ్యక్తి ప్రమాణం చెయ్యాలి.

పౌరసత్వపు దరఖాస్తుమీద ఆ వ్యక్తి సంతకం చేసేటప్పుడు నిజాయితీపరులైన ఇద్దరు అమెరికన్ పౌరులు ఈ వ్యక్తి తమకు బాగా తెలుసుననీ, నిబంధనలో పేర్కొన బడినన్ని సంవత్సరాలనుంచి అమెరికాలో నివసిస్తున్నాడనీ, మంచి నీతిమంతుడనీ, అమెరికా రాజ్యాంగ చట్ట సూత్ర బద్ధుడనీ ప్రమాణం చెయ్యాలి. అనంతరం దరఖాస్తు పెట్టిన వ్యక్తిని, ఆ సాక్షులను ఒక కోర్టు అధికారి ప్రశ్నలడుగుతాడు. పౌరసత్వం పొందగల యోగ్యతగల వ్యక్తి అవునో, కాదో తెలుసుకోడానికి అతడు ప్రశ్నించడం జరుగుతుంది.

అమెరికా పట్ల విశ్వాసం కలిగి వుంటానని ఆ వ్యక్తి ప్రమాణ స్వీకరణ చెయ్యడంతో ఈ కార్యక్రమం పూర్తి అవుతుంది. అయితే, దరఖాస్తులోని విషయాలన్నీ యథార్థా లని ప్రమాణంచేసిన 30 రోజుల అనంతరంగాని ఈ ప్రమాణం చెయ్యరాదని చట్టంలో నిబంధన కలదు. కోర్టు జడ్జి సంపూర్ణంగా సంతృప్తి చెందిన పిమ్మట, ఈ విశ్వాస ప్రమాణాన్ని చేయించి పౌరసత్వ పత్రంమీద సంతకం చేసి యిస్తాడు. సాధారణంగా ఆ వెంటనే వోటింగు అధికారం, ప్రభుత్వ కార్యకలాపాలలో స్వయంగా పాల్గొన గల యోగ్యత లభించగలవు.

అయితే, పౌరసత్వం లభించిన వెంటనే వోటింగు హక్కు రాగలదనుకోరాదు. వోటింగు హక్కు యివ్వ డానికి జాతి, మత, వర్ణ, స్త్రీ పురుష విభేదాలు అడ్డు రాకూడదని రాజ్యాంగ చట్టంలో పేర్కొనబడినప్పటికీ,

రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని షరతులను విధించగల అధికారం కలదు. వోటు వెయ్యగల యోగ్యత లభించాలంటే ఆ రాష్ట్ర ప్రభుత్వాల షరతులను పాటించాలి. చాలా రాష్ట్రాలలో 21 సంవత్సరాల వయస్సుగలవా రందరికీ వోట్లున్నాయి. తగినంత కాలంనుంచి వాటిలో నివసించి వున్నవారే వోటు వెయ్యగలరు. ఉన్మాదులైనవారికి, బుద్ధి కుశలత లేనివారికి, పెద్ద నేరస్థులకు కొన్ని రాష్ట్రాలలో వోట్లు లేవు. చదవడం, వ్రాయడం వచ్చినవారికే కొన్ని రాష్ట్రాలలో వోటింగు హక్కు ఇవ్వబడింది.

## వోటు వినియోగం

వోటరుకు బాధ్యత, శక్తి ఉన్నవంటే కేవలం వోటింగు హక్కు కలిగి ఉండడంవల్ల కాదు. ఆ హక్కును వివేకవంతంగా, ప్రతి ఎన్నికలలోను ఉపయోగించుకొనడంలోనే దాని అసలు విలువ ఉన్నది. వోటరు తన అభిప్రాయాలను వ్యక్తపరచుకోడానికి పలువిధాలైన అవకాశాలున్నాయి. జనరల్ ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థులలో ఎవరినైనా సరే వోటరు ఎన్నుకోగలడు. మునిసిపల్ కౌన్సిలర్లు; సిటీ మేయర్లు; రాష్ట్రాలలో సెనేటర్లు; గవర్నర్లు; వోటరుగల జిల్లాకు కాంగ్రెస్‌లో ప్రాతినిధ్యం వహించే ప్రతినిధుల సభాసభ్యులు; వోటరుగల రాష్ట్రానికి కాంగ్రెస్‌లో ప్రాతినిధ్యం వహించే సెనేటర్లు; అమెరికా ప్రెసిడెంటు—వీరిలో ఎవరిని ఎన్నుకోడానికైనా సరే ఎన్నిక జరిగినప్పుడు వోటరు తనకు ఇష్టం వచ్చిన వానికి వోటు వెయ్యగలడు.

జనరల్ ఎన్నికలకు పూర్వం వివిధ రాజకీయ పక్షాల వారు తమ పార్టీ అభ్యర్థులుగా పోటీ చెయ్యడానికి ఎవరిని నిలబెట్టడమో గురించి ప్రయిమరీ ఎన్నికలు జరుపుతారు. ఆయా ప్రాంతాలలోని వోటర్లు తమ అభీష్టాన్ని అనుసరించి ఈ అభ్యర్థులలో ఒకణ్ణి ఎన్నుకుంటారు. ఎన్నికలలో పోటీ చెయ్యగల అభ్యర్థులను నామినేటు చెయ్యడంలో ఈ పద్ధతి ఉపయోగించబడుతూంది. ఇవి పార్టీ ఎన్నికలు. చాలామంది వోటర్లు వీటిలో పాల్గొంటారు. ఒకపార్టీ తరఫున పోటీచెయ్య దలచినవారు అనేకమంది ఉంటే వారందరినీ ఆ పార్టీవారు నామినేటు చెయ్యలేరు గనుక, ఈ పద్ధతి అనుసరించ బడుతుంది. ఎక్కువ వోట్లు వచ్చినవాడు జనరల్ ఎన్నికలలో అభ్యర్థిగా నామినేటు కావడం ఖాయమవుతుంది. ఈ విధంగా కొన్ని సందర్భాలలో జరుగుతుంది. మిగతా సందర్భాలలో అభ్యర్థులను దరఖాస్తుల ద్వారా నామినేటుచేస్తారు. అంటే, కొందరు వోటర్లు ఫలానా వానిని నామినేటు చేస్తున్నామని దరఖాస్తు పెట్టే పద్ధతి.

ఇక మూడవ పద్ధతి, వివిధ రాజకీయ పక్షాలు మహాసభలను జరుపుకొని తమ తమ అభ్యర్థులను నిర్ణయించుకొనడం. నాలుగు సంవత్సరాల కొకసారి ఇవి మహాసభలను ఏర్పాటు చేసుకొని, అమెరికా అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకు ఎవరిని పోటీకి నిలబెట్టడమో నిర్ణయించుకుంటాయి. ప్రజలలోని వోటర్లలో అధిక సంఖ్యాకులు ఏదో వొక రాజకీయ పక్షం అభిమానులై ఉంటారు. ప్రజలు తమ తమ ప్రాంతాలలో ప్రయిమరీ ఎన్నికలలో పాల్గొని ఈ రాజకీయ పక్షాల మహాసభలకు

తమ ప్రతినిధులను పంపుతారు. ఆ రాజకీయ పక్షం తరఫున ప్రెసిడెంటు పదవికి ఎవరిని పోటీకి నిలబెట్టాలో ఈ ప్రతినిధులకు ప్రజలు చెప్పడం తరుచు జరుగుతూంటుంది. జనరల్ ఎన్నికలలో తమకే వోట్లు ఇవ్వవలసిందని ప్రజలను కోరుతూ ఆయా రాజకీయ పక్షాలు తమ ఎన్నికల ప్రణాళికలను ఈ మహా సభలలో రూపొందించుకుంటాయి. ఏ నియోజక వర్గంనుంచి ఎవరు, ఏ స్థానానికి పోటీ చెయ్యడమో వీటిలో నిర్ణయిస్తారు.

ఈ పద్ధతు లన్నింటిలో – నామినేషనులు, ఎన్నికలు, పరిపాలన–నిర్ణయాలకు కీలకాధికారం గలవారు వోటరులే.

కొన్ని రాష్ట్రాలలో, కొన్ని పరిస్థితులలో శాసనాలను చేసే పూచీ సూటిగా వోటరులకే వదల బడుతుంది. ఒక చట్టాన్ని చెయ్యవలసిందని తగినంత మంది వోటర్లు ప్రభుత్వానికి విజ్ఞాపన చేసేయెడల, రాష్ట్ర శాసనసభలు ఎట్టి చర్య తీసుకో నవసర ముండదు. విజ్ఞాపనలో కోరబడిన ప్రతిపాదన వోటరు లందరికీ పంపబడుతుంది. దానిపై జనరల్ ఎన్నికలో, లేదా ప్రత్యేకంగా ఎన్నికలో జరుపబడుతాయి. ఈ ఎన్నికలో అధిక సంఖ్యాకులు దాని నామోదిస్తే అది శాసన మవుతుంది. వోటరుల అభిప్రాయాన్ని తెలుసుకోడానికై చాలా రాష్ట్రాలు రిఫరెండం జరుపుతాయి. అతి ముఖ్యమైన ప్రతిపాదనను శాసన సభలోని అధిక సంఖ్యాకులు ప్రతిపాదించి, అనంతరం దానిని వోటరులకు పంపి రిఫరెండం జరుపుతారు. ఉదాహరణకు, ఎక్కువ ధనాన్ని ఖర్చు చెయ్యవలసిన కార్యాన్ని ప్రభుత్వం తలపెట్టినప్పుడు, ప్రభుత్వ పత్రాలను ప్రజలకు విక్రయించి ఆ

ధనాన్ని సంపాదించవలసి వుంటుంది. అటువంటప్పుడు రిఫరెండం జరుపుతారు. ప్రజలు ఆ ప్రతిపాదనను అంగీకరిస్తారో, నిరాకరిస్తారో దానిద్వారా నిర్ణయ మౌతుంది. శాసన సభలో అది అధిక సంఖ్యాకులచేత ఆమోదించబడినదే కావచ్చు. కాని, ప్రజలలో అధిక సంఖ్యాకులు సమ్మతించనిదే అది శాసనం కాబోదు.

ఒక రాష్ట్రప్రభుత్వానికో, మునిసిపాలిటీకో ఎదురౌతుంటున్న సమస్య సందర్భంగా కూడా రిఫరెండం జరుపబడవచ్చు. విద్యాబోధనా పద్ధతిలో పెద్ద మార్పు చెయ్యడానికో, ప్రయాణ సౌకర్యాలను మార్పుచెయ్యడానికో, లేదా ప్రభుత్వంలోనే మార్పులు చెయ్యడానికో ఆ సమస్య సంబంధించి ఉండవచ్చు. వోటరులు రిఫరెండంలో ఏ అభిప్రాయాన్ని వెలిబుచ్చుతారో రాష్ట్రప్రభుత్వం, లేదా మునిసిపాలిటీ సరిగా అలాగే చెయ్యాలి.

న్యూ ఇంగ్లండు రాష్ట్రంలోని కొన్ని చిన్న పట్టణాలలో ఇప్పటికీ జనవాక్య పద్ధతి అమలుజరుగుతూంది. వోటరు లందరు ఒకచోట సభజరిపి, వారే శాసన సభ్యులులాగ చర్చలు జరిపి, తమ స్థానిక వ్యవహారాలను గురించి నిర్ణయాలు చేసుకుంటారు. సంవత్సరానికొకసారో, రెండు సార్లో ఈ విధంగా సమావేశమవుతారు.

## రాజకీయ పక్షాలు

అమెరికా రాజకీయాలు నడిచే పద్ధతిని రెండు పార్టీల పద్ధతి అంటారు. మొత్తంమీద, వోటరుల అభిప్రాయాల

ప్రకారం రాజకీయాలకు కీలకమైన పద్ధతి ఇదే. అమెరికాలో వున్న రెండు పెద్ద రాజకీయపక్షాలు ఇవి: డెమోక్రాటిక్ పార్టీ; రిపబ్లికన్ పార్టీ. కేంద్ర ప్రభుత్వాధికారులలోనేమి, రాష్ట్ర ప్రభుత్వాల అధికారులలోనేమి అత్యధిక సంఖ్యాకులను ఎన్నుకొనేవి ఇవే. గత ప్రపంచయుద్ధ కాలంనుంచి ఈ రెండుపార్టీలు అమెరికా విదేశాంగ విధానం విషయమై పరస్పరం అంగీకారం కలిగివుండే పద్ధతిని ఏర్పాటు చేసుకున్నాయి. ఉభయ పక్షాల నాయకులు చర్చించుకొని విదేశాంగవిధానాన్ని రూపొందించుకుంటారు. కాని, దేశీయసమస్యల సందర్భంలో తరచుగా ఒక పక్షంవారు రెండవ పక్షంవారిని ప్రతిఘటిస్తూంటారు.

అప్పుడప్పుడు మూడవ రాజకీయ పక్షమంటూ ఒకటి బయలుదేరుతూంటుంది. తమ రాజకీయాభిప్రాయాలను ఆ పెద్ద రాజకీయ పక్షాలవారు లక్ష్యపెట్టడంలేదనే తలంపుగల వోటరులు ఒక వర్గంగా ఏర్పడి మూడవ పక్షాన్ని లేవదీస్తారు. ఆ విధంగా బయలుదేరిన మూడవ పార్టీలలో ఒకటి మాత్రమే దేశమంతటా ఎన్నికలలో గెలుపొందగలిగింది. కాని, మూడవ పార్టీ అంటూ బయలుదేరినప్పుడల్లా అది పెద్ద పార్టీలు రెండింటినీ విమర్శించడం, తత్ఫలితంగా రాజకీయ సిద్ధాంతంలో, విధానాలలో మార్పులు జరుగుతూండడం సంభవించేది. చిరకాలంనుంచిగల సంస్థలు ఆధునిక పద్ధతులను అవలంబించడం, ఆనాటి అవసరాలనుబట్టి అవి అడుగువెయ్యడంకూడా జరిగేవి. వీటన్నింటికీ మూడవ రాజకీయ పక్షమంటూ ఒకటి బయలుదేరుతూ ఉండడమే కారణం.

మూడవ పార్టీగా బయలుదేరి విజయవంతమైనట్టిది రిపబ్లికన్ పార్టీ ఒక్కటే, 1860 లో ప్రెసిడెంటు గిరికి జరిగిన ఎన్నికలలో అది గెలచింది. రిపబ్లికన్ పార్టీ విజయంతో, అప్పటి పెద్ద రాజకీయ పక్షమైన విగ్స్‌పార్టీకి వినాశకాలం వచ్చింది. దానిస్థానే రిపబ్లికన్ పార్టీ బలపడింది.

మూడవ రాజకీయ పక్షాలు రాష్ట్రాలలో మాత్రమే, లేదా మునిసిపాలిటీలలో మాత్రమే ఎక్కువ పలుకుబడి పొందగలగేవి. రాష్ట్రాలు, మునిసిపాలిటీలు అందుబాటులో ఉంటాయిగనుక అవి శక్తిసామర్థ్యాలతో ప్రచారం చేసుకో గలిగాయి.

వోటు వెయ్యడంలో వోటరు చూపే తెలివితేటలను బట్టి, ప్రజావ్యవహారాలను ఎప్పటికప్పుడు క్షుణ్ణంగా తెలుసుకొనడంబట్టి అతడి వివేకం తెలుస్తుంది. అమెరికాలో ప్రజలు విధి నిషేధాలు లేకుండా ఏ సమాచారాన్నయినా తెలుసుకోగలరు. వార్తలు సెన్సారు చెయ్యబడవు. అమెరికా ప్రజాస్వామ్యానికి ఇదే ప్రాతిపదిక. ఇట్టి స్వేచ్ఛ వోటరులకు కలిగిస్తున్న ప్రయోజనం చెప్పనలవికాదు. ఒక పత్రిక ఏ సమస్యవిషయంలోనైనా తన యిష్టంవచ్చిన ధోరణి అవలంబించవచ్చు. ఆ విధంగా సంపాదకీయాలను వ్రాయవచ్చు. కాని, వార్తలను యథాతథంగా ప్రచురించడం అమెరికన్ పత్రికలకు సాంప్రదాయం.

అమెరికన్ వోటరుకు వాస్తవ సమాచారాలందే మార్గాలనేకం ఉన్నాయి. వార్తా పత్రికలు, వార, మాస

పత్రికలు, కరపత్రాలు, వార్తా చిత్రాలు, టెలివిజన్, రేడియో ఇవన్నీ అటువంటి మార్గాలు. ప్రభుత్వం వివిధ సమస్యల విషయంలో ఏవిధంగా వ్యవహరిస్తూందో అమెరికా పత్రికలు వివరంగా సమాచారాలను, ప్రత్యేక వ్యాసాలను ప్రచురిస్తాయి. ప్రభుత్వాధికారుల ఉపన్యాసాలు, ప్రకటనలు అచ్చు పడుతాయి. వార్తలలో ప్రాముఖ్యం వహించిన వ్యక్తుల జీవిత వృత్తాంతాలు, ప్రతినిధుల సభలో చర్చలు, సెనేటులో వాదోపవాదాలు పత్రికలద్వారా, రేడియోలద్వారా, ఫిల్ముల ద్వారా ప్రజలకు తెలుస్తూంటాయి. మంత్రులు జరిపే పత్రికా విలేఖరుల సమావేశాలు మొదలైనవికూడా ఇటువంటివే. వీటన్నింటినీబట్టి ప్రభుత్వ చర్యలు లేదా విధానాలు తెలుస్తాయి. ప్రజలకు సంబంధించిన అనేక సంఘటనలు ఎప్పటికప్పుడు వెల్లడి అవుతాయి. వీటికితోడుగా, కొన్ని సమస్యలు సంపాదకీయాలలో, ప్రముఖుల వ్యాసాలలో చర్చించబడుతాయి. విమర్శలు, ప్రశంసలు వెలువడు తూంటాయి. అందుచేత, వోటరుకు జరిగిన విషయాలు, జరుగుతున్న విషయాలు కూడా కూలంకషంగా తెలవగలవు.

అమెరికాలో అనేక పత్రిక లున్నాయి. నాలుగు పెద్ద పత్రికలు పూర్తిగా వార్తలను మాత్రమే ప్రచురిస్తాయి. విశేషప్రచారం గల ఇతర పత్రికలు అప్పటి స్థానిక, జాతీయ, అంతర్జాతీయ సమస్యలను గురించిన చర్చలకు ఎక్కువ పేజీలు వినియోగిస్తాయి. అమెరికాలోని అన్ని రేడియోలను లెక్కవేసుకొంటే సగటున గంటకొకసారి వార్తలు బ్రాడ్

కాస్ట్ చెయ్యబడుతూంటాయి. వార్తలను గురించి వ్యాఖ్యానాలు చెయ్యడానికికూడా తగినన్నిసార్లు బ్రాడ్ కాస్ట్‌లు చెయ్యబడుతూంటాయి. ప్రజా సమస్యలపై ప్రభుత్వాధికారులుచేసే ముఖ్యమైన ఉపన్యాసాలు రేడియోల ద్వారా, టెలివిజన్‌లద్వారా ప్రజలకు వినిపించబడుతాయి. రాజకీయ పక్షాల నాయకులతో బహిరంగంగా ఆర్థిక, రాజకీయ, సాంఘిక శాస్త్రజ్ఞులు చర్చలు జరిపే సభలు ఏర్పాటు చెయ్యబడుతూంటాయి. ఇళ్ళ సమస్యలను గురించి, వ్యవసాయ సమస్యలను గురించి, ఇంకా యితర సమస్యలను గురించి ఈ చర్చలు జరుగుతూంటాయి.

వివిధ వృత్తులను గురించి వ్యాసాలు మొదలైనవి ప్రచురించే వ్యాపార పత్రికలు అనేకమున్నాయి. వ్యాపారాలకు సంబంధించిన ప్రభుత్వ చర్యలు వాటిలో తరచు సవిస్తరంగా చర్చించబడుతూంటాయి. అయితే, ఇవన్నీ నిష్పక్షపాతంగా జరుగుతా యనుకోరాదు. కొన్ని విమర్శలు, వ్యాసాలు మొదలైనవి పక్షపాతంతో, స్వప్రయోజనాపేక్షతో రచించబడినవై ఉంటాయి. కాని, వోటరులకు సకల సమస్యలను గురించి సకల విషయాలు తెలియగలవు. అందువల్ల అతడు పూర్వాపరాలను, మంచి చెడ్డలను బాగా యోచించుకోగల అవకాశా లున్నాయి.

కొందరు వోటర్లు, కొన్ని సంఘాలు, సభలు ఏర్పాటుచేసి, తమ సందేహాలను నివారించగల ఉపన్యాసకులను రప్పిస్తారు. వారి వాదనలను వింటారు. చర్చలకై గోష్ఠులను జరుపుతారు.

ఒక్క న్యూయార్క్ నగరంలో అటువంటివి పదివేల సంఘాలు కలవని అంచనా వెయ్యబడింది.

ఎన్నికల ప్రచారాలలో రాజకీయ పక్షాలవారు ఉపన్యాసాలు, కరపత్రాలు, పత్రికా ప్రకటనలు మొదలైన వాటిద్వారా వోటరుకు ఆనాటి సమస్యలను తెలియచెప్పడానికి తీవ్రకృషి చేస్తారు. ఆ సమస్యలను పరిష్కరించడానికి తమ ప్రణాళిక అత్యుత్తమమైనదని వోటరుకు నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తారు. తమ అభ్యర్థులు మాత్రమే ఆ ప్రణాళిక ప్రకారం చర్యలు తీసుకోగల సమర్థులని వోటరుకు బోధిస్తారు.

స్వపరిపాలనాధికారం గల ప్రభుత్వ స్థాపనకు పైన చెప్పిన అవకాశాలన్నీ ఉన్నాయి. వాటిని సద్వినియోగం చేసుకున్నా, దుర్వినియోగం చేసుకున్నా ప్రజలదే పూచీ. అందుచేతనే, "ప్రజాస్వామిక విధానంలో ప్రజలు దేనికి యోగ్యులో అటువంటి ప్రభుత్వమే ఏర్పడుతుంది," అనే లోకోక్తి బయలుదేరింది. సదా శ్రద్ధకలిగి, రాజకీయాధికారాన్ని వివేకవంతంగా వినియోగించుకోగల ప్రజలు శక్తి సామర్థ్యాలుగల ప్రభుత్వాన్ని నెలకొల్పుకోగలుగుతారు. "ఈ గొడవలు మనకెందుకులే. ఇతరుల నెత్తిమీదకు తోసి పారవేద్దాం" అనుకొనే అలక్ష్య స్వభావంగల ప్రజలు స్వార్థపరుల, దుష్ట పరిపాలకుల అధికారంక్రింద పడగలరు. ప్రభుత్వం నిరంకుశ పరిపాలకుల చేజిక్కగలదు.

# 5

# ఫెడరల్ ప్రభుత్వం

అమెరికా రాజ్యాంగచట్టం ఉపోద్ఘాతంలో ఉన్నవి 52 పదాలే అయినా, కొంపెపు ప్రతిభా పూర్వక రాజనీతిజ్ఞుల నాయ కత్వాన చట్టాన్ని తయారుచేసిన 39 మందియొక్క వివేక విజ్ఞానానుభవాలకు ఆ పదాలు నిదర్శనం. జార్జ్ వాషింగ్టన్, బెంజమిన్ ఫ్రాంక్లిన్, జేమ్స్ మాడిసన్, అలెగ్జాండర్ హామిల్టన్ వంటి మహనీయుల సారథ్యాన రచించబడిన చట్ట మది. ఫెడరల్ యూనియన్ యొక్క మహత్తర ఆశయాలను వారు విస్పష్టంగా వివరించారు.

రాజ్యాంగచట్ట రచయితలు యీవన్మంది అమెరికా ప్రజల తరఫున వ్యవహరించగలిగిన సాహసం, ఆత్మ విశ్వాసం ఉన్నవారు. రాజ్యాంగ చట్టాన్ని వారు ప్రజలకుగల ఆరు కారణాలకోసం, లేదా లక్ష్యాలకోసం రచించారు. అప్పటి నుంచికూడా అవే సూత్రాలు అమెరికా ప్రభుత్వానికి మార్గ దర్శకములు.

"...ఇంకా నిర్దుష్ట యూనియన్ స్థాపనకు..."

"ఇంకా నిర్దుష్ట యూనియన్" స్థాపన సమస్య 1787 లో గల పదమూడు రాష్ట్రాలు ఎదుర్కొన్న సమస్య లన్నింటిలో అతి కఠినమైనది. అయితే, కాన్ఫెడరేషన్ సూత్రాల ననుసరించి ఏర్పడిన యూనియన్ కంటె మరే యూనియన్ అయినా ఉత్తమంగానే వుండగలదనే సంగతి అప్పు డందరికీ స్పష్టమైంది.

స్థానికావసరాలకు అనుగుణమైన అధికారాల నన్నింటినీ రాష్ట్ర ప్రభుత్వాలు అట్టే పెట్టుకోవచ్చునని రాజ్యాంగ చట్ట రచయితలు అంగీకరించారు. రాష్ట్ర ప్రజలు కోరిన పనులను చెయ్యడానికి తగు అధికారాల నిచ్చారు. అయితే, దేశంలోని యావన్మంది ప్రజల అవసరాలను రాష్ట్ర ప్రభుత్వాలు దృష్టిలో వుంచుకోవాలి. వాటి అధికారాలు దేశాభ్యుద యానికి అవరోధం కలిగించ కూడదు. అట్టి అధికారాలకు మాత్రమే వారు సమ్మతించారు. 1787 లోని ప్రజలు అంతకాలం, అంత ఓపికగా ఆలోచించి, చర్చలుజరిపి స్థాపించిన యూనియన్ అది. స్థానిక వ్యవహారాలలో ప్రతిరాష్ట్రానికి స్వపరిపాలనాధికారం ఇవ్వబడింది. వ్యాపారాలు, కార్మికుల పని వేళలు, పెండ్లిండ్లు, విడాకులు, స్థానికమైన పన్నులు, మామూలు పోలీసులు మొదలైన సమస్యల విషయంలో రాష్ట్రప్రభుత్వం తన యిష్టప్రకారం చర్యలు తీసుకోవచ్చును. అందుచేతనే, సరసనేవున్న రెండు రాష్ట్రాలలో ఒకే సమస్యకు చెందిన చట్టాలు పరస్పర విరుద్ధంగా ఉండడంకూడా కలదు.

"రాష్ట్ర ప్రభుత్వాల హక్కులు" గురించే 1861లో అంతర్యుద్ధం ప్రారంభమై, నాలుగు సంవత్సరాలపాటు రక్త పాతం జరిగింది. క్రొత్తగా ఏర్పడగల రాష్ట్రాలలో బానిసత్వం సమస్యమీద ఫెడరల్ ప్రభుత్వం కంట్రోలు కలిగి ఉంటుందని ఉత్తర రాష్ట్రాలవారు వాదించారు. బానిసల సమస్యమీద అధికారం రాష్ట్ర ప్రభుత్వాలకే ఉండాలనీ, క్రొత్తగా ఏర్పడిన రాష్ట్రాలకైనా, పాతరాష్ట్రాలకైనా ఈ

అధికారం కలదని దక్షిణ రాష్ట్రాలవారు వాదించారు. అందుచేత, దక్షిణాదివారు యూనియన్ నుంచి వేరు పడిపోవాలని చూచారు. కాని, యూనియన్‌కు భంగం కలగకుండా చెయ్యడానికై ఫెడరల్ ప్రభుత్వం బల ప్రయోగం చేసింది. ఘోర యుద్ధంలో దక్షిణాది సైన్యాలు ఓడిపోయాయి. బానిసత్వం నిర్మూలించబడింది. ప్రతి రాష్ట్రానికీ రిపబ్లిక్ ప్రభుత్వం విధిగా ఉండగలదని రాజ్యాంగ చట్టం అభయం యివ్వడంచేత, ఈ ఘోర యుద్ధానంతరంకూడా రాష్ట్ర ప్రభుత్వాలు ఇంతకుముందులాగే స్వపరిపాలన చేసుకున్నాయి.

విశాలమైన దేశంలో 48 రాష్ట్రాలు గలిగి, అనేక సమస్యల నెదుర్కొంటున్న యూనియన్ ఎన్నటికీ "నిర్దుష్టంగా" ఉండజాలదు. కాని, రాజ్యాంగ చట్ట రచయితలు రూపొందించిన యూనియన్ అమెరికా ప్రజలకు సదా అమోఘ ప్రయోజనాలను కలిగించింది.

"...ధర్మ పరిపాలన స్థాపనకు..."

రాజ్యాంగ చట్ట నిర్మాతలకు దారి చూపిన అతి ముఖ్యమైన వాటిలో ఒకటి స్వాతంత్ర్య ప్రకటన. ఇది మానవ స్వాతంత్ర్యానికి చెందిన మహత్తర పత్రం. "మానవులందరు సమాన ప్రతిపత్తితో సృష్టించబడ్డారు," అనే సూత్రం ఈ పత్రానికి ప్రాణం. మానవులకు జన్మతః కొన్ని హక్కు లున్నాయనీ, వాటి నెవరూ భగ్నపరచకూడదనీ, ఆ హక్కులలో కొన్ని "జీవించడం, స్వాతంత్ర్య మనుభవించడం, సౌఖ్య పడడానికి ప్రయత్నించడం" అనీ దానిలో

వక్కాణించబడ్డాయి. రాజ్యాంగ చట్టానికి అమెరికాలో ప్రజలందరు సమానులే. ఒకడు ప్రఖ్యాతి చెందినవాడై ఉండవచ్చు; మరొకడు అనామకుడై ఉండవచ్చు; లేదా, ఒకడు మహా ధనికుడై ఉండవచ్చు; మరొకడు గర్భదరిద్రుడై ఉండవచ్చు. కాని, ఆ యిద్దరూకూడా చట్టానికి సమానంగా చుట్టాలు. ఇరువురు చట్టాన్ని శిరసా వహించవలసిందే; ఇరువురు దాని రక్షణకు హక్కు ఉన్నవారే.

చట్టాన్ని వ్యతిరేకించేవారందరు తారతమ్యం లేకుండా శిక్షార్హులని రాజ్యాంగ చట్టం శాసిస్తూంది. ఇదే విధంగా వ్యాపారంలో గాని, మరొక దానిలోగాని వివాదం వచ్చిన వారికి కోర్టులలో న్యాయం కలిగించబడగలదని ప్రజలకు హామీ యివ్వబడింది. వివాదాలను శాంతియుతంగా పరిష్కరించుకోడానికి, న్యాయం పొందడానికి ఎవరికైనా సాధ్యం. ఆ విధంగా అందరికీ అందుబాటులో ఉండేటట్లు న్యాయ శాఖ ఏర్పడింది.

**"...దేశంలో విధిగా శాంతి నెలకొనడానికి..."**

ఫెడరల్ రాజ్యాంగ చట్టాన్ని తయారు చెయ్యడంలో గల మరొక కారణం రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఇంకా ఎక్కువగా మైత్రిని పోసగించడం; శత్రువుల దౌర్జన్యాలనుంచి ప్రజలను కాపాడగలిగినంత శక్తిమంతమైనదిగా చేసి, దేశంలో ప్రశాంత పరిస్థితులను నెలకొల్పాలనేది మరొక కారణం. ఇతర దేశాలు ముట్టడి జరపకుండా అన్ని రాష్ట్రాలను కేంద్ర ప్రభుత్వం కాపాడగలదనీ, ఏ రాష్ట్రంలోనైనా కల్లోలం

బయలుదేరితే ఆ రాష్ట్రం కోరినయెడల కేంద్ర ప్రభుత్వం జోక్యం కలిగించుకొని శాంతిని స్థాపించగలదనీ రాజ్యాంగ చట్టంలోని నాలుగవ సూత్రం హామీ యిస్తున్నది. 1815 తరువాత అమెరికాలో ఏ భాగంమీదకూడా ఏ యితర దేశం ముట్టడి జరుపలేదు. ఇతరుల సహాయం అవసరం లేకుండా తమ సరిహద్దులలో శాంతి భద్రతలను కాపాడుకోగలిగిన శక్తి తమకు కలదని రాష్ట్ర ప్రభుత్వాలు ఋజువు చేసు కున్నాయి. అందుచేత, రాష్ట్రాలలో శాంతి భద్రతలను నెలకొల్పవలసినదంటూ కేంద్ర ప్రభుత్వాన్ని అవి తరచుగా కోరలేదు. కాని, "రాష్ట్రాలలో శాంతి రక్షణకు" ఫెడరల్ ప్రభుత్వం సర్వదా సిద్ధంగా ఉంటుంది. ఇతర దేశాలనుంచి ముట్టడిప్రమాదం సంభవించ లేకుండా కూడా ఫెడరల్ ప్రభుత్వం సదా జాగ్రత్తలు వహిస్తుంది.

"...సమష్టిరక్షణ ఏర్పాట్లు చెయ్యడానికి..."

పూర్వపు రోజులలో అమెరికా ప్రజలకు ఇతర దేశాల వల్ల ప్రమాద పరిస్థితు లేర్పడేవి. బ్రిటిష్ వారి క్రింద కెనడా, ఫ్రెంచివారి క్రింద లూసియానా, స్పెయిన్ వారికింద ఫ్లారిడా, టెక్సాస్, మెక్సికోలు ఉండేవి. క్రొత్తగా ఏర్పడి, దుర్బలంగా ఉన్న అమెరికాకు నాలుగు వైపుల యూరపియన్ జాతులవా రున్నారు. వారిలో వారికి మైత్రి లేదు. ఫెడరల్ ప్రభుత్వం స్థాపించబడిన కొలది కాలానికే యూరప్‌లో యుద్ధాలు సంభవించగా ఇక్కడ వీరుకూడా యుద్ధాలు ప్రారంభించారు. ఈ యుద్ధాలు చాలాసార్లు జరిగాయి. యుద్ధాల రోజులలో

"సమష్టి రక్షణ" ఏర్పాటు చేసుకోవాలనే అభిప్రాయం కలిగింది. కాని, ఫెడరల్ ప్రభుత్వం అందుకు చురుకుగా చర్యలు తీసుకోడానికి మరికొన్ని సమస్యలు అడ్డువచ్చాయి. మొదటగల పదమూడు కాలనీలకు పశ్చిమాన ఏర్పడిన క్రొత్త కాలనీల చిక్కులను తొలగించడానికి, అక్కడి రెడ్ ఇండియనుల ప్రమాదాన్ని నివారించడానికి ఫెడరల్ ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ వహించవలసి వచ్చింది.

దేశాన్ని, ప్రజలను కాపాడగల సమష్టి రక్షణ బాధ్యతను రాజ్యాంగ చట్టంలో రెండు భాగాలుగా చేసి, ఒక భాగాన్ని శాసనసభకు, రెండవ భాగాన్ని కార్య నిర్వాహక శాఖకు అప్పగించారు. యుద్ధాలను ప్రకటించే అధికారం, సైన్యాల, నౌకాదళాల పోషణ, వ్యయం మొదలైన వాటిపై అధికారం కాంగ్రెస్‌కు అప్పగించ బడింది. ప్రెసిడెంటు ఆ సైన్యాలకు, నౌకాదళాలకు సర్వసైన్యాధ్యక్షుడు. అన్ని రాజ్యాలమధ్య శాంతి పూర్వక సంబంధాలను నెలకొల్పడం అమెరికా విధానం. అయినప్పటికీ, దానికి అజేయసైన్యం. ప్రపంచంలో సాటిలేని యుద్ధనౌకాబలం ఉన్నాయి. ఇవి రాజ్యాంగ చట్టంలోని సమష్టి రక్షణ సూత్రాన్ని పాలించ డానికి మాత్రమేగాని, ఇతర దేశాలమీద ముట్టడులు జరుప డానికి కాదు.

## "...ప్రజాక్షేమాభివృద్ధికి..."

తమ స్వాతంత్ర్య యుద్ధానంతరం అమెరికా ప్రజలు అనేక కష్టాలపాలయారు. దేశంలో పంటలు పండించడానికి,

ఫ్యాక్టరీలలో పని చెయ్యడానికి, ఇళ్ళుకట్టడానికి అవసరమైన అనేకమంది యువకులు అమెరికా సైన్యాలలో చేరి, జనరల్ వాషింగ్టన్ నాయకత్వాన ఆరు సంవత్సరాలపాటు యుద్ధం చేశారు. పదమూడు కాలనీలలోకూడా వ్యాపారం స్తంభించి పోయింది. యుద్ధానంతరం అమెరికా విశేషంగా అప్పులపాలైంది. కరెన్సీ నోట్లకు విలువ లేకుండా పోయింది. ఈ కారణాలచేత ప్రజలుపడిన బాధలు ఇన్నీ అన్నీ కావు. అందుచేత, క్రొత్త ఫెడరల్ ప్రభుత్వం విధి దేశం ఆర్థిక వ్యవస్థను చక్కబరచుకోనడం.

ప్రజా క్షేమానికై చట్టాలనుచేసే అధికారం కాంగ్రెసుకు ఇవ్వబడింది. ఈ సందర్భంలో రాజ్యాంగ చట్టం మొదటి సూత్రంలోని 8 వ సెక్షలో ఇలా ఉన్నది :

> **"...పన్నులు విధించడానికి, వసూలు చెయ్యడానికి, ఋణాలు తీర్చడానికి, రక్షణకార్యకలాపాలకు, ప్రజాక్షేమానికి ఉపయోగపడే పనులకు ధనం వ్యయపరచడానికి కాంగ్రెసుకు అధికారం కలదు..."**

పన్నులు విధించడానికి అధికారం కలిగినందున ఫెడరల్ ప్రభుత్వం ధనాన్ని ప్రోగుచెయ్యగలిగింది. యుద్ధంలో చేసిన ఋణాలను తీర్చ గలిగింది. కరెన్సీకి విలువ లభించేటట్లు చర్యలు తీసుకో గలిగింది. కోశాంగ శాఖామంత్రి, విదేశాంగ శాఖామంత్రి, యుద్ధ శాఖామంత్రి, అటార్నీ జనరల్ నియమించబడ్డారు. ప్రభుత్వం ఏర్పాటుచేసిన మొట్టమొదటి కార్యనిర్వాహక శాఖ లివే. ప్రభుత్వాదాయవ్యయాల

బాధ్యత కోశాంగ శాఖకు, ఇతర దేశాలతో వ్యవహరించే బాధ్యత విదేశాంగ శాఖకు, సైనిక నౌకాదళాల బాధ్యత యుద్ధశాఖకు, ఆ కార్యాలయాలకు సలహా లిచ్చే బాధ్యత అటార్నీ జనరల్‌కు, ఫెడరల్ పబ్లిక్ ప్రాసిక్యూటరుకు అప్పగించ బడ్డాయి.

దేశం అంతకంతకు విస్తరించిన కొలది ఆర్థిక వ్యవహారాలు డొంకలాగ అల్లుకు పోయాయి. అందుచేత, "ప్రజా క్షేమం కోసం" ఇంకా కార్యాలయాలు నెలకొల్ప బడ్డాయి. ఈ కార్యాలయాలను గురించి చదవబోయే పేజీలలో సవిస్తరంగా కలదు.

**"...మనకు, మన సంతతికి స్వాతంత్ర్య దేవత ఆశీస్సులను పొందడానికి..."**

ఫెడరల్ రాజ్యాంగ చట్టం లక్ష్యాలలో మరొకటి, క్రొత్తగా సంపాదించిన స్వాతంత్ర్యం చెయ్యి జారిపోకుండా కాపాడు కొనడం; ఫెడరల్ ప్రభుత్వానికి అధికారా లిచ్చిన రాజ్యాంగ చట్ట సృష్టికర్తలు సమస్త ప్రజల హక్కుల, ప్రయోజనాల రక్షణగురించికూడా జాగ్రత్త పడ్డారు. వాటికి భంగం కలుగజాలని రీతిగానే జాతీయ, రాష్ట్ర ప్రభుత్వాలకు అధికారా లిచ్చారు. అందువల్ల, చట్టానికిలోబడి ఉన్నంత కాలం ప్రజలు అమెరికాలో ఎచ్చోటికైనా సరే యథేచ్ఛగా వెళ్ళగలరు; తమ ఆస్తిపాస్తులను భద్రంగా కాపాడుకోగలరు; వారి ప్రాణాలకు భయంలేదు; అన్యాయం జరిగినవారు కోర్టులలో న్యాయం పొందగలరు.

రాజ్యాంగ చట్టంలో ప్రజలకు తిరుగులేని హక్కులిచ్చిన "హక్కుల బిల్లు" ముఖ్యంగా గమనించదగింది. ఎట్టి పరిస్థితుల లోను కూడా పౌరుల "జన్మ హక్కులకు" భంగం కలిగించ బడరాదని ఆ బిల్లు శాసిస్తూంది. రాజ్యాంగ చట్టాన్ని తయారుచేసిన నాయకుల ఆశయం, "హక్కుల బిల్లు"ను సత్వరమే చేయించిన ప్రజల ఆశయంకూడా మానవ స్వత్వా లను పరి రక్షించడం; పరిపాలనకు అవసరమైన అధికారాలను ప్రభుత్వాని కివ్వడం. ఈ ఆశయం స్వాతంత్ర్య ప్రకటనలోని ఒక్క వాక్యం విస్పష్టం చేస్తూంది.

> **"మానవ స్వత్వాల రక్షణకు ప్రజలమధ్య ప్రభుత్వా లేర్పడి, అవి అవసరమైన అధికారాలను ప్రజలనుంచి పొందుతున్నాయి."**

# 6

# కాంగ్రెసు నిర్మాణం

ఫెడరల్ రాజ్యాంగ చట్టం మొదటి సూత్రంలోని మొదటివాక్యం ఇది: "ఇందుమూలంగా ఇవ్వబడిన శాసనాధికారాలన్నీ, సెనేటు, ప్రతినిధుల సభ ఉండగల కాంగ్రెసుకు లభించ గలవు." అందుచేత శాసనాలను చేసే అధికారం ఒకవర్గానికి కాక, రెండు వర్గాలకు అప్పగించబడింది. ఆ రెండు వర్గాలవారు కలిసి కృషి చేస్తారు.

రాజ్యాంగ చట్టాన్ని రూపొందించడానికి జరిగిన సమావేశంలో చిన్నరాష్ట్రాలనుంచి వచ్చిన ప్రతినిధులు పెద్ద రాష్ట్రాలతో సమానంగా తమకు కాంగ్రెసులోని ఉభయ శాసన సభలలోను ప్రాతినిధ్యం కావాలన్నారు. కాని, అలాగ జరగలేదు. ఆ ప్రతినిధులు ఒక అంగీకారాన్ని కుదుర్చుకున్నారు. సెనేటులో ప్రతిరాష్ట్రానికి ఇద్దరేసి సెనేటర్లు ఉండాలని నిర్ణయించు కున్నారు. ప్రతి రాష్ట్రానికి ఎందరు ప్రతినిధు లుంటారో తరువాత పేజీలలో వివరించబడింది.

రాజ్యాంగ చట్టానికి 1913 లో 17 వ సవరణ చెయ్యబడినప్పటినుంచి, సెనేటర్లుకూడా వోటరులచేతనే ఎన్నుకోబడుతున్నారు. 1913 కు పూర్వం సెనేటర్లను రాష్ట్రశాసన సభా సభ్యులు ఎన్నుకొనే వారు. ఎందుకంటే, సెనేటర్లు రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రాతినిధ్యం వహిస్తూ, చిన్న రాష్ట్రా

లకు అన్యాయం జరగకుండా శ్రద్ధ వహించాలని మొదటి రోజులలో భావించారు.

ఆదిలోగల పదమూడు కాలనీల గవర్నర్లకు సలహాలిచ్చిన కౌన్సిళ్ళు ఉండేవి. ఆ కౌన్సిలర్లు రాజుచేత నియమించబడేవారు. ప్రజా ప్రతినిధులుగల అసెంబ్లీల కార్య కలాపాలను ఈ కౌన్సిళ్ళు పరిశీలించేవి. అందుకై వాటికి రాజు యిచ్చిన అధికారం కలదు. సాధారణంగా కౌన్సిలర్లు ధనవంతులై, కాలనీలలో పలుకుబడి గలవారై ఉండేవారు. లేదా, గవర్నర్ల బంధువులు; లేదా పూర్వపు ఇంగ్లీషువారి సంతతివారు. వారు ధనవంతుల ప్రతినిధులు గనుక, శాంతి భద్రతలకు తగు సామర్థ్యా లున్నవారని భావించేవారు. కాలనీలు స్వపరిపాలనాధికారంగల రాజ్యాలైన తరువాత, శాసనాధికారాన్నంతనూ అసెంబ్లీల కివ్వడానికి ప్రజలు భయపడ్డారు. ఎందుచేతనంటే, అసెంబ్లీ సభ్యులు ఎంతోకాలం సభ్యులుగా ఉండరు. పైగా, వారు పెద్ద ధనవంతులే కానవసరం లేదు. అందుచేత, రాష్ట్రాల రాజ్యాంగ చట్టాలన్నీ (పెన్సిల్వేనియా, జార్జియాలు తప్ప) సెనేటు సభలనుకూడా ఏర్పాటు చేశాయి. సెనేటు సభ్యులు దీర్ఘకాలం సభ్యత్వం కలిగి ఉంటారు. ఆస్తి పాస్తులు కలిగి ఉంటారు.

| | ప్రతినిధుల సభ | సెనేటు |
|---|---|---|
| మొత్తం సభ్యులు | *435. | 96 |
| ఒక్కొక్క రాష్ట్రానికి ప్రతినిధులు | జనాభాను బట్టి. | 2 |
| ఎన్నుకొనేవారు.. | కాంగ్రెస్ జిల్లా వోటరు (కొందరు కాంగ్రెసు సభ్యులను రాష్ట్రంలోని వోటరు లందరు కలిసి ఎన్నుకోవాలి. ఈ స లను "కాంగ్రెస్‌మన్ ఎట్ లార్జ్" అంటారు.) | రాష్ట్రంలోని వోటరు లందరు. |
| పదవీకాల పరిమితి | 2 సంవత్సరాలు. | 6 సంవత్సరాలు. |
| ఖాళీలు ... | ప్రత్యేకపు ఎన్నికలలోగాని, మళ్లీసారి జరిగే జనరల్ ఎన్నికలలోగాని భర్తీ అవుతాయి. | ప్రత్యేకపు ఎన్నికలలోగాని మళ్లీ ఎన్నికలవరకు గవర్నరు ఎవరినైనా నియమించడంవల్లగాని భర్తీ అవుతాయి. |
| జీతం ... | †సాలుకు 15000 డాలర్లు. | †సాలుకు 15000 డాలర్లు. |

* 1940 జనాభా లెక్కల ప్రకారం.

† సాలీనా ఖర్చుల నిమిత్తం ఇవ్వబడే 2500 డాలర్లు కూడా దీనిలోనివే. (వాటిమీద పన్ను లేదు.) 1946 ఆగస్టు 2 వ తేదీనుంచి ఇవ్వబడుతున్నాయి.

| | ప్రతినిధుల సభ | సెనేటు |
|---|---|---|
| సమావేశం ... (మామూలుగా) | ప్రతి సంవత్సరం జనవరి 3 న. | ప్రతి సంవత్సరం జనవరి 3 న. |
| అధ్యక్షుడు ... | స్పీకరు. | అమెరికా వైస్ ప్రెసిడెంటు. |
| ఒక్కొక్క సభకు గల ప్రత్యేకాధికారాలు | (1) పన్నుల బిల్లులను తయారుచెయ్యడం. | (1) సంధులకు సమ్మతించడం, లేదా సమ్మతించకపోవడం. |
| | (2) సివిల్ ఆఫీసర్లు అక్రమం చేస్తే నేరారోపణ చెయ్యడం. | (2) నేరారోపణ చెయ్యబడిన ఆఫీసర్లను విచారణ జరపడం. |
| | (3) ప్రెసిడెంటు ఎలక్షనులో ఎవరికీ తగినంతగా మెజారిటీ వోట్లు రానప్పుడు ప్రెసిడెంటును ఎన్నుకోనడం. | (3) ప్రెసిడెంటు నియమించినవారి ఉద్యోగాలను ధ్రువపరచడం, లేదా నిరాకరించడం. |
| | | (4) వైస్ ప్రెసిడెంటు ఎలక్షనులో ఎవరికీ తగినంతగా మెజారిటీవోట్లు రానప్పుడు వైస్ ప్రెసిడెంటును ఎన్నుకోనడం. |

రాజ్యాంగ పరిషత్తువారు శాసన నిర్మాణాధికారం గల శాఖను స్థాపించాలని నిర్ణయించు కున్నప్పుడు సెనేటును నెలకొల్పడంలో అధిక ప్రయోజనా లున్నాయని తెలుసు కున్నారు. ప్రజలకు ప్రాతినిధ్యం వహించే ఒక సభవారు, రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రాతినిధ్యం వహించే మరొక సభవారు ఆమోదించినదే శాసనంగా అమలు జరుగగలదని నిర్ణయిస్తే, శాసనాలు హడావిడిగా, అశ్రద్ధగా చెయ్యబడే ప్రమాదం ఉండదని రాజ్యాంగ పరిషత్తువారు యోచించారు. రెండు శాసనసభ లుంటే ఒకదాని కొకటి అడ్డుగా ఉంటాయి. సెనేటులో చిన్న రాష్ట్రాలకు తగినంతగా ప్రాతినిధ్యం ఉన్నందున, ప్రతినిధుల సభలో పెద్దరాష్ట్రాలకు ఎక్కువ ప్రాతినిధ్యం ఉన్నందున అన్నింటికీ న్యాయం జరుగుతుంది. "హెచ్చు తగ్గులను సవరించే" పద్ధతిగల రాజ్యాంగంలో ఇదొక భాగం. దీనిని గురించి మరొక అధ్యాయంలో వివరించ బడింది.

## కాంగ్రెసు సభ్యుల యోగ్యతలు

సెనేటు సభ్యులు 30 సంవత్సరాలకు పైబడిన వయస్సు కలవారు కావాలి. వారిని రాష్ట్రాల శాసనసభలు ఎన్నుకోవాలి. తొమ్మిది సంవత్సరాలు ఆ ఎన్నుకోబడిన రాష్ట్రంలో నివసించిన పౌరులై ఉండాలి. ప్రతినిధుల సభాసభ్యులు 25 సంవత్సరాల వయస్సు కలవారై ఉండాలి. వారు ఏడు సంవత్సరాలు తాము ఎన్నుకోబడిన రాష్ట్రాలలో నివసించి ఉండాలి. వీరి ఇతర యోగ్యతలను గురించి రాష్ట్రప్రభుత్వాలు నిర్ణయించు కోవచ్చును. కాని, రాజ్యాంగ చట్టం ప్రకారం ప్రతినిధుల

సభాసభ్యుల యోగ్యతలను ప్రతినిధులసభ, సెనేటర్ల యోగ్యతలను సెనేటు నిర్ణయించ గలవు. ఆ పైన ఇతర యోగ్యతలను మాత్రమే రాష్ట్రాలు నిర్ణయించుకో వచ్చు.

కాంగ్రెసులోని సెనేటుకు ఒక్కొక్క రాష్ట్రానికి ప్రాతినిధ్యం వహించే సెనేటర్లు ఇద్దరుంటారు. 1248 చదరపు మైళ్ళ విస్తీర్ణం మాత్రమే గల రోడ్ ఐలెండ్ రాష్ట్రం, 2,65,941 చదరపుమైళ్ళ విస్తీర్ణంగల టెక్సాస్ రాష్ట్రం సెనేటులో సమానంగా భాగం కలవి. 1940 జనాభా లెక్కల ప్రకారం నెవాడారాష్ట్రం జనసంఖ్య 1,10,247 మాత్రమే. న్యూయార్క్ రాష్ట్రం జనాభా 1,34,79,142. అయినప్పటికీ సెనేటులో వాటి ప్రతినిధులు ఇద్దరేసి మాత్రమే. అందుచేత, అమెరికాలోని రాష్ట్రాలు 48 గనుక, సెనేటర్ల సంఖ్య 96.

ప్రతినిధుల సభలో సభ్యుల సంఖ్యను కాంగ్రెసు నిర్ణయిస్తుంది. ఈ సంఖ్యను ఆ యా రాష్ట్రాల జనాభా ప్రకారం పంచుతారు. జనసంఖ్యనుబట్టి ఏ రాష్ట్రానికి ఎందరు ప్రతినిధులను నిర్ణయించి నప్పటికీ, జనసంఖ్య బొత్తిగా తక్కువ ఉన్నప్పటికీ, ప్రతిరాష్ట్రానికి కనీసం ఒక ప్రతినిధి అయినా ఉండి తీరాలని రాజ్యాంగచట్టం శాసిస్తోంది. అప్పుడప్పుడు జనాభా లెక్కలను తీసుకోవాలని కూడా రాజ్యాంగచట్టంలో చేర్చబడింది. అందువల్ల, ఆ యా రాష్ట్రాల ప్రతిధుల సంఖ్యలు దానిప్రకారం మార్పు చెయ్యబడుతూండగలవు. ఈ విధంగా ప్రతిపౌరునికి ప్రభుత్వ వ్యవహారాలలో సాధ్యమైనంతగా సమానపాత్ర

లభించేటట్లు శ్రద్ధవహించ బడింది. ఒక రాష్ట్రప్రజలకు మరొక రాష్ట్రప్రజలకంటె ప్రభుత్వ వ్యవహారాల్లో ఎక్కువజోక్యంలేదు.

అమెరికా జనాభా త్వరితంగా పెరిగి నప్పటికీ, ప్రతినిధుల సంఖ్య అంతగా హెచ్చించ బడలేదు. 1790 లో ఎందరు ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకో బడాలని నిర్ణయించారో, ఈనాడుకూడా అందరు ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకోబడాలంటే కాంగ్రెసులో ప్రతినిధులు 4,000 మంది అవుతారు.

మొట్టమొదటి కాంగ్రెసులో ప్రతినిధులు 65 మంది మాత్రమే. ఒక్కొక్క రాష్ట్రంలో ఎందరు ప్రతినిధులను ఎన్నుకోవాలో రాజ్యాంగ పరిషత్తువారు నిర్ణయించారు. మొదటిసారి జనాభా లెక్కలను సేకరించిన తరువాత ప్రతినిధుల సంఖ్య 106 కు పెంచబడింది. అప్పుడు తిరిగి ఏ రాష్ట్రంలో ఎందరు ప్రతినిధులను ఎన్నుకోవాలో నిర్ణయించుకున్నారు. అప్పటినుంచి 10 సంవత్సరాల కొకసారి ఆ విధంగా జరుగుతూంది. 1920 జనాభా లెక్కల తరువాతనుంచి ఆ విధంగా జరగడంలేదు. 1790 లో కంటె జనాభా నూటికి 33 వంతులు ఎక్కువ పెరిగినప్పటికీ, 1910 నుంచి ప్రతినిధుల సంఖ్య 435 మాత్రమే.

ఇప్పటి చట్టాల ప్రకారం, ఏ రాష్ట్రం జనాభా ఎంత ఉన్నదో జనాభా లెక్కలవల్ల తేలినపిదప, ప్రెసిడెంటు కాంగ్రెసుకు ఒక నివేదిక అందజెయ్యాలి. ఏ రాష్ట్రానికి ఎందరు ప్రతినిధులను కేటాయించాలో కూడా ప్రెసిడెంటు దానిలో

ఉదాహరించాలి. తరువాత 60 రోజులలోగా ప్రతినిధుల సంఖ్యను మార్పు చెయ్యడమో, లేక ప్రతినిధుల కేటాయింపు పద్ధతిలో మరొక పద్ధతి అవలంబించడమో కాంగ్రెసు నిర్ణయించాలి.

కాంగ్రెసుకు ఏ రాష్ట్రంనుంచి ఎందరు ప్రతినిధులు పంపబడాలో పై విధంగా నిర్ణయమైన తరువాత, వారిని ఏ విధంగా ఎన్నుకొనడమో గురించి రాష్ట్రాల శాసన సభలు నిర్ణయిస్తాయి. ఒక రాష్ట్రానికి ఎందరు ప్రతినిధులు కేటాయించబడగలరో, దానిని అన్ని జిల్లాలుగా విభజించాలి. రాష్ట్రంలో మారుమూల ప్రాంతాన్నయినా సరే విడువకుండా దానిని ఏదో ఒక జిల్లాలో కలిపితీరాలి. ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క ప్రతినిధిచొప్పున ఎన్నుకోబడుతాడు. వారే ఆ జిల్లాల ప్రజలకు కాంగ్రెసులో ప్రాతినిధ్యం వహిస్తారు.

అయితే, రాష్ట్రాలను ఈ ప్రకారం జిల్లాలుగా విభజించాలని ప్రస్తుతం చట్టమేదీ లేదు. అందుచేత, కొన్ని రాష్ట్రాలలో అనేక సంవత్సరాలనుంచి మార్పు జరగలేదు. మరికొన్ని రాష్ట్రాలలో ప్రతినిధుల సంఖ్య ఎక్కువ, జిల్లాలసంఖ్య తక్కువ. అందుచేత, జిల్లాకొక ప్రతినిధి చొప్పున ఎన్నుకోగా మిగిలిన వారిని రాష్ట్రంలోని వోటరు లందరు కలిసి ఎన్నుకుంటారు. ఈ విధంగా ఎన్నుకోబడిన వారిని "అదనపు ప్రతినిధులు" అంటారు. ఇప్పటి కాంగ్రెసులో సుమారు ప్రతి 3,00,000 మందికి ఒక ప్రతినిధి చొప్పున ఉన్నారు.

సెనేటర్లలో మూడవవంతు మంది ఎన్నికలు సరిసంఖ్యగల సంవత్సరాలలో నవంబరులో జరుగుతాయి. అంటే, రెండు సంవత్సరాల కొకసారి మూడవవంతు మాత్రమే ఎన్నుకోబడుతూ ఉంటారు. అందుచేత, సెనేటులో అందరూ క్రొత్త సభ్యులై ఉండడం ఎన్నటికీ జరుగదు. కనీసం రెండువంతుల మంది అనుభవంగల పాతవారై ఉంటారు.

ప్రతినిధుల ఎన్నికలుకూడా సరి సంఖ్యగల సంవత్సరాల నవంబరు నెలల్లో జరుగుతాయి. అయితే, అందరు ప్రతినిధుల సభ్యత్వం ఒకేసారి సమాప్తమవుతుంది. అందుచేత, అందరు ప్రతినిధుల ఎన్నికలు తిరిగి ఒకేసారి జరగాలి. పాతవారే మళ్ళీ పోటీ చెయ్యవచ్చు. అనేకమంది ప్రతినిధులు తమ జిల్లాలలోని (నియోజక వర్గాలలోని) ప్రజలకు అభిమానులై పదే పదే ఎన్నుకోబడుతున్నారు. అందుచేత, ప్రతినిధుల సభలోకూడా అందరూ కొత్త సభ్యులే కావడం ఎన్నడూ జరుగదు.

ప్రతినిధుల సభాసభ్యులు రెండు సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడుతూ ఉంటారు గనుక, కాంగ్రెసు గడువు రెండు సంవత్సరాలన్న మాట. రాజ్యాంగ చట్టంలోని 20 వ సవరణ ప్రకారం, ప్రతి సంవత్సరం జనవరి 3 వ తేదీ మధ్యాహ్నం కాంగ్రెసు సమావేశం ప్రారంభం కావాలి. కాని, ఏదైనా చట్టం చెయ్యడానికి మరొక తేదీన సమావేశం జరగాలని నిర్ణయించబడితే తప్ప ఆ విధంగానే జరగాలి. కాంగ్రెసు సమావేశం వాషింగ్టన్ (డి. సి.) లోని ప్రభుత్వ భవనంలో జరుగుతుంది. సమావేశాన్ని వాయిదా వెయ్యాలని సభ్యులు

తీర్మానించేవరకు చర్చలు జరుగుతూంటాయి. అవసరమని తోచినప్పుడల్లా ప్రత్యేక సమావేశం జరుపాలని ప్రెసిడెంటు ఆదేశించ వచ్చు.

సెనేటుకు. ప్రతినిధుల సభకు గల అధికారాలు

1. ఏదైనా చట్టం ప్రతిపాదించబడినప్పుడు దానిని గురించి యోచించడానికి ఉభయ సభలకు అధికారం కలదు (పన్నులను హెచ్చించే చట్టాలు తప్ప).

2. ఒకసభ ఆమోదించిన చట్టాన్ని ఆమోదించడానికైనా, నిరాకరించడానికైనా రెండవసభకు అధికారమున్నది.

రాజ్యాంగ చట్టం ప్రకారం ఈ క్రింది అధికారాలు సెనేటుకు మాత్రమే కలవు:

1. అనేక ముఖ్యమైన పదవులకు ప్రెసిడెంటు నియమించిన వారిని సెనేటు నిరాకరించి, ఆయనకు అవరోధం కలిగించ గలదు.

2. అమెరికా విదేశంతో ఏ ఒడంబడికనైనా చేసుకున్నట్టయితే దానిని సెనేటు ఆమోదించినప్పుడుగాని చెల్లనేరదు (హాజరైన సెనేటర్లలో మూడింట రెండు వంతులమంది మెజారిటీ ఆమోదం ఉండాలి).

3. నేరారోపణ (ఇంపీచ్) చెయ్యబడిన ప్రభుత్వాధికారులను విచారణచేసి శిక్షించడానికి సెనేటుకు సంపూర్ణాధికారం కలదు. అయితే, నేరారోపణ (ఇంపీచ్) చెయ్యడానికి ప్రతినిధుల సభకు మాత్రమే అధికారం కలదు. (అంటే, ఏ సివిల్ ఆఫీసరైనా డిస్మిస్ చెయ్యబడ వలసినంతటి పెద్ద

నేరం చేసినట్లు ఆరోపణ చెయ్యడం. ప్రతినిధులసభ ఆరోపణ చేస్తే సెనేటుసభ విచారణ జరుపుతుంది.)

ఇవి యిలావుండగా, ప్రభుత్వానికి ఆదాయం తెచ్చే బిల్లులను చేసే ముఖ్యమైన అధికారం ప్రతినిధుల సభకే ఉండాలని రాజ్యాంగచట్టం నిర్దేశిస్తూంది. అటువంటి చట్టాలన్నీ ప్రతినిధుల సభలో ఆమోదించబడిన పిమ్మటనే సెనేటుసభ తద్విధంగా చర్యలు తీసుకోగలదు. అందుచేత, ఫెడరల్ ప్రభుత్వానికి అవసరమైన ధనాన్ని నిర్ణయించడంలోను, దానిని సమకూర్చగల పద్ధతిని నిర్ణయించడంలోను చిన్నరాష్ట్రాల కంటె పెద్ద రాష్ట్రాలకు ఎక్కువ వోట్లున్నాయి. ప్రతినిధులసభ ఆమోదించిన రెవిన్యూ బిల్లుకు సెనేటుసభ ఎన్ని సవరణ లైనా చెయ్యవచ్చు. అప్పుడు ప్రతినిధుల సభవారు నియోగించిన కొందరు సభ్యులు, సెనేటు సభవారు నియోగించిన కొందరు సభ్యులు "కాన్ఫరెన్సు కమిటీ"గా ఏర్పడుతారు. ఆ కమిటీలో చర్చలుజరిపి, ఉభయ సభలకు సంతృప్తి కుదుర్చు కుంటారు. అప్పుడాబిల్లు చట్టమవుతుంది. ఏమైనా, ప్రతినిధుల సభకుగల రెవిన్యూ బిల్లులుచేసే అధికారం చాలా ముఖ్య మైనది. ప్రభుత్వ శాసనశాఖ సక్రమంగా పనిచెయ్యడానికి గల "అవరోధాలు, సరిపుచ్చడాలు" అనేపద్ధతిలో ఇదొక అంశం.

రాజ్యాంగచట్టంలో ఇవన్నీ చేర్చబడిన ఫలితంగా, ప్రభు త్వంలో తుది అధికారం తమదేనని అమెరికా ప్రజలు ఇప్పటికీ తలపోస్తారు. దేశక్షేమం నిమిత్తం ప్రతినిధులు, సెనేటర్లు తమకు సమాధానం చెప్పవలసినవారని ప్రజలకు విదితమే.

# 7

# కాంగ్రెసు అధికారాలు

శాసనాలు చెయ్యడంలో కాంగ్రెసులోని ఉభయ శాసనసభలకు ఇంచుమించు ఒకే అధికారాలున్నాయి. దేనిలోనైనా క్రొత్త చట్టాన్ని ప్రతిపాదించవచ్చు (పన్నులను విధించే చట్టాలను తప్ప). ఒక సభలో ఆమోదించబడిన చట్టాన్ని రెండవది నిరాకరించవచ్చు కూడా.

ఫెడరల్ ప్రభుత్వానికి (కాంగ్రెసుకు) ప్రజలు ఇచ్చిన అధికారాలు రాజ్యాంగ చట్టంలో స్పష్టంగా ఉదహరించబడ్డాయి. కాంగ్రెసు చట్టాలను చెయ్యడానికి అధికారంగల 18 అంశాలు ఒక పట్టికలో తెల్పబడ్డాయి. మిగిలిన వాటి మీద చట్టాలను చేసుకొనే అధికారం రాష్ట్రాలకు విడిచి పెట్టబడింది. రాజ్యాంగచట్టం మొదటి సూత్రంలోని ఎనిమిదవ సెక్షన్‌లోని ఆ 18 అంశాలు విస్తృతమైనవీ, ముఖ్యమైనవీ కూడా. అవి :

1. పన్నులను విధించి, వసూలుచెయ్యడం.

2. అప్పు చెయ్యడం.

3. అమెరికా రాష్ట్రాలమధ్యను, విదేశాలతోను వ్యాపారం జరగడానికి నియమాలను, సూత్రాలను చెయ్యడం.

4. నాణేలను తయారుచేసి, వాటి విలువలను నిర్ణయించడం ; తూకపురాళ్ళను, కొలత పాత్రలను, కొలత బద్దలను నిర్ణయించడం ; వీటి విషయంలో మోసం చేసే వారిని శిక్షించడం.

5. విదేశీయులకు అమెరికా పౌరసత్వాన్ని యివ్వ డానికి దేశమంతకూ వర్తించే నిబంధనలను చెయ్యడం.

6. వ్యాపారాదులలో దివాలా తీసేవారందరికి సమానంగా వర్తించే చట్టాలు చెయ్యడం.

7. పోస్టాఫీసులను, తంతి తపాలా సౌకర్యాలను ఏర్పాటు చెయ్యడం.

8. పేటెంటులను, కాపీరైట్‌లను యివ్వడం.

9. ఫెడరల్ కోర్టుల పద్ధతిని ఏర్పాటుచెయ్యడం.

10. ఓడ దొంగలను శిక్షించడం.

11. యుద్ధప్రకటన చెయ్యడం.

12. సైన్యాలను నెలకొల్పి, వాటిని పోషించడం.

13. నౌకాదళాలను స్థాపించడం.

14. నౌకా, సైనిక దళాలకు వర్తించే నిబంధనలు, సూత్రాలు చెయ్యడం.

15. ఫెడరల్ చట్టాలను అమలు పరచడానికి, అరాజకాన్ని అణచడానికి, ముట్టడి జరిపినవారిని తరిమి వేయడానికి సైన్యాలను వినియోగించడం.

16. సైన్యాలను నిర్మించడానికి, వాటికి ఆయుధాలను కూర్చడానికి రాష్ట్రప్రభుత్వాలతో సహకరించడం.

17. కొలంబియా జిల్లాకు వర్తించగల చట్టాల నన్నింటినీ చెయ్యడం.

18. రాజ్యాంగ చట్టంద్వారా అమెరికా ప్రభు త్వానికి గాని, ప్రభుత్వ కార్యాలయానికి గాని,

ప్రభుత్వాధికారికి గాని లభించిన అధికారాల నన్నింటినీ ఆచరణలో పెట్టడానికి అవసరమగు చట్టాల నన్నింటినీ చెయ్యడం.

కాంగ్రెసు ఈ క్రింది పనులు చెయ్యరాదని రాజ్యాంగ చట్టం విధిస్తుంది :

1. విప్లవమో, తిరుగుబాటో జరిగిన సందర్భాలలో తప్ప, హేబియస్ కార్పస్ రిట్‌ను సస్పెండు చెయ్యడం.

2. నేరాలు చేశారనిగాని, చట్ట విరుద్ధంగా ఆచరించారనిగాని విచారణ జరపకుండా శిక్షించగల రీతిగా చట్టాలను చెయ్యడం.

3. ఒక పని చేసిన రోజులలో, అది చట్ట ప్రకారం నేరం కానప్పుడు, అది నేరమంటూ ఆ తరువాత నిర్ణయించే చట్టాన్ని చెయ్యడం.

4. ముందుగానే తీసుకోబడిన జనాభా లెక్కల ఆధారంతోతప్ప, రాష్ట్రాల ప్రజలమీద సూటి పన్నులను విధించడం.

5. ఏ రాష్ట్రంనుంచి అయినా ఎగుమతి అయ్యే సరకులమీద పన్ను విధించడం.

6. వ్యాపారంలోగాని, పన్నులలోగాని ఏ రాష్ట్రపు నౌకాశ్రయాల విషయంలోను, నౌకల విషయంలోను పక్షపాతాన్ని చూపడం.

7. ధనికులనీ, ప్రభువులనీ ఎటువంటి బిరుదులను యివ్వడానికి అనుమతించడం.

## కాంగ్రెసు అధికారులు, నాయకులు

అమెరికా వైస్ ప్రెసిడెంటు సెనేటుకు అధ్యక్షత వహించాలనీ, వోటింగు తెగని సందర్భంలోతప్ప (టై వచ్చినప్పుడు), ఆయన వోటు వెయ్యరాదనీ రాజ్యాంగ చట్టంలో నిర్ణయించబడింది. ప్రతినిధుల సభా సభ్యులు స్పీకరును, ఇతర అధికారులను ఎన్నుకోవాలని కూడా దానిలో తెల్పబడింది. వైస్ ప్రెసిడెంటు హాజరు కానప్పుడు సెనేటు సభకు అధ్యక్షత వహించవలసినవారిని, ఇతర అధికారులను సెనేటు సభ్యులు ఎన్నుకుంటారు. ప్రతినిధుల సభాసభ్యులలో ఎక్కువమంది ఏ రాజకీయ పక్షానికి చెందినవారో వారినుంచి స్పీకరు ఎన్నుకోబడుతాడు. ముఖ్యమైన కమిటీల సభ్యులను ఎన్నడంలోను, ప్రతినిధుల సభా కార్యక్రమాన్ని కొనసాగించడంలోను ఆయనకు అమితంగా పలుకుబడి ఉంటుంది.

సెనేటులోని వివిధ రాజకీయపక్షాల సభ్యులు క్రొత్త కాంగ్రెసు ఏర్పడినప్పుడల్లా సమావేశమై "సభా నాయకుడు" గా ఒకనిని ఎన్నుకుంటారు. ఆయనకు సహాయ పడడానికి తమతమ పార్టీలనుంచి కొందరిని నియమిస్తారు. ప్రతినిధుల సభాసభ్యులు కూడా ఇదేవిధంగా చేస్తారు. ఆయా రాజకీయపక్షం సాంప్రదాయాలను బట్టి ఈ నాయకులను ఎన్నుకుంటారు. తమతమ రాజకీయపక్షాలు వాంఛించిన చట్టాలను ఆమోదింప చెయ్యడానికి, తమకు ప్రతికూలంగావున్న చట్టాలు వీగిపోయేటట్లు చెయ్యడానికి ఈ నాయకులు

కృషిచేస్తూంటారు. శాసనాలను చేసే రాజ్యాంగ విధానంలో వీరు ప్రముఖపాత్ర నిర్వహిస్తారు.

## శాసనాలు చేసే పద్ధతి

ప్రతి కాంగ్రెసులోను వేలకొలది బిల్లులు చర్చకు రాగలవు. ఇవి అనేక రకాలుగా వుంటాయి. ఒక బిల్లు శాసన రూపం దాల్చడానికి పూర్వం, దానిపట్ల శ్రద్ధగల పౌరుల సాక్ష్యాలను, అధికారుల సాక్ష్యాలను, ఒకొక్కొక్కప్పుడు కాంగ్రెసు సభ్యుల సాక్ష్యాలను వినడం ఆచారం. ఆ బిల్లు వలన కలిగే ఫలితాలను యోచించడానికి ఇవి జరుగుతాయి.

అనేక సమస్యలమీద అనేకరకాల బిల్లులు ప్రతిపాదించబడుతూంటాయి గనుక, ఉభయ సభల సభ్యులకు చాలా పని ఉంటుంది. అందుచేత, ఉభయ శాసనసభలలోను అనేక ఉపసంఘాలను ఏర్పాటు చేస్తారు. అవి ఈ బిల్లులను తయారు చెయ్యడం, వాటిని పరిశీలించడం మొదలైన పనులన్నీ చేస్తూంటాయి. ఈ ఉపసంఘాలన్నీ ఒక మెజారిటీ పార్టీ సభ్యుని అధ్యక్షతక్రింద ఏర్పాటు చెయ్యబడుతాయి. వీటిలో మైనారిటీ పార్టీకికూడా తగినంత ప్రాతినిధ్యం ఇవ్వబడుతుంది. ఇటీవల చెయ్యబడిన ఒక చట్టం ప్రకారం, కొన్ని పాత పద్ధతులను మానివేసి, 15 స్టాండింగు కమిటీలను ఏర్పాటు చేశారు. వాటిలో ఏ సమస్యలు చర్చించబడగలవో వాటి పేర్లే సూచించగలవు— కేటాయింపులు ; వ్యవసాయం ; సాయుధ బలాలు ; ప్రభుత్వ భూములు ; మాజీ సైనికుల వ్యవహా

రాలు ; బ్యాంకింగ్ అండ్ కరెన్సీ ; విదేశ వ్యవహారాలు మొదలైనవి.

ఒక బిల్లు ప్రతిపాదించ బడినప్పుడల్లా దానిని పరిశీలించ డానికి ఒక కమిటీకి పంపుతారు. ఉదాహరణకు, ధాన్యపు ధరలకు సంబంధించిన బిల్లు ప్రతిపాదించబడితే వ్యవసాయ సంఘానికి పంపబడుతుంది. దానిలో ఆ బిల్లును గురించి సవిస్తరంగా యోచిస్తారు. దానిలో అధిక సంఖ్యాకులు ఆ బిల్లు పట్ల అనుకూలంగా వుంటే, శాసనసభలో ఆమోదించ వచ్చునంటూ వెనక్కి పంపుతారు.

కమిటీలో అధిక సంఖ్యాకులకు ఆ బిల్లు ఇష్టం కాకపోతే, వారు దానిని తమ యిష్టానుసారం త్రిప్పివ్రాయవచ్చు ; లేదా మార్పులైనా చెయ్యవచ్చు. ఆ బిల్లును ఒకమూల పడవేసి, దానిని ఆలస్యం చెయ్యగలరు కూడా. అయితే, ఈ తంత్రంవలన దానిని శాశ్వతంగా దాచివుంచలేరు. ప్రతినిధుల సభలో 218 మంది సంతకాలుచేసి, "ఆ బిల్లును బయట పెట్టాలి" అంటూ దరఖాస్తును దాఖలుచేస్తే, దానిని శాసన సభలోకి తేగలరు. అప్పు డక్కడ చర్చలు జరుగగలవు. సెనేటులో మెజారిటీ సభ్యులు కోరితే ఈ విధంగానే జరుగుతుంది.

బిల్లులను ప్రతిపాదించే పద్ధతు లనేకమున్నాయి. కొన్ని బిల్లులను కమిటీలు, లేదా స్పెషల్ కమిటీలు రూపొందిస్తాయి. కొన్నింటిని ప్రెసిడెంటు సూచిస్తాడు. లేదా, ఇతర అధికారులు సూచిస్తారు. క్రొత్త అవసరాలను బట్టి గాని, పాత పద్ధతులకు

స్వస్తి చెప్పాలనిగాని అధికారులు సూచించడం జరుగుతూంటుంది. మరికొన్నింటిని ప్రజలు కాంగ్రెసు సభ్యులకు చెపుతారు. కాంగ్రెసు సభ్యులే స్వీయాభిప్రాయాలను బట్టి బిల్లులు ప్రతిపాదిస్తారు. కాని, ఎప్పుడు ఏ బిల్లు ప్రతిపాదించబడినా అది తగు ఉపసంఘానికి పంపబడుతుంది. దానిపై సాక్ష్యాలను సేకరించడం జరిగినప్పుడు, అనుకూలురను, ప్రతికూలురను కూడా పిలుస్తారు. ఒక్కొక్కప్పుడు ఈ సాక్ష్యాలు వారాల తరబడి, నెలల తరబడికూడా ఇవ్వబడుతూంటాయి.

కాంగ్రెసులో ఉపసంఘాల నియామకం పద్ధతివలన పనులు సమర్థంగాను, చాకచక్యంగాను జరుగుతున్నాయి. ఒక్కొక్క విషయంలో నిపుణులైన వారు బయలుదేరుతూండ గలరు. ఒక క్రొత్త కాంగ్రెసు సభ్యుడు కార్మిక సమస్యల సంఘం సభ్యుడుగా నియమించబడ్డా డనుకుందాం. కాని, అతడికి కార్మిక సమస్యలు సరిగా తెలియవు. నెలల తరబడి ఆ సంఘం కార్యకలాపాలను చూడడంవల్ల, కార్మిక వ్యవహారాల నిపుణులువచ్చి సాక్ష్యాలు యిస్తూండడం వలన, ఆ సభ్యుడు విశేష జ్ఞానాన్ని సంపాదిస్తాడు.

అనేకసార్లు ఉపసంఘం సమావేశాలలో పాల్గొన్న తరువాత అతడు కార్మిక సమస్యలలో అధిక జ్ఞానాన్ని పొంది, స్వయంగా అనుభవం పొందినవాడవుతాడు. అందువల్ల కార్మిక సమస్యలపై శాసనాలు చెయ్యడానికి, బిల్లులను పరిశీలించడానికి అతడు సర్వసమర్థుడై ఉంటాడు.

ఒక కమిటీకి పంపబడిన బిల్లు వెనక్కి వచ్చిన తరువాత, సభలోకూడా సభ్యులు దానినిగురించి చర్చిస్తారు. అనంతరమే వోటింగు జరుగుతుంది. ప్రతినిధుల సభాసభ్యులు చాలామంది ఉన్నారు కనుక, సాధారణంగా నిబంధనల కమిటీవారు చర్చలు జరగవలసిన గడువును నిర్ణయిస్తారు. అయితే, సెనేటులో అలాకాదు. సెనేటరు ఎంతసేపు కావాలన్నా మాట్లాడవచ్చు. ఒక బిల్లును ఆమోదించడానికి గాని, నిరాకరించడానికి గాని, "మూల పెట్టడానికి" గాని, వోటింగు జరుగుతుంది. లేదా, తిరిగి కమిటీకి పంపాలని వోటు చెయ్యవచ్చు. బిల్లును మూల పెట్టడమంటే పడగొట్టినట్లే అర్థం. ఒక శాసనసభలో ఆమోదించబడిన బిల్లు రెండవ శాసనసభకు పంపబడుతుంది.

రెండవ శాసనసభలోకూడా ఆ బిల్లుగురించి పైన తెల్పినవన్నీ జరుగుతాయి. దానిలో ఆమోదించబడవచ్చు; లేదా నిరాకరించబడవచ్చు. కాని, దానిని సవరణచేసి ఆమోదించి నట్లయితే, తిరిగి మొదటి సభకు పంపబడాలి. ఆ మార్పులకు అది సమ్మతించకపోతే, "కాన్ఫరెన్స్ కమిటీకి" పంపుతారు. కాన్ఫరెన్స్ కమిటీలో కాంగ్రెస్ ప్రతినిధులు, సెనేటర్లు సమానంగా ఉంటారు. దానిలో వివాదాలు పరిష్కారమైతే, అప్పుడా బిల్లు ఉభయ సభలకు పంపబడడం, అవి దాని నామోదించడం జరుగుతుంది.

ఉభయ శాసన సభలచేత ఆమోదించబడిన బిల్లు ప్రెసిడెంటుకు పంపబడుతుంది. రాజ్యాంగ చట్టంలో ఈ సందర్భంగా క్రింది విషయం ఉదాహరించ బడింది :

"ప్రతినిధుల సభలోను, సెనేటులోను ఆమోదించబడిన ప్రతి బిల్లు శాసనం కావడానికి పూర్వం యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంటుకు పంపబడాలి..."

ప్రెసిడెంటు ఆ బిల్లు నామోదిస్తూ సంతకం చెయ్యవచ్చు; లేదా వీటో అధికారాన్ని ప్రయోగించి దానిని త్రోసి వెయ్యవచ్చు. బిల్లు తనవద్దకు వచ్చిన పదిరోజులలోగా (ఆదివారాలు మినహాయించి) ప్రెసిడెంటు సంతకం చెయ్యకపోతే, ఆయన సంతకం లేకుండానే అది శాసన మవుతుంది. అయితే, ఈ పదిరోజులలోనే కాంగ్రెస్ సమావేశం వాయిదాపడిన దనుకుందాం. అప్పుడు పదిరోజుల గడువులో ప్రెసిడెంటు సంతకం చేస్తే తప్ప అది శాసనంకాదు. ఒక బిల్లు శాసనం కాకుండా చేసే ఈ పద్ధతిని "పోకెట్ వీటో" అంటారు.

ఒక బిల్లును ప్రెసిడెంటు వీటో చేసినప్పటికీ అది శాసనం కాగల పద్ధతికూడా ఉన్నది. తిరిగి, ఉభయ సభలలో అది మూడింట రెండువంతుల మెజారిటీ వోట్లతో ఆమోదించబడితే శాసనం కాగలదు.

ప్రతి కాంగ్రెస్ సమావేశంలో ప్రతిపాదించబడే వేల కొలది బిల్లులలో స్వల్పంగా మాత్రమే శాసనాలవుతుంటాయి.

### విచారణ జరపడానికి కాంగ్రెస్‌కు అధికారాలు

ఉభయ శాసన సభలకు విచారణ జరిపే అధికారమున్నది. అందుకై ఏదో ఒక కమిటీని ఉపయోగించగలవు.

లేదా, ఒక స్పెషల్ కమిటీని ఏర్పాటు చెయ్యగలవు. ఒక్కొక్కప్పుడు ఉభయ శాసన సభలు కలిసి "జాయింటు కమిటీని" ఏర్పాటు చెయ్యగలవు.

నూతన శాసనా లేవైనా చెయ్య నవసరమైన పరిస్థితు లేర్పడి నప్పుడో, కార్య నిర్వాహక శాఖవారు, న్యాయశాఖ వారు తమ విధిని ఏ విధంగా నిర్వర్తిస్తున్నారో పరిశీలించ దలచినప్పుడో, అవసరమైన సంస్కరణాలను గురించి ప్రజలకు శ్రద్ధ కలిగించాలని తోచినప్పుడో ఈ విచారణలు జరుగు తూంటాయి. ఒక్కొక్కప్పుడు కాంగ్రెస్ తన సభ్యులను కాక ఇతరులైన నిపుణులను, లేదా పౌరులను ఈ విచారణలలో సాక్ష్యాలకు పిలువగలదు. వీటివలన ప్రజల వాస్తవికావసరా లను కాంగ్రెసు తెలుసుకో గలదు.

ప్రతి కాంగ్రెసు సభ్యుడు అనేక విధులు నిర్వర్తించ వలసి వుంటుంది. అతడు సాధారణంగా తన రాజకీయపక్షం కార్యక్రమాన్ని అనుసరించడానికి ప్రయత్నిస్తాడు. ఎందుచేత నంటే, ఆ పార్టీలో చేరడంచేతనే ఎన్నుకోబడ్డాడు. అతడిని ఎన్నుకున్నవారు తమ జిల్లా శ్రేయస్సుకోసం, తమ రాష్ట్ర శ్రేయస్సుకోసం కృషి చేస్తాడని ఆశిస్తారు. తమ అధికారాన్ని అతడి ద్వారా వినియోగిస్తున్నా రన్నమాట. అతడు దేశాని కంతకు శాసనాన్ని చేసే అధికారంగల సంస్థలో సభ్యుడు కనుక, సమస్త దేశీయుల యోగక్షేమాలను, అవసరాలను మనస్సులో వుంచుకొని తన విధులను నిర్వర్తించాలి.

ప్రత్యేక వర్గాలకు చెందిన జనులు ఎప్పుడూ ఉంటూనే వుంటారు. వారు ఒకే ప్రయోజనాన్ని పొందాలనుకొంటూ, ఆ విధంగా చెయ్యవలసిందని తమ కాంగ్రెసు ప్రతినిధిని ఒత్తిడి చేస్తారు. ఈ కారణాలచేత కాంగ్రెసు సభ్యులు తమ విధిని నిర్వర్తించడం సులభమైన పనికాదు. తమజిల్లా, రాష్ట్రం ప్రయోజనాలకు, అదే సమయంలో సమస్త ప్రజల ప్రయోజనాలకు న్యాయం చెయ్యడానికి ప్రయత్నించడం బహు కష్టమైన పని.

# 8

# ప్రెసిడెంటు

రాజ్యాంగ చట్టంలోని రెండవసూత్రం ప్రకారం, కార్య నిర్వహణాధికారం ప్రెసిడెంటు కివ్వబడింది. వైస్ ప్రెసిడెంటుకు గాని, ప్రెసిడెంటు మంత్రులకు గాని, ఇతర అధికారులకు గాని ఇవ్వబడ లేదు.

రాజ్యాంగచట్టం ఆమోదించబడడానికి పూర్వం కొన్ని రాష్ట్రాలలో కార్య నిర్వహణాధికారం కౌన్సిళ్ళకు ఉండేది. ఒక్కొక్క కౌన్సిలులో కొందరు అధికారులుండేవారు. వారందరికీ సమానాధికారా లివ్వబడ్డాయి. ఈ పద్ధతినే అనుసరించవలసిందని రాజ్యాంగ పరిషత్తులో బెంజమిన్ ఫ్రాంక్లిన్ వాదించాడు. అనేక సంవత్సరాలనుంచి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు క్రింద స్విట్జర్లెండ్ పరిపాలించబడడం పరిషత్సభ్యులకు తెలుసు. బ్రిటిష్ రాజుకు ఉన్నట్లుగా ఒకే వ్యక్తికి మితి మీరీన అధికారాలుండడంలో ఎంత ప్రమాదం ఉన్నదో కూడా సభ్యులకు తెలుసు. అయినప్పటికీ, కార్య నిర్వహణాధికార మంతా అమెరికా ప్రెసిడెంటు వశం చెయ్యడానికి సభ్యులు నిర్ణయించారు.

ప్రెసిడెంటు ఎన్నుకోబడినట్లుగానే వైస్ ప్రెసిడెంటు ఎన్నుకోబడాలనీ, సెనేటుసభకు అధ్యక్షతవహించే అధికారం ఆయన కివ్వాలనీకూడా వారు నిర్ణయించారు. ప్రెసిడెంటును అధికారంనుంచి తొలగించినా, లేదా ఆయన మరణించడమో, రాజీనామా యివ్వడమో, పని చేయలేకపోవడమో జరిగినా, వైస్ ప్రెసిడెంటు ఆ పదవికి వస్తాడు. ఆ యిరువురుకూడా

మరణించడమో, పదవులనుంచి తప్పుకొనడమో జరిగితే, ఎవరు ప్రెసిడెంటు కావడమో కాంగ్రెసు నిర్ణయించడానికి తగు అధికారాన్ని రాజ్యాంగ చట్టం ఇస్తున్నది.

ప్రెసిడెంటుక్రింద అనేకమంది అధికారు లుంటారు. కార్యనిర్వాహక కార్యాలయాలుంటాయి. ఒక్కొక్క కార్యాలయానికి ఒక మంత్రి ఉంటాడు. ఇవి కాక, ఇంకా అనేక స్వతంత్ర కార్యాలయాలు కూడా ప్రెసిడెంటు ఆధిపత్యాన వుంటాయి. వీటన్నిటిద్వారా రాజ్యాంగ చట్టంలోని సూత్రాలను, కాంగ్రెసు చేసిన చట్టాలను ప్రెసిడెంటు అమలు జరిపి, ప్రజ లందరి క్షేమానికై ప్రభుత్వ కార్యకలాపాలను సాగిస్తాడు.

ప్రెసిడెంటు నివసించేది వాషింగ్టన్‌లోని వైట్ హౌస్‌లో. అక్కడే ఆయన కార్యాలయాలుంటాయి. అంటే, ఆయన ఇల్లు, ఆఫీసులు ఒకచోటనే నన్నమాట.

ప్రధాన రాజకీయ పక్షాలు ఎన్నికలకు పూర్వం మహాసభలను జరిపినప్పుడు, ప్రెసిడెంటు పదవికి తమ తమ అభ్యర్థులుగా ఎవరు పోటీ చెయ్యాలమో ఎన్నుకుంటాయి. ఎన్నికలు జరిగే సంవత్సరపు వేసవి ప్రారంభంలో ఇవి జరుగుతాయి. ప్రతి రాష్ట్రంనుంచి ఆ రాజకీయ పక్షాలవారు తమ తమ ప్రతినిధులను, మహాసభలు జరిగే నగరాలకు పంపుతారు.

రాజకీయ పక్షం మహాసభలో దాని ప్రతినిధులు, కమిటీలు మొదలైన సమస్యలపై తీర్మానాలు జరిగి, పార్టీ

ప్రణాళిక ఆమోదించబడ్డ తరువాత, ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు పదవులకు అభ్యర్థులను నామినేటు చెయ్యడానికి పూనుకుంటారు. సమావేశం అధ్యక్షుడు ఒక్కొక్క రాష్ట్రం పేరును పిలుస్తాడు. అప్పుడా రాష్ట్రం ప్రతినిధులు ప్రెసిడెంటు పదవికి ఎవరినైనా నామినేటు చెయ్యవచ్చు. ఇలాగ అన్ని రాష్ట్రాల విషయంలో జరిపిన తరువాత, ప్రతినిధులు వోట్లు వేస్తారు. మెజారిటీ వోట్లు ఎవనికివస్తే వానిని ప్రెసిడెంటు పదవికి అభ్యర్థిగా నిలబెట్టుతారు. ఆ తరువాత నవంబరులో జనరల్ ఎన్నికలలో అతడు పోటీ చేస్తాడు.

ఫిలడల్ఫియాలో సమావేశమైన రాజ్యాంగ పరిషత్తు వారు ప్రెసిడెంటును సూటిగా ప్రజలే ఎన్నుకోనడం మంచి పద్ధతికాదని భావించారు. అందుచేత "పరోక్షపద్ధతి" ద్వారా ప్రెసిడెంటు ఎన్నిక జరగాలని రాజ్యాంగ చట్టంలో సూత్రం చేశారు.

ఈ పరోక్షపద్ధతినే "ఎలక్టరల్ కాలేజ్" పద్ధతి అంటారు. నవబంరులో ప్రెసిడెంటు ఎన్నికల సందర్భంలో ఇది జరుగుంది. నవంబరు ఎన్నికల సమయాన ఒక్కొక్క రాష్ట్రంలో ఆయా రాజకీయ పక్షాలవారు "ప్రెసిడెంటును ఎన్నుకొనే ఎలక్టర్లు" అనే వారిని నామినేటు చేస్తారు. కాంగ్రెసులో ఆ రాష్ట్రానికి ఎంత మంది ప్రతినిధులు, సెనేటర్లు ఉంటారో సరిగా అంత మంది ఎలక్టర్లను నామినేటు చేయ్యాలి. అందుచేత, ఒక్కొక్క రాజకీయ పక్షం అంత మంది ఎలక్టర్లను మాత్రమే నామినేటు చేస్తుంది. ఇలాగ 48 రాష్ట్రాలలో రాజకీయ పక్షాలు తమ తమ

ఎలక్టర్లను నామినేటు చేసిన తరువాత ప్రజలు ఆ యా పార్టీల తరుఫున పోటీచేస్తున్న ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటులకు వోట్లు వేస్తారు.

ఒక రాష్ట్రం ప్రజలలో అధిక సంఖ్యాకులు ఒక పార్టీ ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటులకు వోట్లు వేశారనుకుందాం. అప్పుడు ఆ పార్టీ నామినేటుచేసిన ఎలక్టర్లందరూ ఎన్నిక అయినట్లు నిర్ధారణ చేస్తారు. వారు సహజంగా తమ పార్టీ తరఫున ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు పదవులకు పోటీ చేస్తున్న వారికి వోట్లు వేస్తారన్నమాట. ప్రతి రాష్ట్రంలోను ఈ పద్ధతిగా ఎన్నిక అయినట్లు భావించబడే ఎలక్టర్లందరను కలిపి "ఎలక్టరల్ కాలేజ్" అంటారు. నిజానికి వారందరు ఒకచోట సమావేశంకారు. ఎందుకంటే, ఏ రాష్ట్రంలోని ఎలక్టర్లు ఆ రాష్ట్రంలోనే ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటును ఎన్నుకోవాలని రాజ్యాంగ చట్టంలోని పన్నెండవ సవరణలో తెల్పబడింది. ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటుల ఎన్నికకు వోట్లు వెయ్యడం తప్ప ఈ ఎలక్టర్లు మరెందుకూ కాదు.

నవంబరు ఎన్నికలలో గెల్చిన ప్రెసిడెంటు ఆ తరువాత వచ్చే జనవరి 20 వ తేదీన అధికారాన్ని స్వీకరిస్తాడు. ఆయన అమెరికా చీఫ్ జస్టిస్ సమక్షంలో ప్రమాణం స్వీకరించడం సాంప్రదాయమైంది.

### ప్రెసిడెంటు స్వీకరించే ప్రమాణం

**"అమెరికా ప్రెసిడెంటు పదవిని త్రికరణ శుద్ధిగా నిర్వహిస్తాననీ, శక్తివంచన లేకుండా అమెరికా రాజ్యాంగ చట్టాన్ని**

కాపాడుతూ, దానిని నిలబెట్టగలననీ మనస్ఫూర్తిగా ప్రమాణం చేస్తున్నాను.”

ప్రమాణ స్వీకరణచేసిన పిమ్మట సాధారణంగా ప్రెసిడెంటు ప్రారంభోపన్యాసం చేస్తాడు. అది దేశమంతటా బ్రాడ్ కాస్ట్ చేయబడుతుంది. తన ప్రెసిడెంటు గిరిలో ఎట్టి విధానం అనుసరించబడగలదో ప్రెసిడెంటు విశదపరుస్తాడు.

## ప్రెసిడెంటు అధికారాలు

అమెరికా జాతీయ ప్రభుత్వ నిర్వహణాధికారాన్ని ప్రెసిడెంటుకు యివ్వాలని రాజ్యాంగ చట్టంలో తెల్పబడింది. ఇతర ప్రభుత్వ నిర్వహణాధికారులందరు ఆయనకు బాధ్యులు. ఆయన ఉత్తరువుల ననుసరించి వారు తమ విధ్యుక్త ధర్మాలను నిర్వహించాలి.

ప్రపంచంలో అతి ముఖ్యము, శక్తిమంతము అయిన పదవులలో అమెరికా ప్రెసిడెంటు పదవి ఒకటి. “శాసనాలు అక్షరాలా అమలు జరుపబడేటట్లు జాగ్రత్తవహించడం” ఆయనప్రథమకర్తవ్యం. జాతీయ ప్రభుత్వాన్ని కొనసాగించగల ఒక మహాసంస్థను ఆయన నిర్వహించాలి. అందుకై ఆయనకు ప్రభుత్వ కార్య నిర్వహణశాఖను నడిపే అధికారం మాత్రమే కాక, శాసనసభకు, న్యాయశాఖకు సంబంధించిన ముఖ్యాధికారాలుకూడా యివ్వబడ్డాయి.

కాంగ్రెసులో ఆమోదించబడిన ఏ బిల్లునైనాసరే ఆయన వీటో చెయ్యగల అధికారమున్నది. కాంగ్రెసువారు ఆ వీటోను త్రోసివేసి, మూడింట రెండువంతుల మెజారిటీతో

దానిని తిరిగి ఆమోదిస్తే తప్ప అది శాసనం కాజాలదు. తను ముఖ్యమని భావించిన ఏ జాతీయ సమస్యనైనాసరే కాంగ్రెసు సభ్యులు యోచించి, చర్య తీసుకోవాలనుకుంటే, ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరగాలని ఆయన ఆదేశించగలడు. తద్విధంగా వారు చర్య తీసుకొనేట్లు తన పలుకుబడిని ఉపయోగించవచ్చు. ప్రజలకు అవసరమని తను నమ్మిన శాసనాలు చెయ్యవలసిందని కాంగ్రెసుకు వార్షిక, ప్రత్యేక సందేశాలద్వారా ఆయన సిఫారసు చెయ్యవచ్చు. బహిరంగ సభలలో ఉపన్యసించడం ద్వారాకూడా ఆయన కాంగ్రెసుకు సలహాలివ్వవచ్చు. ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రభుత్వాధికారి ఆయనే గనుక (వైస్ ప్రెసిడెంటు తప్ప), మొత్తం దేశక్షేమానికి అవసరమగు కార్యక్రమాన్ని అనుసరించే బాధ్యత ఆయనదే. తన రాజకీయపక్షం నాయకుడు కూడా ఆయనే గనుక, ఆ కార్యక్రమాన్ని బలపరచ వలసిందని కాంగ్రెసులోని తన పార్టీ సభ్యులను గట్టిగాకోరవచ్చు.

**న్యాయ, కార్య నిర్వహణాధి కారాలు**: ఫెడరల్ జడ్జీల పదవులలో కాళీలు వచ్చినప్పుడు ప్రెసిడెంటు కొత్తవారిని నియమిస్తాడు. అదే విధంగా సుప్రీంకోర్టు జడ్జీల పదవులు కాళీ అయినప్పుడు కొత్తవారిని నియమించ గలడు. అయితే, ఆయన చేసిన నియామకాలను సెనేటు సభవారు ఆమోదించాలి.

కాంగ్రెసులో నేరారోపణ చెయ్యబడినవారిని తప్ప, ఫెడరల్ చట్టాలను ఉల్లంఘించినందుకు శిక్షించబడినవారిని

క్షమించి విడిపించడానికి, లేదా శిక్షను తగ్గించడానికి ఆయన కధికారం కలదు. ఒక నేరస్థుని జెయిలు శిక్షను తగ్గించవచ్చు; లేదా జరిమానాను తగ్గించవచ్చు. మరణదండనను కొంత కాలం ఆపుచెయ్యవచ్చు.

ప్రెసిడెంటుకు గల అధికారాలు ఇక్కడ ఉదాహరించడం సాధ్యం కానన్ని ఉన్నాయి.

రాజ్యాంగ చట్టాన్ని, కాంగ్రెసు చేసిన శాసనాలను ప్రెసిడెంటు అమలుజరుపుతాడు. అందుకై ఆయన అనేక నియమాలను, నిబంధనలను, ఉత్తరువులను చెయ్యవలసి వుంటుంది. వాటిని ఎగ్జిక్యూటివ్ ఆర్డర్స్ అంటారు.

అమెరికా సైనిక, నౌకాదళాలకు ఆయన సర్వ సైన్యాధ్యక్షుడు. రాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన సాయుధబలాలు చర్య తీసుకోవలసి వచ్చినప్పుడు వాటికికూడా ఆయనే సర్వ సైన్యాధ్యక్షుడు. ఈ సూత్రంవలన యుద్ధకాలంలో గాని, యుద్ధప్రమాదం ఏర్పడిన కాలంలోగాని ప్రెసిడెంటుకు పెద్ద అధికారం లభిస్తుంది.

**విదేశ వ్యవహారాలలో అధికారాలు :** విదేశాలతో అమెరికాకు సంబంధ బాంధవ్యాలేర్పడే బాధ్యత ప్రెసిడెంటుది. విదేశాలలో రాయబారులను, ప్రతినిధులను, కాన్సల్‌లను నియమించే అధికారం ఆయనదే. అయితే, ఆయన నియమించినవారిని సెనేటు ఆమోదించాలి. ఇతర దేశాలు అమెరికాలో రాయబారులను, ప్రతినిధులను నియమించుకో డానికి అనుమతి యిచ్చే అధికారం ఆయనకున్నది. తన

విదేశాంగమంత్రి ద్వారా ఆయన విదేశాలతో వ్యవహారాలు జరుపుతాడు. విదేశాలకు వెళ్ళిన అమెరికనులకు, అమెరికాకు వచ్చిన విదేశీయులకు విదేశాంగ కార్యాలయం ద్వారా ఆయన రక్షణ ఏర్పాట్లుచేస్తాడు. ఒక నూతనరాజ్యాన్ని గుర్తించడానికైనా, గుర్తించక పోడానికైనా ఆయన కధికారమున్నది. ఇతర ప్రభుత్వాలతో ఆయన ఒడంబడికలు చేసుకోగలడు. సెనేటుకు హాజరైన మూడింట రెండువంతుల సెనేటర్లు ఆమోదిస్తే వాటికి అమెరికా కట్టుబడివుండాలి. ఇవికాక, విదేశ ప్రభుత్వాలతో ఆయన "ఎగ్జిక్యూటివ్ అగ్రిమెంటు" చేసుకోవచ్చు (ప్రభుత్వ కార్యకలాపాలు సాగించడానికి అవసరమైన ఒప్పందాలు) వాటికి సెనేటు ఆమోదం అవసరంలేదు.

ప్రపంచంలో ఏ భాగానికైనా సరే ఆయన అమెరికా సైనిక, నౌకాదళాలను పంపగల అధికారముున్నది.

**అధికారులను నియమించే అధికారాలు :** కార్యనిర్వాహక కార్యాలయాల ప్రధానాధికారులుగా ప్రెసిడెంటు తన యిష్టం వచ్చినవారిని నియమించగలడు. వారు అమెరికా ప్రభుత్వ వ్యవహారాల్లో ప్రధానమైన వాటికి బాధ్యులై ఉంటారు. ఇంకా అనేక ఫెడరల్ ఉద్యోగస్థులను ప్రెసిడెంటు నియమించగలడు.

అయితే, ప్రభుత్వ కార్యాలయాలలోని వేలకొలది ఉద్యోగులను సివిల్ సర్వీస్ పద్ధతిద్వారా నియమిస్తారని గుర్తుంచుకోవాలి. ఆ యా ఉద్యోగాలకు సంబంధించిన పరీక్షలు ప్యాసయిన వారే ఈ పద్ధతిద్వారా నియమించబడుతూంటారు.

## ప్రెసిడెంటు

పదవీ కాల పరిమితి  4 సంవత్సరాలు.

జీతం ... సాలుకు 1,00,000 డాలర్లు; అలవెన్సులు.

ఎన్నిక ... ప్రతి నాలుగవ సంవత్సరం నవంబరులో.

పదవీ స్వీకారం... ఎన్నిక అనంతరం జనవరి 20వ తేదీన.

ఎన్నుకొనేవారు... ఎలక్టరల్ కాలేజి పద్ధతిగా ఎన్నుకొనే ప్రజలు.

యోగ్యతలు ... అమెరికాలో జన్మించిన పౌరుడై, కనీసం 35 సంవత్సరాలు వయస్సు కలిగి, కనీసం 14 సంవత్సరాలు అమెరికాలో నివసించివుండాలి.

### ప్రెసిడెంటు క్రింది అధికారులు

1. వైస్ ప్రెసిడెంటు
2. ప్రతినిధుల సభ స్పీకరు
3. సెనేటుకు తాత్కాలికపు ప్రెసిడెంటు
4. విదేశాంగ మంత్రి
5. కోశాంగ మంత్రి
6. రక్షణ మంత్రి
7. అటార్నీ జనరల్
8. పోష్టుమాష్టర్ జనరల్
9. దేశీయ మంత్రి
10. వ్యవసాయ మంత్రి
11. వాణిజ్య మంత్రి
12. కార్మిక మంత్రి

ప్రధాన అధికారం, విధి :  రాజ్యాంగ చట్టాన్ని, కాంగ్రెసు చేసిన శాసనాలను, ఒడంబడికలను అమలుపరచడం.

## ఇతర అధికారాలు

1. బిల్లులను వీటో చెయ్యడం.
2. కాంగ్రెసు చెయ్యవలసిన బిల్లులనుగురించి సిఫారసు చెయ్యడం.
3. ప్రత్యేక కాంగ్రెసు సమావేశాలు జరింపించడం.
4. కాంగ్రెసుకు సందేశాలివ్వడం.
5. ఫెడరల్ జడ్జీలను నియమించడం.
6. విదేశాలలో అమెరికా ప్రతినిధులను నియమించడం.
7. ప్రభుత్వ కార్యాలయాల ప్రధానాధికారులను, ఇతర ముఖ్యమైన ఉద్యోగస్థులను నియమించడం.
8. నేరస్థులను క్షమించడం.
9. విదేశాలతో ప్రభుత్వ వ్యవహారాలను జరపడం.
10. సాయుధబలాల సర్వసైన్యాధ్యక్షుడుగా ఉండడం.

# 9
# ప్రభుత్వ కార్యాలయాలు

కేంద్ర ప్రభుత్వ చట్టాలను ప్రెసిడెంటు అమలుజరిపి, ప్రభుత్వ కార్యకలాపాలను కొనసాగించగలిగే నిమిత్తం కాంగ్రెసు సభవారు కార్యనిర్వాహక కార్యాలయాలను నెలకొల్పుతూ వచ్చారు. ఈ కార్యాలయాల అధిపతులను ప్రెసిడెంటు నియమించాలనీ, సెనేటుసభవారు ఆమోదిస్తేగాని ఆ నియామకాలు చెల్లవనీ నిబంధనచేశారు. ఈ అధిపతులు ఒక కౌన్సిలుగా ఉండి, "ప్రెసిడెంటుకు మంత్రులుగా" వ్యవహరిస్తారు.

జార్జి వాంషింగ్టన్ మొట్టమొదటి ప్రెసిడెంటుగా ఎన్నుకోబడినప్పుడు నలుగురు మంత్రులను మాత్రమే నియమించాడు. ప్రభుత్వ కార్యకలాపాలు పెరిగినకొలది క్రొత్త కార్యాలయాల స్థాపనకు కాంగ్రెసు అనుమతించింది. 1948 లో అటువంటి కార్యాలయాలు తొమ్మిది ఉన్నాయి. వాటి వివరాలు యివి:

| కార్యాలయం | కార్యాలయాధిపతి | అవి నెలకొల్పబడిన సంవత్సరం |
|---|---|---|
| 1. విదేశ వ్యవహారాలు | విదేశ మంత్రి | 1789 |
| 2. ఖజానా ,, | ఖజానా మంత్రి | 1789 |
| 3. రక్షణ ,, | రక్షణ మంత్రి | * 1947 |
| 4. న్యాయ ,, | అటార్నీ జనరల్ | 1789 |
| 5. పోస్టాఫీసు ,, | పోస్టుమాస్టర్ జనరల్ | 1794 |
| 6. దేశీయ ,, | దేశీయ మంత్రి | 1849 |
| 7. వ్యవసాయ ,, | వ్యవసాయ మంత్రి | 1889 |
| 8. వాణిజ్య ,, | వాణిజ్య మంత్రి | † 1903 |
| 9. కార్మిక ,, | కార్మిక మంత్రి | 1913 |

* 1947 జులైలో 80 వ కాంగ్రెసు సభవారు 253 వ చట్టం ద్వారా యుద్ధ కార్యాలయాన్ని, నౌకా కార్యాలయాన్ని విలీనం చేసి

# మంత్రివర్గం

మంత్రివర్గమంటే ప్రెసిడెంటుకు సలహాదారుల సంఘమన్న మాట. ఒక్కొక్క మంత్రి ఒక్కొక్క కార్యాలయానికి అధిపతి. మంత్రులను ప్రెసిడెంటు నియమిస్తాడు. అందుచేత, వారు ఆయనకు బాధ్యులు. ప్రెసిడెంటును నియమించినవారు ప్రజలు గనుక, మంత్రులను నియమించడంలో ఆయన ప్రజలకు బాధ్యుడు. ప్రెసిడెంటుకు ఇష్టమైనంతకాలం మాత్రమే వారు మంత్రి పదవులలో ఉంటారు. ఆయన ఎప్పుడు కావాలంటే అప్పుడు వారందరినీ సమావేశపరచవచ్చు. లేదా, ఒక్కొక్కరినే సంప్రతించవచ్చు. మంత్రివర్గ సమావేశాలు రహస్యంగా జరుగుతాయి.

ప్రెసిడెంటుకు ఎందరు మంత్రులుండాలనే విషయమై రాజ్యాంగ చట్టంలో ఎట్టి నిబంధనలు లేవు. ఏ కార్యాలయాలను నెలకొల్పడమో, అవి ఏ విధులను నిర్వర్తించాలో గురించి కూడా రాజ్యాంగ చట్టంలో ఉదాహరించబడలేదు. ప్రభుత్వం సాగడానికి మంత్రివర్గం ఉండితీరాలని ఈనాడందరూ అంగీకరించినదే మంత్రులకు ఫలానా యోగ్యత లుండాలని చట్టం చెయ్యబడలేదు.

జాతీయ సైనిక కార్యాలయాన్ని నెలకొల్పారు. ఈ కార్యాలయం అధిపతి రక్షణ మంత్రి. సైనిక, నౌకా, వైమానిక దళాలు, ఇతర జాతీయ భద్రతా కార్యాలయాలు ఈ మంత్రి క్రింద ఉండగలవు.

† వాణిజ్య, కార్మిక వ్యవహారాలకు 1903 లో ఒకే కార్యాలయం ఏర్పాటు చెయ్యబడింది. 1913 లో వాటికి వేర్వేరు కార్యాలయాలను స్థాపించారు.

ప్రతి మంత్రి తన కార్యాలయాన్ని సాగించగల అధికారాన్ని ప్రెసిడెంటునుంచి పొందుతాడు. ఫెడరల్ ప్రభుత్వాధికారిగా మంత్రి నిర్వహించే విధులు దేశానికంతకు సంబంధించినవై ఉంటాయి. ఆయనకు అనేకమంది అసిస్టెంట్లు, సలహాదారులు ఉంటారు. ప్రతి మంత్రి కార్యాలయంలో అనేక డివిజనులు, బ్యూరోలు, ఆఫీసులు, సర్వీసులు ఉంటాయి. వాటి ద్వారా వేర్వేరువ్యవహారాలు నిర్వహించబడుతాయి. వేర్వేరు కార్యాలయాలు వేర్వేరు విధులను నిర్వహిస్తాయి గనుక, మంత్రుల కార్యాలయాలనుగురించి విడివిడిగా చెప్పడం అవసరం.

## విదేశ కార్యాలయం

ప్రెసిడెంటుకు, వైస్ ప్రెసిడెంటుకు తరువాత పెద్ద అధికారి విదేశమంత్రి. విదేశవిధానానికి సంబంధించిన వ్యవహారాలలో ఆయన ప్రెసిడెంటుకు సలహాదారు.

మొత్తం మీద విదేశ కార్యాలయం విధులు ఇవి :

అమెరికాకు, ఇతర దేశాలకు మధ్య మిత్రత్వ సంబంధాలను కాపాడడం.

విదేశాలతో వాణిజ్యాన్ని పెంపొందించడం.

విదేశాలలోని అమెరికన్ పౌరులను, వారి ఆస్తి పాస్తులను కాపాడడం.

విదేశాలలోని అమెరికన్ రాయబారుల, ప్రతినిధుల, కాన్సల్ ఉద్యోగుల విధులను పరిశీలించడం. ఈ ఉద్యోగులద్వారా విదేశ కార్యాలయం ఆ యా దేశా

లతో సంబంధాలను కలిగివుండి, విదేశాలలో అమెరిక నులను, అమెరికా ప్రయోజనాలను కాపాడుతుంది.

విదేశాలతో అమెరికా ఒడంబడికలు చేసుకో డానికి, వాటిని అమలుపరచడానికి సహాయపడడం.

విదేశాలకు వెళ్ళదలచిన అమెరికనులకు ప్యాసు పోర్టు లివ్వడం.

విదేశాల రాయబారులు మొదలైనవారికి ప్రెసిడెంటు స్వాగత మివ్వడానికి ఏర్పాట్లు చెయ్యడం.

క్రొత్తగా ఏర్పడిన విదేశ ప్రభుత్వాన్ని అమెరికా గుర్తించడమో, మానడమో నిశ్చయించుకోడానికి సహాయపడడం.

విదేశాల ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను గురించి సమాచారాలను సేకరించడం.

అమెరికాకు వలసదారులుగానో, మరొకందుకో రాదలచిన వారి దరఖాస్తులను ఆ యా దేశాలలోని కాన్సల్ ఆఫీసర్లు పరిశీలిస్తారు. వారు అమెరికాకు రావచ్చునని తోచినట్లయితే కాన్సల్ ఆఫీసర్లు ప్యాసుపోర్టులు ఇస్తారు.

ఇవి కాక, ఫెడరల్ చట్టాలను, ఒడంబడికల పాఠాలను, మరికొన్ని ఇతర పత్రాలను బహిరంగంగా ప్రకటించవలసిన పూచీకూడా విదేశాంగ మంత్రిదే.

## ఖజానా కార్యాలయం

ఖజానా కార్యాలయం ప్రధాన విధు లివి:

అమెరికా ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాలను చక్కబెట్టడం.

ప్రభుత్వాదాయాన్ని కాపాడుతూ, దానిని వృద్ధి చెయ్యడానికి ప్లాను వెయ్యడం.

అమెరికా కరెన్సీ విలువను కాపాడుతూ, ఫెడరల్ ప్రభుత్వానికి ధనలోపం కలగకుండా చూడడం.

ఈ పనులు చెయ్యడానికై ఖజానా కార్యాలయం నిర్వర్తించవలసిన విధులు అనేక మున్నాయి. వాటిలో కొన్ని యివి:

ప్రభుత్వం తరఫున పన్నులను వసూలు చెయ్యడం.

అమెరికా రక్షణచర్యలకు, దేశీయ ప్రణాళికలకు, విదేశాలకై సహాయానికి అవసరమైనప్పుడు బాండులు మొదలైనవి విడుదలచేసి అప్పుచేయడం. (వడ్డీయిచ్చే పద్ధతిని నోట్లు, బాండులు విడుదల చెయ్యబడుతాయి. అవి ముఖ్యంగా అమెరికన్ పౌరులకు, సంస్థలకు అమ్మబడుతాయి.)

శాసనాల ననుసరించి, ప్రభుత్వం చెల్లించవలసిన ఋణాలకు, ఖర్చులకు ధన మివ్వడం.

ప్రభుత్వపు ఆర్థిక పరిస్థితిగురించి కాంగ్రెసుకు, ప్రెసిడెంటుకు నివేదించడం.

నాణేలను, కరెన్సీ నోట్లను, బాండులను, పోస్టేజి స్టాంపులను తయారు చేయించడం.

దేశంలోకి దొంగతనంగా సరకులు దిగుమతి కాకుండా తీరాలను కాపలా కాయడం; నౌకల ద్వారా ఎగుమతులను కాపాడడం.

ప్రభుత్వానికి చెందిన ఆస్తిపాస్తులను సమీక్షించడం, పంపిణీ చెయ్యడం.

వివిధ రాష్ట్రాల మధ్యను, విదేశాలతోను మత్తు పానీయాల అమ్మకం, నిషాకలిగించే పదార్థాల అమ్మకం క్రమబద్ధంగా జరిగేటట్లు చెయ్యడం.

రహస్య సిబ్బందిని అట్టే పెట్టడం.

## రక్షణ కార్యాలయం

ఇది జాతీయభద్రతకు బాధ్యతవహించే కార్యాలయం. క్రొత్తగా ఏర్పాటుచెయ్యబడింది. ఇదివరలో వేర్వేరుగా ఉన్న సైనిక, నౌకా కార్యాలయాలు ఇప్పుడు దీనిలో అంతర్భాగాలు. క్రొత్తగా ఏర్పాటుచెయ్యబడిన వైమానిక కార్యాలయం కూడా దీనిలోనిదే. దేశీయ రక్షణకు సంబంధించిన ఏ వ్యవహారమైనా సరే ఈ కార్యాలయానికి సంబంధించి ఉంటుంది. రక్షణ కార్యాలయం విధులనుగురించి 253 వ చట్టంలో క్రింద విధంగా స్పష్టంచెయ్యబడింది :

" ...అమెరికా భావిభద్రతకై సమగ్ర కార్యక్రమాన్ని రూపొందించడం; జాతీయ భద్రతకై ప్రభుత్వ కార్యాలయాలు మొదలైనవి తీసుకోగల చర్యలకు

సమన్వయంగల రీతిగా విధానాలను తయారుచెయ్యడం; సైనిక, నౌకా, వైమానిక దళాల వ్యవహారాలను చూచే మూడు కార్యాలయాలను ఏర్పరచడం (నౌకా దళానికి చెందిన విమానాలుకూడా నౌకాకార్యాలయం అజమాయిషీలోనివి); ఆ మూడు దళాలను విలీనం చెయ్యకుండా, అవి ఒకే నాయకత్వాన పరస్పర సహకారంతో చర్యలు తీసుకొనేటట్లు చెయ్యడం; సాయుధబలాలన్నీ ఫలప్రదంగా చర్యలు తీసుకొనేటట్లు చెయ్యడం'

## సైనిక కార్యాలయం

ఇది రక్షణ కార్యాలయానికి చెందినది. దీని ముఖ్యమైన విధి అమెరికా రక్షణ నిమిత్తం, అమెరికాకు చెందిన ఇతర ప్రాంతాల రక్షణ నిమిత్తం పదాతి సైన్యాలను సమకూర్చడం, పదాతి సైనికులకు శిక్షణ యివ్వడం, వారికి ఆయుధాల నివ్వడం. అమెరికాను కాపాడడానికి సిద్ధంగా శాంతికాలంలో కూడా పదాతి సైన్యాన్ని పోషిస్తుంది. యుద్ధకాలంలో చటుక్కున పదాతి సైన్యాలలో చేర్చడానికి వీలుగా రిజర్వు దళాలను, నేషనల్ గార్డులు మొదలైన వారిని కూడా ఈ శాఖవారు పోషిస్తారు. పదాతి సైన్యాలకు ఉత్తమ శిక్షణ యివ్వడం, ఉత్తమ ఆయుధాలను సమకూర్చడం, సాంకేతిక నైపుణ్యాన్ని కలిగించడం మొదలైనవి ఈ శాఖ విధులు. సైనికులకు శిక్షణ యిచ్చే వెస్ట్‌పాంయిట్‌లోని మిలిటరీ అకాడమీ (న్యూయార్క్), కన్సాస్‌లోని ఫోర్ట్ లీవెన్‌వర్త్‌లోఉన్న

జనరల్ స్టాఫ్ కాలేజి, ఇంకా ఇతర సైనిక శిక్షణాలయాలు ఈ శాఖవారి యాజమాన్యంలో ఉన్నాయి. యుద్ధకాలంలో అమెరికన్ సైన్యాలు ఏ విదేశాన్నయినా జయించినా, లేదా అది శరణాగతి చెందినా దాని నాక్రమించడం, అక్కడ పరిపాలన సాగించడం సైనికశాఖవారి పూచీ. అయితే, అమెరికా ప్రెసిడెంటు ఉత్తరువు చేస్తేనే సైనిక శాఖవారు ఆ విధంగా చర్యలు తీసుకోవాలి. రక్షణశాఖా మంత్రి విధానాలను అనుసరించి సైనిక శాఖవారు నౌకా, వైమానిక శాఖలతో సహకారంగా చర్యలు తీసుకోవాలి.

నదులను, హార్బరులను వృద్ధిచేసే పనులను పర్యవేక్షించడం, అమెరికా, అలాస్కా, హవాయి, పోర్టోరికోలలో నదీజలాల ఉపయోగాన్ని క్రమబద్ధం చెయ్యడం, వరదల నివారణకై తీసుకోబడే పనులతో సహకరించడం, ప్రజలలో కల్లోలాలు చెలరేగితే అణచడం, పనామా కాలువలో రాకపోకలను పరిశీలించడం—ఇవన్నీకూడా సైనిక శాఖవారికి చెందినవే.

## యుద్ధనౌకా కార్యాలయం

ఈ శాఖ నేర్పాటు చెయ్యడంలో ముఖ్యమైన ఉద్దేశం అమెరికా రక్షణకు యుద్ధ నౌకాదళాన్ని పోషించడం. సర్వ నౌకాదళాధ్యక్షుడైన ప్రెసిడెంటు ఏక్షణంలో ఉత్తరువిస్తే ఆక్షణంలో చర్యలు తీసుకోడానికి నౌకాదళం ఎల్లప్పుడు సర్వ సంసిద్ధంగా ఉండాలి. అమెరికాకు చెందిన ఇతర

ప్రాంతాల రక్షణ బాధ్యత, అమెరికా వాణిజ్య నౌకల రక్షణ బాధ్యతకూడా యుద్ధనౌకాశాఖ వారిదే.

తన విధులు నిర్వర్తించడానికై నౌకాశాఖ ఈక్రింది పనులు చేస్తుంది :

నౌకా సైనికులకు శిక్షణ యివ్వడం, వారిని పోషించడం, యుద్ధ నౌకలను, నౌకా శ్రయాలను నిర్మించడం.

మేరీల్యాండ్‌లోని అన్నాపోలీస్‌లో నౌకా సైనిక శిక్షణాలయాన్ని నడపడం, న్యూపోర్టులోని (రోడ్ దీవి) నావల్ వార్ కాలేజిని నడపడం, ఇతర నౌకాసైనిక శిక్షణాలయాలను పోషించడం, సైనికులకు, నౌకలకు సుశిక్షణ కలిగే నిమిత్తం విన్యాసాలను ఏర్పాటు చెయ్యడం.

నేలమీాదనైనా సరే, సముద్రంమీాదనైనా సరే చర్యలు తీసుకోగల నౌకాదళపు సైనికులను సదా సిద్ధంగా వుంచడం.

సముద్రంలోని నౌకలకు, నౌకాశ్రయాలకు ఎప్పటి కప్పుడు వర్తమానాలు తెలవడానికి రేడియో కేంద్రాలను పోషించడం; నౌకలకు, విమానాలకు ఉపకరించగల మ్యాప్‌లను సప్లయి చెయ్యడం; యుద్ధ నౌకలకు ఉపకరించే ఆయుధాల నిర్మాణానికై పరిశోధనాలయాలను సాగించడం.

దేశానికంతకు ఉపకరించేలాగ ప్రైమును చెప్పే అబ్జర్వేటరీని నడపడం ; నౌకలలోను, విమానాల లోను దారులుచూపే యంత్రాలను తణిఖీ చెయ్యడం.

యుద్ధ విమాన కార్యాలయం

యుద్ధ విమానాలను నడిపే వైమానికులను, ఇతర పనివారలను సేకరించి, వారికి శిక్షణగరిపి, ఆయుధాలను సమకూర్చడం ఈ కార్యాలయం విధి. అమెరికామీద విమానదాడులు జరగకుండా జాగ్రత్తలు వహించడం ముఖ్యంగా విమాన కార్యాలయం బాధ్యత. అమెరికాకు అజేయమైన విమాన బలాన్ని కలిగించి, శత్రు విమాన దళాలను జయించి, కీలక ప్రాంతాలను కంట్రోలుచేసి తద్విధంగా దేశరక్షణకు ఇది తోడ్పడాలి. యుద్ధంలో విమాన దళాలను వినియోగించే పూచీ ఈ కార్యాలయానిదే.

పదాతిసైనికులను ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి విమానాలలో కొనిపోవడం, పదాతిసైనికుల చర్యలకు తోడ్పడడం, శత్రు స్థావరాలను ఫోటోలు తీయడం, పర్యాలోకనలు జరపడం, శత్రుసైన్యాలమీద, మార్గాల మీద దాడులు జరపడం, తక్షణ సహాయాన్ని అందజెయ్యడం, శత్రు నౌకలను, సబ్ మెరీన్‌లను విధ్వంసం చెయ్యడం, మందుగుండు గనులను నాటడం మొదలైన యుద్ధ చర్యలను విమాన కార్యాలయం జరుపుతుంది.

వైమానికులకు, విమాన దళాల సిబ్బందికి శిక్షణ యివ్వడానికి ఈ కార్యాలయం అధ్వార్యానగల ॥క

యివి : ఎయిర్ యూనివర్సిటీ; ఎయిర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ; స్కూల్ ఆఫ్ ఏవియేషన్ మెడిసిన్.

## న్యాయ కార్యాలయం

న్యాయ కార్యాలయానికి అధిపతి అటార్నీ జనరల్. అందుచేత, జాతీయ ప్రభుత్వానికి న్యాయ వ్యవహారాలలో సలహాలిచ్చే ప్రధానాధికారి ఆయనే. మొత్తంమీద న్యాయ వ్యవహారాలలో ఆయన అమెరికాకు ప్రతినిధి. ప్రెసిడెంటు గాని, ఇతర కార్యాలయాధిపతులుగాని కోరినప్పుడు ఆయన సలహాలు యిచ్చి, తన అభిప్రాయాలను తెల్పుతాడు. తరచుగా, నూతన శాసనాలను చేసేటప్పుడు, ముఖ్యంగా నూతన విషమ సమస్యలను ఎదుర్కొనే టప్పుడు ఆయన సలహాలను అడుగుతారు.

అటార్నీ జనరల్‌కు సొలిసిటర్ జనరల్ సహాయ పడుతాడు. అటార్నీ జనరల్ ఉత్తరువులను సొలిసిటర్ జనరల్ పాటించాలి. అమెరికా సుప్రీంకోర్టులో ఆయన ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహిస్తాడు. ప్రభుత్వానికి సంబంధించిన అప్పీళ్ళు ఆయన పర్యవేక్షణ క్రింద జరుగుతాయి. ఆయన అనుమతి లేనిదే ప్రభుత్వం తరఫున ఏ కోర్టుకు అప్పీళ్లు చెయ్యరాదు.

ఫెడరల్ పరిశోధక సంస్థ ఆయన కార్యాలయంలోని ఒకభాగం. ఫెడరల్ ప్రభుత్వ చట్టాలను అతిక్రమించిన నేరస్తులను పట్టుకొనడం, దర్యాప్తులు జరపడం, వారిని అరెస్టులు చెయ్యడం ఈ సంస్థ విధులు.

న్యాయ కార్యాలయం ప్రధానంగా నిర్వర్తించ వలసిన విధులివి :

ఫెడరల్ చట్టాలు ఫలప్రదంగా అమలుజరిగేటట్లు చూడడం.

అమెరికా లీగల్ హక్కులను కాపాడడం.

న్యాయచట్టాలను అమలుజరిపే కార్యాలయాలతో సహకరించడం.

ఈ పనుల నిర్వహణకు న్యాయకార్యాలయం తీసుకొనే చర్యలు యివి :

అమెరికా సుప్రీంకోర్టులలోను, ఫెడరల్ కోర్టుల లోను ప్రభుత్వం తరఫున కేసులలో వాదించడం.

అమెరికా జిల్లాలలోని అటార్నీల చర్యలను, ఇతర ప్రభుత్వ న్యాయవాదుల విధులను పరిశీలించడం.

ఫెడరల్ చట్టాలు అతిక్రమించబడిన సందర్భాలను గురించి దర్యాప్తులు జరిపి, కేసులుమోపడం.

జెయిళ్ళను పర్యవేక్షించడం.

పెరోలుమీద విడుదల చెయ్యాలని, నేరాన్ని క్షమించాలని పంపబడిన దరఖాస్తులను పరిశీలించి ప్రెసిడెంటుకు నివేదికలను పంపడం.

కోర్టులలో అమలు జరగవలసిన నిబంధనలను తయారుచెయ్యడానికి సహాయ పడడం.

ప్రెసిడెంటుగాని, ఇతర కార్యాలయాధిపతులుగాని న్యాయసమస్యలపై అడిగినప్పుడు సలహాలివ్వడం.

రాజ్యాంగ చట్టంవల్ల, శాసనాలవల్ల ప్రజలకు గల హక్కులను కాపాడడం.

వలస చట్టాలను, పౌరస్వత్వ చట్టాలను అమలు పరచడం.

### పోష్టాఫీసు కార్యాలయం

ప్రజలకు ఎక్కువ ఖర్చు లేకుండా పరస్పరం సమాచారాలు తెల్పుకోగల ఏర్పాట్లను చెయ్యడం ఈ కార్యాలయం విధి. దాని ప్రధానాధిపతి పోష్టుమాష్టర్ జనరల్. ఆయనకు సహాయపడే అసిస్టెంటులు అనేకమంది ఉంటారు. పోష్టాఫీసు కార్యాలయం చేసే పనులు యివి:

ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రజలకు అందచెయ్యడం.

రైళ్ళద్వారా, నౌకలద్వారా, విమానాలద్వారా ఉత్తరాలు మొదలైనవి బట్వాడా అయేటట్లు చూడడం. దేశమంతటా పోష్టాఫీసులు పనిచేసేటట్లు చర్యలు తీసుకొనడం.

అన్ని పోష్టాఫీసులను తణిఖీ చెయ్యడం.

పోష్టల్ సేవింగ్స్, రెజిస్టర్డు తపాలు, పార్సెళ్ళు, మనియార్డర్లు మొదలైనవి ఏర్పాటు చెయ్యడం.

ప్రెసిడెంటు అనుమతిపొంది విదేశాలతో పోష్టల్ ఒడంబడికలు చేసుకొనడం.

### దేశీయ కార్యాలయం

ప్రజలకు క్షేమం కలిగే పనులు చెయ్యడం, జాతీయ సంపదలను కాపాడి, వాటిని అభివృద్ధి పరచడం ఈ

కార్యాలయం బాధ్యత. ఖనిజ సంపదలు, అడవులు, విద్యాలయాలు, ప్రజారోగ్యం మొదలైనవి ఈ కార్యాలయానికి చెందినవి. దేశీయ కార్యాలయం తన విధులను నిర్వర్తించడానికై ఈ క్రింది పనులు చేస్తుంది:

పశువుల మేతకు కేటాయించబడిన పచ్చికబయళ్ళు మొదలైన ప్రభుత్వ భూములను పర్యవేక్షించడం.

పెట్రోలు, బొగ్గు, నదులవల్ల వచ్చే విద్యుచ్ఛక్తి, లోహపుగనులు మొదలైన వాటిని పరిశీలించి, వాటిని అభివృద్ధి పరచడం.

వ్యవసాయానికి పనికి వచ్చే భూములను పరిశీలించడం; వాటికి నీటి పారుదల సౌకర్యాలను చూపడం; వ్యవసాయాలకై ప్రాజెక్టులను నిర్మించడానికి ఏ విధంగా ధనాన్ని ఖర్చు చెయ్యాడమో చెప్పడం.

గనులలో ప్రమాదాలకు కారణాలను గురించి దర్యాప్తులుజరిపి, వాటిని నివారించడం.

అమెరికాలో ఆదివాసులైన 4,00,000 మంది రెడ్ ఇండియనుల ఆరోగ్యం గురించి, క్షేమం గురించి, విద్యాభ్యాసం గురించి శ్రద్ధవహించడం.

వ్యాపారానికిగాని, విలాసానికిగాని వేటాడేవారికి, చేపలు పట్టేవారికి సంబంధించిన శాసనాలను అమలు పరచి, అడవులు, అడవి మృగాలు నశించకుండా కాపాడడం.

అమెరికాలోని పార్కులను, వాటి అందచందాలను కాపాడి, ప్రజలకు అవి ఆటస్థలాలుగా ఉపయోగపడేటట్లు చెయ్యడం.

పోర్టోరికో, వర్జిన్ దీవులలోని ప్రభుత్వాల పరిపాలనా వ్యవహారాలకు బాధ్యత వహించడం; హవాయి, అలాస్కాల పరిపాలనకు కొన్ని హక్కులను అమలుజరపడం; అలాస్కాలోని ప్రభుత్వపు రైళ్లను నడపడం.

## వ్యవసాయ కార్యాలయం

దేశంలో పంటలను అభివృద్ధి పరచడం, రైతుల యోగక్షేమాలను చూడడం ఈ కార్యాలయం విధులు. రైతులకు, పంటలకు సంబంధించిన చట్టాలను, అవసరాలకు తగినట్లు ధాన్యాలను పండించే నిమిత్తం కాంగ్రెసు చేసే శాసనాలను అమలు జరుపుతుంది. అందువల్ల పంటలు అనవసరంగా పండించడం, ధాన్యాలు మిలిగిపోవడం, లేదా కొరత పడడం మొదలైనవి జరగవు. తన విధులను నిర్వర్తించడానికి ఈ కార్యాలయం చేసే పనులు యివి:

భూసారాన్ని కాపాడగల పద్ధతులను అమలుజరిపి, ఏ కాలంలో ఏ పంటలు పండించడమో, ఏ పంట తరువాత ఏ పంట వెయ్యడమో రైతులకు చెప్పి, భూసారాన్ని వృద్ధిపరచడం.

ప్రజలకు మాంసం, పాలు, వెన్న మొదలైనవి పుష్కలంగా సప్లైకావడానికై మంచి పశువులను పెంచగల పద్ధతులను ఆచరించడం.

సేద్యానికి, నీటి పారుదలకు, ఇళ్ళ నిర్మాణాలకు వ్యవసాయయంత్రాలకు సంబంధించిన సమస్యలలో రైతులకు సలహాలివ్వడం.

సరకుల సప్లై, రవాణాలు, ధరలు మొదలైన వాటిని గురించి నివేదికలను ప్రకటించడం ద్వారా రైతులు తమ ధాన్యాలను తెలివి తేటలతో అమ్మకో డానికి సహాయ పడడం.

జంతువులకు, పంటలకు, మొక్కలకు పట్టగల వ్యాధులను, క్రిమికీటకాలను నాశనం చెయ్యడం.

అడవులను కాపాడి, దేశంలో కలపకు కొరత లేకుండా చెయ్యడం.

వ్యవసాయదారులకు సహకార పద్ధతులమీద అప్పులిచ్చి, ధాన్యాలను అమ్ముకోడానికి, కొనుక్కో డానికి అప్పులిచ్చి, వ్యాపార సంస్థలకు అప్పులిచ్చి, వాణిజ్య సరళికి దోహద మివ్వడం.

గ్రామాలలో ఎలక్ట్రిసిటీ ఏర్పాటులకు అప్పు లివ్వడం.

## వాణిజ్య కార్యాలయం

అమెరికా దేశీయ, విదేశీయ వాణిజ్యాభివృద్ధికీ, గనులను, పరిశ్రమలను, నౌకా రవాణాలను, చేపల పరిశ్రమలను

అభివృద్ధి పరచడానికి చర్యలు తీసుకోవడం ఈ కార్యాలయం విధి. ఈ కార్యాలయానికి సంబంధించిన ఇతర ఆఫీసులు అనేక పనులు చేస్తాయి. అవి :

దేశీయ, విదేశీయ వాణిజ్య సంస్థ అనేది ఈ కార్యాలయానికి చెందినది. ఇది వస్తువుల ఉత్పత్తిని, పంపిణీని పరిశీలించి దేశీయ, విదేశీయ వాణిజ్యాభివృద్ధికి శ్రద్ధ వహిస్తుంది. వాణిజ్యంగురించి తాజా సమాచారాలను వ్యాపారస్థులకు తెల్పడానికి దేశంలో పలుచోట్ల ఈ సంస్థ శాఖలుంటాయి. వ్యాపారస్థుల తరఫున ఇది ప్రభుత్వంలో ప్రాతినిధ్యం వహిస్తుంది.

కోస్ట్ అండ్ జియోడెటిక్ సర్వే అనే పేరుతో ఒక ఆఫీసు కలదు. ఇది అమెరికా తీరాలను సర్వేచేసి, మ్యాపులను తయారుచేస్తుంది. సముద్రంలో కలిసే చోట్ల నదులలో పాటు పోటులను గురించి వర్తమానాలు తెల్పుతూ నౌకలకు సాయపడుతుంది.

బ్యూరో ఆఫ్ సెన్సస్ అనే ఆఫీసు పది సంవత్సరాల కొకసారి జనాభా లెక్కలను తయారుచేస్తుంది. వాణిజ్యాభివృద్ధికి అవసరమైన అనేక విషయాలను గురించి ఎల్లప్పుడు లెక్కలను సేకరిస్తూంటుంది.

క్రొత్తగా కనిపెట్టబడిన వస్తువులను పేటెంటు చెయ్యడం, ట్రేడ్ మార్కులను, ప్రింటులను, లేబుల్ లను రిజిస్టర్ చెయ్యడం పేటెంటు ఆఫీసు నిర్వహించే పనులు.

నేషనల్ బ్యూరో ఆఫ్ స్టాండర్డ్స్ అనే ఆఫీసు ఒకటుంది. తూకాలకు, కొలతలకు సంబంధించిన పనులు చేసి, ప్రజలు మోసగించబడకుండా ఇది జాగ్రత్తలు వహిస్తుంది. సరకుల నాణ్యాన్నికూడా పరిశీలించి, ప్రజలకు మంచి సరకులు లభించేట్లు చర్యలు తీసుకుంటుంది.

ఇన్‌ల్యాండ్ వాటర్ వేస్ కార్పొరేషన్ అనే ఆఫీసు నదులలో ప్రయాణాలకు, రవాణాలకు సౌకర్యాలు చేస్తుంది. మిసిసిపీ నదిలో ప్రయాణాలు, రవాణాలు జరిగే లాంచీలు మొదలైనవి ఈ ఆఫీసు యాజమాన్యాన నడుపబడుతాయి.

వెదర్ బ్యూరో అనే ఆఫీసు ఒకటుంది. దీని శాఖలు దేశమంతటా ఉన్నాయి. తుపానులు, పొగ మంచు, అడవులలో అగ్ని ప్రమాదాలు, వరదలు మొదలైన వాటిని గురించి ఇవి ప్రజలకు ఎప్పటి కప్పుడు సమాచారాలను తెల్పుతాయి. ప్రతి దినం ఇవి చేసే ప్రకటనలు వ్యాపారస్థులకు, పరిశ్రమలకు మిక్కిలి ఉపయోగకరం.

సివిల్ ఏరోనాటిక్స్ అడ్మినిస్ట్రేషన్ అనే పేరుతో మరొక ఆఫీసు ఉన్నది. విమానాలకు వాతావరణం గురించిన సమాచారాలను తెల్పుతుంది. తద్వారా విమాన ప్రమాదాల నివారణకు సాయపడుతుంది.

## కార్మిక కార్యాలయం

కార్మిక కార్యాలయం ఉద్దేశం "అమెరికాలో కార్మికుల యోగక్షేమాలకు చర్యలు తీసుకొని, వారి పనులకు చెందిన పరిస్థితులను అభివృద్ధి పరచి, వారు ఎక్కువ వేతనాలను సంపాదించుకోడానికి సహాయపడడం." అందుకై అది చేసే పను లివి:

కార్మికులకు సంబంధించిన, ముఖ్యంగా కార్మికులకు యజమానులకు మధ్య సంబంధాలకు సంబంధించిన సమాచారాలను, జీతాలకు, పనిగంటలకు చెందిన సమాచారాలను సేకరించి, కార్మికులకు క్షేమంకలిగే మార్గాలను అన్వేషించడం — ముఖ్యంగా వారికి ఎల్లప్పుడు పనులు లభించేటట్లు చెయ్యడం.

యజమానులకు, కార్మికులకు మధ్య వివాదాల పరిష్కారానికి సహాయపడడం.

పరిశ్రమలలోని స్త్రీల యోగక్షేమాలకు సంబంధించిన అంశాలపై నివేదికలను తయారుచెయ్యడం.

కార్మికుల భద్రతకు, ఆరోగ్య రక్షణకు, పనులలో పరిస్థితులను చక్కబరచడానికి సహాయపడడం.

ప్రభుత్వానికి అనేక రకాల సరకులను సప్లయి చేసే ఫ్యాక్టరీలలో పని గంటలను, వేతనాలను, పనుల పరిస్థితులను నిర్ణయించడం.

కార్మికులకు తగిన వేతనాలను యివ్వడానికి, వారిచేత ఎక్కువ గంటలు పనిచేయించకుండా వుండడానికి నిబంధనలు అమలు జరిగేటట్లు శ్రద్ధ వహించడం.

# 10

# స్వతంత్ర కార్యాలయాలు

మంత్రివర్గం కార్యాలయాలే కాక, ఇంకా అనేక రకాల ప్రభుత్వ కార్యాలయా లున్నాయి. ఇవికూడా ఫెడరల్ ప్రభుత్వ శాసనాలను అమలుపరచే బాధ్యత గలవి. ఇవి మంత్రివర్గ కార్యాలయాలకు సంబంధించినవి కావు. వాటితో ఈ ఆఫీసులకు అప్పగించబడిన పనులకు సంబంధం లేదు. వీటిలో కొన్ని కోర్టులవంటివి (ఏదో వొక ప్రత్యేక శాసనాన్ని ప్రజలకు తెల్పి దానిని అమలు జరపడానికి ఉద్దేశించబడిన ఆఫీసు లన్నమాట. లేదా, కొన్ని ప్రత్యేక స్థితిగతులనుగురించి సమాచారాలను సేకరించి, నివేదికలు పంపడానికి ఉద్దేశించ బడ్డవి); కొన్ని ఆఫీసులు మంత్రివర్గ కార్యాలయా లన్నింటి తరపున ప్రత్యేక విధులను నిర్వర్తిస్తాయి. అనేక రకాల ఆఫీసులు ఈ విధంగా నెలకొల్పబడి వుండడంచేత, ఉదాహరణకు కొన్ని ఆఫీసుల విధులు క్రింద వివరించబడ్డాయి : •

సివిల్ సర్వీస్ కమిషన్ : ఇది 65 సంవత్సరాల క్రిందట నెలకొల్ప బడింది. ప్రభుత్వోద్యోగాలపై రాజకీయ పక్షాలకు కంట్రోలు లేకుండా చెయ్యడానికీ, యోగ్యులైన వారికే ఉద్యోగా లివ్వడానికీ ఈ ఆఫీసు ఉద్దేశం. 1700 రకాల ఉద్యోగాలకు సమర్థులైనవారిని ఎన్నడానికై సివిల్ సర్వీస్ కమిషన్ అధికారులు పరీక్షలు ఏర్పాటుచేస్తారు. ఇవి అనుకూలమైన కొన్నివందల ప్రాంతాలలో జరుగుతాయి. అంతకంతకు ఎక్కువగా ప్రభుత్వోద్యోగాలు "సివిల్ సర్వీస్" అధీనం చెయ్యబడుతున్నాయి. అంటే, ప్రభుత్వంలో

ఉద్యోగాలను సంపాదించడానికి పూర్వం అభ్యర్థులు తమ సామర్థ్యాన్ని చూపాలన్నమాట. సివిల్ సర్వీస్ పరీక్షలు ప్యాసయిన వారికి ఖాయంగా ఉద్యోగాలు లభించగలవు. క్రమంగా ఎక్కువ జీతాలు పొందగలరు. అందువల్ల సమర్థులైన వారికి ప్రభుత్వంలో ఉద్యోగాలు పొందాలనే ఉత్సాహం కలుగుతుంది.

**జనరల్ అకౌంటింగ్ ఆఫీసు :** దీని ప్రధానాధికారిని కంట్రోలర్ జనరల్ అంటారు. మంత్రివర్గ కార్యాలయాలతో దీనికి సంబంధం లేకపోయినా, ప్రభుత్వానికి సంబంధించిన అకౌంట్లను చూస్తుంది. ప్రభుత్వం డబ్బు యివ్వవలసిన వారికి ఇస్తుంది. రాబట్ట వలసిన వారివద్దనుంచి రాబట్టుతుంది. జమా ఖర్చుల వివాదాలను పరిష్కరిస్తూంటుంది. ప్రజల నుంచి· పన్నులరూపంలో వసూలు చెయ్యబడిన ధనం న్యాయంగా ఖర్చయేటట్లు జాగ్రత్త వహిస్తుంది.

**ఇంటర్‌స్టేట్ కామెర్స్ కమిషన్ :** వివిధ రాష్ట్రాల మధ్య సరకుల ఎగుమతి దిగుమతుల రేటులను సక్రమంగా చెయ్యడం, న్యాయమైన పద్ధతులను అమలు జరపడం ఈ కార్యాలయం బాధ్యత. (రైళ్ళు, బస్సులు, నౌకలు, లారీలు మొదలైన వాటి ద్వారా రాష్ట్రాలమధ్య జరిగే ఎగుమతి దిగుమతులు). వీటికోసం ధనాన్ని సమకూర్చడానికి నిలవ సరకులను అమ్మడం, బాండులను అమ్మడం, రైళ్ళు, మోటారులు

సురక్షితంగా నడవడానికి చట్టాలు చెయ్యడం మొదలైన పనులు కామెర్స్ కమిషన్ కంట్రోలులో వుండగలవు.

ఫెడరల్ ట్రేడ్ కమిషన్: వ్యాపారాలలో దగా జరగకుండా దర్యాప్తులు జరపడం ఈ కమిషన్ విధి. మోసకారుల మీద కేసులు మోపుతుంది. దగా చేసిన వ్యాపారస్థుల మీద ప్రజలు పితూరీ చేస్తే విచారణలు జరుపుతుంది.

వెటరన్స్ అడ్మినిస్ట్రేషన్: సైనికులలో గాయ పడ్డ వారికి చికిత్స చేసే నిమిత్తం ఆస్పత్రులు కట్టించి, వాటిని నడిపే కార్యాలయం. యుద్ధంనుంచి తిరిగి వచ్చిన సైనికులకు పలువిధాల సహాయ పడుతుంది. చనిపోయిన సైనికుల భార్యలకు, కుటుంబాలకు పోషణ చూపుతుంది. సైనికుల పెన్షన్లు, ఇన్సూరెన్సులు, నష్ట పరిహారాలు మొదలైన వ్యవహారాలు ఈ కార్యాలయం సాగిస్తుంది.

సెక్యూరిటీస్ అండ్ ఎక్స్‌ఛేంజి కమిషన్: సరకులను, బాండులను కొనడానికి ధనాన్ని పెట్టుబడి పెట్టేవారి రక్షణకై ఉద్దేశించబడిన కార్యాలయం. కంపెనీలు తమ సెక్యూరిటీలను అమ్మి డబ్బు చేసుకొనేటప్పుడు, ఆ కంపెనీలను గురించి ప్రభుత్వానికి వాస్తవ సమాచారాలను తెల్పాలి. అటువంటి సమాచారాలను ఈ కార్యాలయం పరిశీలిస్తుంది. సెక్యూరిటీలను అమ్మడంలో మోసంచేసేవారి మీద చర్యలు తీసుకొనడానికి, వారిని శిక్షించడానికి, స్టాక్ ఎక్స్‌ఛేంజి వ్యాపారాన్ని సరిగా నడపడానికి దీనికి అధికారం ఉన్నది.

యునైటెడ్ స్టేట్స్ మారిటైమ్ కమిషన్ : అమెరికా ఎగుమతులకై పెద్ద వ్యాపార నౌకలను నిర్మింప చెయ్యడం, అవి సక్రమంగా పని చేయడానికి చర్యలు తీసుకొనడం ఈ కార్యాలయం పనులు. ఓడలద్వారా వ్యాపారం జరగడానికి అన్ని విధాలా చర్యలు తీసుకుంటుంది. యుద్ధకాలంలో యుద్ధ నౌకలకు వ్యాపార నౌకలు సహాయ పడగల చర్యలు తీసు కొనడం కూడా ఈ కార్యాలయం విధి.

ఫెడరల్ సెక్యూరిటీ ఏజన్సీ: ప్రజాక్షేమానికై చర్యలు తీసుకొనే కార్యాలయాల పనులను పర్యవేక్షించే ఆఫీసు ఇది. ఇది చాలా పెద్ద కార్యాలయం. ప్రజల సాంఘిక, ఆర్థిక భద్రతకు, విద్య, ఆరోగ్య సౌకర్యాలకు చర్యలు తీసుకుంటుంది.

ఉదాహరణకు, దీనిలోని అంతర్భాగమైన "యునైటెడ్ స్టేట్స్ ఆఫీస్ ఆఫ్ ఎడ్యుకేషన్" కార్యాలయం విద్యాభి వృద్ధికి సంబంధించిన సమస్యలను పరిశీలిస్తుంది. పాఠశాలలకు, విద్యాధికారులకు ఉపకరించగల అనేక ప్రకటనలను, కరపత్రాలను ప్రచురిస్తుంది. వాటిలో పాఠశాలల నిర్వహా ణకు, బోధనకు సంబంధించిన క్రొత్త విషయాలను, అభ్యుదయ కరమైన పద్ధతులను వివరిస్తుంది. పాఠశాలల అభివృద్ధికై రాష్ట్ర ప్రభుత్వాలకు ఫెడరల్ ప్రభుత్వం ధన సహాయం చెయ్యగల ఏర్పాట్లు ఈ కార్యాలయం ద్వారా జరుగుతాయి.

యునైటెడ్ స్టేట్స్ పబ్లిక్ హెల్త్ సర్వీస్: ఇది అనేక ఆస్పత్రులను నడుపుతుంది. ఆరోగ్య రక్షణకు చెందిన శాసనాలను అమలు జరుపుతుంది. అంటువ్యాధుల నివారణకు

చర్యలు తీసుకుంటుంది. టీకాల మందులు మొదలైనవి సరిగా అమ్మక మయేటట్లు చేస్తుంది. అమెరికాకు క్రొత్తగా వచ్చిన వారి ఆరోగ్యాన్ని పరీక్షచేస్తుంది. వ్యాధులకు, అంటువ్యాధులకు గల కారణాలను పరిశోధించి, అమూల్య సమాచారాలను కరపత్రాల ద్వారా ప్రజలకు తెలియపరుస్తుంది. ప్రజారోగ్యాభివృద్ధికి ఈ కార్యాలయం ఇంకా అనేక పనులు చేస్తుంది.

**సోషల్ సెక్యూరిటీ అడ్మినిస్ట్రేషన్ :** వ్యాపార సంస్థలలో, పరిశ్రమలలో పని చేసే కార్మికులకు వృద్ధాప్యంలో ధనం లభించే ఇన్సూరెన్సు సౌకర్యాలను కలిగించే ఆఫీసు. కార్మికులకు పనులు లభించనప్పుడు పరిహారం ఇచ్చే నిమిత్తం రాష్ట్రప్రభుత్వాలకు సాయపడుతుంది. పోషణ లేని గ్రుడ్డివారికి, అనాధ బాల బాలికలకు పోషణ కల్పిస్తుంది. సోషల్ సెక్యూరిటీ ప్లానులను అనుసరించి ఇన్సూరు చేసుకొన్న కార్మికులు రిటైరు అయినప్పుడు నెలవారీగా ధనం పంపుతుంది. నిరుద్యోగులకు రాష్ట్ర ప్రభుత్వాలు చెల్లించవలసిన పరిహారంలో కొంత భాగాన్ని ఈ కార్యాలయం చెల్లిస్తుంది.

**ఫుడ్ అండ్ డ్రగ్ అడ్మినిస్ట్రేషన్ :** ప్రజలు వాడుకోడానికి అమ్మబడే పదార్థాలను, మందులను పరిశీలించే కార్యాలయం. వాటివల్ల ప్రజలకు చెడుపు కలగకుండా జాగ్రత్తలు వహించడానికై ఆహార పదార్థాలను, మందులను పరిశీలించి, వాటినామోదిస్తుంది ; హానికరమైనవైతే నిషేధిస్తుంది.

ఈ ఆఫీసులు మాత్రమే కాక, ప్రజోపయోగకరములైన పనులు చేస్తున్న ఇంకా అనేక రకాల ఆఫీసులు ఎన్నో వున్నాయి.

# 11

# ఫెడరల్ న్యాయశాఖ

ఫెడరల్ ప్రభుత్వంలో మూడవ శాఖ న్యాయశాఖ. ఫెడరల్ కోర్టులు ఈ శాఖకు చెందినవి. ఫెడరల్ శాసనాలను వివరించడం, వాటిమీద వ్యాఖ్యానాలు చెయ్యడం, వివాదాలను గురించి తీర్పులివ్వడం, కొన్ని రకాల శాసనాలను ధిక్కరించిన వారిని శిక్షించడం ఈ శాఖ విధులు.

ఏదైనా ఒక శాసనం ఎందుకు చెయ్యబడిందో కాంగ్రెసు సభ తన అభిప్రాయాన్ని సరిగా వ్యక్త పరుస్తుంది. కాని, ఆ శాసనం అమలు జరిగేటప్పుడు కొన్ని సందర్భాలలో వివాద మేర్పడుతుంది. అందువల్ల, అటువంటి సందర్భాలలో ఆ శాసనానికి వ్యాఖ్యానం చెప్పడం అవసరం. సాధారణంగా, ఆ శాసనం చెల్లనేరదంటూ ఫెడరల్ కోర్టులో కేసు పెట్టబడి నప్పుడు ఆవిధంగా వ్యాఖ్యానం చెయ్యడం జరుగుతుంది. ఫెడరల్ కోర్టు ప్రధాన న్యాయమూర్తి ఆ కేసులో యిచ్చిన తీర్పుకంటె, వ్యాఖ్యానం ముఖ్యమై వుంటుంది. అదే విధంగా, విదేశాలతో అమెరికా చేసుకొనే ఒడంబడికల, సంధుల విషయంలో కూడా ఫెడరల్ కోర్టులు వ్యాఖ్యానం చెయ్యగలవు.

ఫెడరల్ కోర్టులకు ఇంకా అనేక విధులున్నాయి.

అమెరికాలో ఎవరైనా ఫెడరల్ శాసనాన్ని ఉల్లంఘించినట్లు ఆరోపణ చెయ్యబడితే, అతడిని ఫెడరల్ కోర్టులో విచారణచేసి, అతడు దోషి అనో, నిర్దోషి అనో తీర్పుయిస్తారు. కేసుకు సంబంధించిన అన్ని వాస్తవ విషయాలను కోర్టుజడ్జీలు

యోచించి, ఆ కేసు విషయంలో న్యాయసూత్రాలు ఏ విధంగా వర్తించగలవో పరిశీలించి, అటుపిమ్మట తీర్పు యివ్వగలరు. "అందరికీ సమాన న్యాయం" కలిగించాలనే సూత్రానికి అనుగుణమైన పద్ధతి ఇది.

ఒక రాష్ట్ర ప్రభుత్వానికి, మరొక రాష్ట్ర ప్రభుత్వానికి మధ్య వివాద మేర్పడితే, న్యాయాన్ని చెప్పడానికి ఫెడరల్ కోర్టులు అవసరం. ఒక రాష్ట్రంలోని పౌరునికి, మరొక రాష్ట్రంలోని పౌరునికి తగవువస్తే, ఫెడరల్ కోర్టులో అది పరిష్కారం కాగలదు.

రాజ్యాంగ చట్టాన్ని అనుసరించి శాసనసభలు, ప్రభుత్వ కార్యాలయాలు నిర్వహించ వలసిన అనేక కష్టతరమైన బాధ్యత లున్నాయి. రాజ్యాంగచట్టం ఇచ్చిన అధికారాలను అవి ఉల్లంఘించి ప్రవర్తించకుండా ఫెడరల్ కోర్టులు అడ్డు పడుతూండ గలవు.

రాజ్యాంగచట్టం ప్రకారం ఫెడరల్ ప్రభుత్వానికి కొన్ని అధికారా లున్నాయి. మిగిలిన అధికారాలన్నీ రాష్ట్ర ప్రభుత్వాలకు యివ్వబడ్డాయి. అందుచేత, ఫెడరల్ ప్రభుత్వం గాని, రాష్ట్రప్రభుత్వాలుగాని తమకులేని అధికారాలను ఉపయోగిస్తున్నాయేమో నిర్ణయంచేసి, ఆటంక పడుతూండ డానికి ఫెడరల్ న్యాయశాఖ అవసరం.

## సుప్రీం కోర్టు

రాజ్యాంగ చట్టం ద్వారా అనుమతించబడిన కోర్టు సుప్రీంకోర్టు మాత్రమే. అందుచేత, రాజ్యాంగ చట్టాన్ని

సవరణ చెయ్యనిదే దానిని రద్దు చెయ్యడానికి వల కాదు. అమెరికాలో అన్ని కోర్టులకంటె అది పెద్దకోర్టు. అందుచేత, దాని నిర్ణయాలకు తిరుగులేదు. సుప్రీంకోర్టు తీర్పును త్రోసివేసి అప్పీలు చేసుకోడానికి మరొక కోర్టులేదు. సుప్రీం కోర్టును స్థాపించినది కాంగ్రెసుకాకపోయినప్పటికీ, దాని ఆఫీసు వ్యవహారాలను గురించి, అది చెయ్యవలసిన పనిని గురించి చట్టాలను చెయ్యగలదు. సుప్రీంకోర్టులో ఎంతమంది జడ్జీలు వుండాలో, వారి జీతాలు ఎంతవుండాలో కాంగ్రెసు అవసర మైనప్పుడల్లా నిర్ణయిస్తూంటుంది. జడ్జీల పదవులలో కాళీవచ్చి నప్పుడు క్రొత్త వారిని ప్రెసిడెంటు నియమిస్తాడు. అయితే, ఆ నియామకాలను సెనేటు ఆమోదించాలి. సెనేటు ఆమోదించని నియామకాలు చెల్లనేరవు. సుప్రీంకోర్టులో ఎటువంటి కేసులను విచారణ చెయ్యాలో కాంగ్రెసు నిర్ణయించవచ్చు. కాని, ఆ నిర్ణయాలు కొన్ని పరిమితుల లోపల వుండాలి. ఏమైనా, సుప్రీంకోర్టుకు రాజ్యాంగచట్టం యిచ్చిన అధికారాలను కాంగ్రెసు తీసివెయ్యలేదు.

## లోయర్ ఫెడరల్ కోర్టులు

లోయర్ ఫెడరల్ కోర్టులమీద కాంగ్రెసుకు ఎక్కువ అధికారాలున్నాయి. ఇంకా ఎక్కువగా ఫెడరల్ కోర్టులను ఎప్పుడు స్థాపించడమో, ఎటువంటి కేసులను ఏ ఫెడరల్ కోర్టులు విచారణ చెయ్యడమో కాంగ్రెసు నిర్ణయించ గలదు. సుప్రీంకోర్టును తప్ప, ఏ ఫెడరల్ కోర్టునైనాసరే

మార్పు చెయ్యడానికిగాని, రద్దుచెయ్యడానికిగాని కాంగ్రెసుకు అధికారం కలదు.

కాంగ్రెసు రెండు రకాల ఫెడరల్ కోర్టులను స్థాపించింది. సాధ్యమైనన్ని కేసులను విచారణ చేసి, సుప్రీం కోర్టుకు పని తగ్గించడానికి అవి ఉద్దేశింప బడ్డాయి. అమెరికాను పది జుడీషియల్ సర్క్యూట్‌ల క్రింద విభజించారు. ప్రతి సర్క్యూట్‌కు ఒక అప్పీలుకోర్టు ఉంది. దీనిని సర్క్యూట్ కోర్ట్ ఆఫ్ అప్పీల్స్ అంటారు. కాంగ్రెసు స్థాపించిన రెండు రకాల కోర్టులలో సర్క్యూట్ కోర్టులు పెద్దవి. వీటిక్రింద జిల్లా కోర్టులున్నాయి. జిల్లా కోర్టులు మొత్తం సుమారు వంద ఉన్నాయి. కొలంబియా జిల్లాను మాత్రం ఒక జుడీషియల్ సర్క్యూట్‌గా చేసి, దానికి ప్రత్యేకం ఒక అప్పీలు కోర్టును ఏర్పాటు చేశారు.

చట్టం ప్రకారం చాలా కేసులు మొదట జిల్లా కోర్టులలో విచారణ చెయ్యబడాలి. జిల్లాకోర్టు విచారణ పట్ల అసంతృప్తి కలవారు కొన్ని సందర్భాలలో దానికంటె పెద్దదైన ఫెడరల్ కోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో సరాసరి సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు. మరికొన్ని సందర్భాలలో సర్క్యూట్ కోర్టుకు అప్పీలు చెయ్యనిదే సుప్రీంకోర్టుకు అప్పీలు చెయ్యకూడదు. కొన్ని కేసులలో సర్క్యూట్ కోర్టు తీర్పు మాత్రమే ఖాయం. ఆపైన అప్పీలు చెయ్యడానికి వీలుకాదు.

అనేక సమయాలలో కాంగ్రెసు ప్రత్యేకంగా కోర్టులను స్థాపించింది. 1855 లో కోర్టు ఆఫ్ క్లెయిమ్స్ స్థాపించబడింది. దానికి పూర్వం, ఒక వ్యక్తి ప్రభుత్వం తనకు డబ్బు యివ్వాలనే కేసును పెట్టడానికి కోర్టులేదు. అందుచేత, ఇటువంటి దావాలను విచారణ చెయ్యడానికి ఇది స్థాపించబడింది. ఇలాగే 1926 లో మరొక స్పెషల్ కోర్టును స్థాపించింది. దానిపేరు కస్టమ్సుకోర్టు. దిగుమతుల సుంకాలకు సంబంధించిన కేసులు ఆ కోర్టులో విచారించ బడుతాయి. అలాగే, కస్టమ్సు అండ్ పేటెంట్స్ అప్పీల్స్ కోర్టు అనే దొకటుంది. దిగుమతుల సుంకాల కేసులకు సంబంధించిన అప్పీళ్ళను, పేటెంటులకు సంబంధించిన కేసులను అది విచారణ చేస్తుంది.

ఈ విధంగానే ప్రత్యేక సమస్యలకు సంబంధించిన కేసులను గురించి విచారణ జరపడానికి ఇంకా ఇతర స్పెషల్ కోర్టు లున్నాయి.

## ఫెడరల్ జడ్జీలు

ఫెడరల్ జడ్జీలను సెనేటు ఆమోదంతో ప్రెసిడెంటు నియమిస్తాడు. వారు తమ విధిని సంతృప్తికరంగా నిర్వహించి నంతకాలం పదవులలో ఉంటారు. ఏ జడ్జీ అయినా తన పదవీ కాలంలో పెద్దనేరాన్ని చేశాడంటే ఆయన్ని ప్రతినిధులసభ వారు విచారణచేస్తారు. అదే విధంగా ప్రెసిడెంటుగాని, సివిల్ ఆఫీసర్లుగాని నేరాలుచేస్తే ప్రతినిధుల సభవారిచేత విచారణ చెయ్యబడుతారు. ఫెడరల్ జడ్జీలకు యివ్వవలసిన జీతాలను

కాంగ్రెస్ నిర్ణయిస్తుంది. కాని, జడ్జీలు "పదవులలో వున్న కాలంలో వారి జీతాలు తగ్గించబడరాదు" అని రాజ్యాంగ చట్టంలో నిబంధన చెయ్యబడింది.

సుప్రీంకోర్టు స్థాపించబడ్డ తరువాత 70 సంవత్సరాలకు పైగా ఒక ఛీఫ్ జస్టిసు, ఎనుమండుగురు అసోసియేట్ జస్టిస్‌లు ఉండేవారు. ఛీఫ్ జస్టిస్ అధ్యక్షుడుగా ఉంటాడు. ఏ కారణం చేతనైనా కోర్టుకు హాజరు కానివారుతప్ప, మిగిలిన జస్టిస్‌లు ఒకేచోట కూర్చొని కేసులను విచారణచేస్తారు. వారిలో మెజారిటీ అభిప్రాయాన్ని అనుసరించి తీర్పు చెప్పబడుతుంది.

మెజారిటీ జస్టిస్‌లలోని ఒకడు లాంఛనంగా జస్టిస్‌ల "అభిప్రాయం" అనో, లేక కోర్టువారి నిర్ణయమనో తీర్పు వ్రాస్తాడు. మెజారిటీ అభిప్రాయంతో ఏకీభవించని జస్టిస్ లాంఛనంగా తన అసమ్మతిని తెల్పవచ్చు. సుప్రీంకోర్టు అభిప్రాయాలను ప్లీడర్లు, ఇతర కోర్టుల జస్టిస్‌లు వివరంగా చదువుతూంటారు. సుప్రీంకోర్టు జస్టిస్‌ల అభిప్రాయాలను, నిర్ణయాలను ఇతర కోర్టులలోను, వివాదాలలోను ఉపయోగించుకుంటారు.

# 12

# రాష్ట్ర ప్రభుత్వం

**అ**మెరికా ప్రభుత్వ వ్యవస్థలో రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రత్యేక స్థానమున్నది. రాజ్యాంగచట్ట నిర్మాతలు, వారు ప్రాతినిధ్యం వహించిన ప్రజలు కూడా తమ రాష్ట్రాల పట్ల మొదట భక్తిప్రపత్తులు కలిగివుంటామనీ, ఆ తరువాతనే కేంద్ర ప్రభుత్వం పట్ల భక్తిచూపుతామనీ అన్నారు. రాజ్యాంగ చట్టం రచించబడడానికి పూర్వమే పదమూడు కాలనీలకు రాజ్యాంగచట్టాలు రచించబడి ఉన్నాయి. అవి కొన్ని సంవత్సరాలపాటు అమలుజరుపబడ్డాయి. అందుచేత, రాష్ట్ర ప్రభుత్వాల కోరికలను మన్నించినమీదటనే మొత్తం దేశానికి రాజ్యాంగ చట్టాన్ని తయారుచేశారు.

ఫెడరల్ ప్రభుత్వాధికారాలు, రాష్ట్రప్రభుత్వాధికారాలు జాగ్రత్తగా విడదీయబడ్డాయి. రాష్ట్రాల సరిహద్దుల లోపలి సమస్యలను పరిష్కరించుకొనే అధికారం రాష్ట్ర ప్రభుత్వాలదేనని అంగీకరించబడింది. ఈ నియమం ఈనాటికీ తగినంతగా పాటించబడుతూంది. ఆర్థికంగా, సాంఘికంగా అభివృద్ధికావడానికై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక రంగాలలో భాగస్వాములైవుండడం తప్పనిసరి అయింది. కాని, ఫెడరల్ ప్రభుత్వానికి అధికారాలు క్రమంగా ఎక్కువయాయి. అయినప్పటికీ, రాష్ట్రాల స్వాతంత్ర్యం చాలా వరకు అలాగే వుంది. దానికి భంగం కలగలేదు. తమ అధికారాలను కాపాడుకోడానికి రాష్ట్ర ప్రభుత్వాలు అత్యంతశ్రద్ధ, పట్టుదల వహిస్తాయి.

ప్రజల అవసరాలను తీర్చడం, తద్విధంగా పరిపాలనను సాగించడం రాష్ట్రప్రభుత్వం ప్రధాన విధులు. రాష్ట్రం సరిహద్దులలో రాకపోకలకు రహదారులు; ఆస్తిపాస్తులకు, వర్తకాలకు, పరిశ్రమలకు, ప్రజాసౌకర్యాలకుచెందిన పనులు; క్రిమినల్ నేరస్థులకు శిక్షలు ఇవన్నీ ముఖ్యంగా రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించినవి. సూటిగా ప్రజలకు సంబంధించిన ఇంకా అనేక సమస్యల విషయంలో కూడా రాష్ట్రప్రభుత్వానికే అధికారాలున్నాయి. రాజ్యాంగ చట్టాన్ని అనుసరించి రాష్ట్ర ప్రభుత్వాల మీద ముఖ్యంగా నిర్బంధం చెయ్యబడిన విషయం ఒకటుంది. అది, రిపబ్లికన్ పద్ధతిగా రాష్ట్రప్రభుత్వాలు ఏర్పాటుచెయ్యబడి, రాజ్యాంగ చట్టాన్ని ఉల్లంఘించగల శాసనాలను గాని, సంధులనుగాని అవి చెయ్యరాదనేది. ఏవైనా క్రొత్తరాష్ట్రాలు ఏర్పడినప్పుడు వాటి రాజ్యాంగ చట్టాలు కాంగ్రెసులో ఆమోదించబడాలనే నిబంధనకూడా రాజ్యాంగ చట్టంలో చేర్చబడింది.

రాష్ట్రాల రాజ్యాంగ చట్టాలు కొన్ని అంశాలలో తేడాలు కలిగివున్నాయి. కాని, మొత్తం మీద అవన్నీ ఒకే పద్ధతిలో తయారుచెయ్యబడ్డాయి. సాధారణంగా ఉపోద్ఘాతంలో రాష్ట్రప్రభుత్వం ఆశయాలు ఉంటాయి. రాష్ట్రంలో శాంతి భద్రతలను కాపాడడం, ఇందుకై ఇతర రాష్ట్ర ప్రభుత్వాలతో సహకరించడం ఇవి తమ ఆశయాలంటూ రాష్ట్రాల రాజ్యాంగ చట్టాల ఉపోద్ఘాతాలలో ఉంటుంది. ప్రజల హక్కులకు

గ్యారంటీ యివ్వబడింది; ఇతరులకు హానికలిగించేలాగ వాటిని ఉపయోగించరాదని నిషేధించబడింది.

ఏ రాష్ట్రం రాజ్యాంగ చట్టంలోనైనాసరే సాధారణంగా ఈ క్రింది అంశాలు ఉంటాయి:

రాష్ట్రంలోని ప్రజల హక్కులగురించిన వివరణ.

రాష్ట్రప్రభుత్వ నిర్మాణం గురించిన ఒక ప్రణాళిక.

రాష్ట్రంలో ఏ యే నేరాలు చేస్తే ఏ విధంగా శిక్షించడమో గురించిన వివరణ.

మునిసిపాలిటీల, పట్టణాల, గ్రామాల, పంచాయతీల స్థానిక పరిపాలనలను గురించిన నిబంధనలు.

వర్తక సంస్థలు, బ్యాంకులు, ధర్మ సంస్థలు మొదలైనవి ఏ విధంగా పనిచెయ్యడమో షరతుల వివరణ.

రాష్ట్ర రాజ్యాంగచట్టాన్ని సవరించడానికి అనుసరించవలసిన కార్యక్రమం వివరణ.

రాష్ట్ర ప్రభుత్వంమీాద తుది అధికారం ప్రజలదేనని ప్రతి రాష్ట్ర రాజ్యాంగ చట్టంలోనుకూడా పేర్కొనబడుతుంది. ప్రభుత్వ స్థాపనపట్ల ప్రజల ఆశయాలు వివరించబడుతాయి. రాష్ట్ర ప్రభుత్వాల మధ్య పరస్పర సహకారం నెలకొనాలని తెల్పబడుతుంది. తమ ప్రభుత్వానికి ప్రాతిపదికగా ప్రజలు అమలు జరుపగల సూత్రాలు, నైతిక ధర్మాలు ఉదహరించ బడుతాయి.

## రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలు

ప్రజల అవసరాలను తీర్చడానికై రాష్ట్ర ప్రభుత్వం అనేక విధులు నిర్వర్తించ వలసి ఉంటుంది. అందుచేత అది అనేక చర్యలు జరపడం అవసరం. కొన్ని సందర్భాలలో ఒక రాష్ట్ర ప్రభుత్వం మరొక ప్రభుత్వం చర్యలతో సహాకరిస్తూ, ఇతర సందర్భాలలో స్వయంగా చర్యలు తీసుకొంటూ ఈ విధులు నెరవేరుస్తుంది.

ఉదాహరణకు, ప్రజల అవసరాలను తీర్చడానికై రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయాలలో చర్యలు తీసుకొంటుంది: ప్రజారోగ్య రక్షణ; పాఠశాలల, కళాశాలల స్థాపన; ప్రజల ప్రాణ మాన ధనాల రక్షణ; ప్రయాణ సౌకర్యాల వృద్ధి; ప్రభుత్వ సహాయంమీద ఆధారపడిన వారి రక్షణ; రాష్ట్రంలోని అడవుల, గనుల, పంటభూముల రక్షణ; అనేక రకాల వ్యాపారాలు సక్రమంగా జరిగేటట్లు శ్రద్ధ; ప్రజల జీవన, శ్రామిక పరిస్థితుల వృద్ధి.

**ప్రజారోగ్య రక్షణ:** అమెరికాలోని 48 రాష్ట్రాలలోను ప్రజారోగ్య రక్షణకు చర్యలు తీసుకొనే కార్యాలయాలున్నాయి. రాష్ట్ర ప్రభుత్వ శాసనాల ననుసరించి, వీటికి చెందిన ఆరోగ్య శాఖాధికారులు వైద్యులను, నర్సులను, ఔషధ విక్రయశాలలను పరీక్ష చేస్తుంటారు. వ్యాధుల నిర్మూలనకు కృషిచేసే వారందరినీ పరీక్షచేస్తూ, తమకు సంతృప్తికలిగిన వారికి లైసెన్సులు యిస్తారు. ఆ తరువాత వైద్యులు తమ వృత్తి చేసుకోవచ్చు. డాక్టర్లు, నర్సులు

సమర్థులై వుండాలనీ, సమర్థులు కానివారికి లైసెన్సులు యివ్వరాదనీ రాష్ట్ర ప్రభుత్వాలు చట్టాలు చేశాయి.

వ్యాధి గ్రస్తులకు, ఉన్మాదులకు చికిత్సకై రాష్ట్ర ప్రభుత్వాలు వైద్యశాలలను కూడా నడుపుతాయి. ఆరోగ్య శాఖాధికారులు ఆహార పదార్థాలను, మందులనుకూడా పరీక్ష చేస్తారు. ఈ విధంగా వ్యాధులు తేగలవాటిని నిషేధించి, ప్రజారోగ్యాన్ని కాపాడే నిమిత్తం అనేక విధాల ప్రయత్నిస్తారు. బడి పిల్లల ఆరోగ్యాన్ని తరచు పరీక్ష చేస్తారు. పాడి పశువులను పరీక్షచేసి, క్షయ మొదలైన వ్యాధులుగల వాటిని చంపి వేయాలనికూడా చట్టాలు కలవు.

**విద్యాభివృద్ధి :** తమ ప్రజలకు విద్యా సౌకర్యాలు కలిగించడానికి రాష్ట్ర ప్రభుత్వాలు విశేష శ్రద్ధ వహిస్తాయి. పన్నుల ద్వారా వచ్చిన ధనాన్ని వ్యయపరుస్తూ అనేక పాఠశాలలను నెలకొల్పాయి. పన్నుల ద్వారా పాఠశాలలను నెలకొల్పి, ప్రభుత్వం వాటిని నిర్వహించడం అమెరికా అభివృద్ధికి ముఖ్యమైన అంశాలలో ఒకటి. పిల్లలకు నిర్బంధంగా విద్య గరపాలని రాష్ట్ర ప్రభుత్వాలు శాసనాలను చేసుకోవచ్చు.

పాఠశాలల్లో విద్యాభ్యాసాన్ని ఏ పద్ధతులమీద సాగించాలో తరచు విద్యా శాఖాధికారులే నిర్ణయిస్తారు. కొన్ని సందర్భాలలో పాఠ్య పుస్తకాలనుకూడా వారే నిర్ణయిస్తారు. మంచి పాఠశాలలను స్థాపించుకోలేని ప్రాంతాల వారికి ప్రభుత్వ ధనాన్ని కేటాయించే అధికారంకూడా వీరికి ఒక్కొక్కప్పుడు ఉంటుంది. ట్రెయినింగు స్కూళ్ళను

స్థాపించి, వాటిని నిర్వహించే బాధ్యత విద్యాశాఖాధికారులదే. చాలా రాష్ట్ర ప్రభుత్వాలు ప్రభుత్వ విశ్వవిద్యాలయాన్ని, ఇతర కళాశాలలను నిర్వహిస్తుంటాయి. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు గృహిణులకు గృహకృత్యాలలో శిక్షణయిచ్చే పాఠశాలలను, కార్మికులు వృత్తులు నేర్చుకొనే పాఠశాలలను, రైతులకు శాస్త్రీయ పద్ధతులలో వ్యవసాయం నేర్పే పాఠశాలలను నెలకొల్పాయి. ఉత్తమ విద్యావిధానాలను కనుగొనడానికి, ప్రజలను కాపాడగల మంచి పద్ధతులను కనుగొనడానికి రాష్ట్ర ప్రభుత్వాలు తరచుగా పరిశోధన కేంద్రాలను నెలకొల్పుతూ ఉంటాయి.

**ప్రాణాలకు, ఆస్తిపాస్తులకు రక్షణ:** ప్రతి రాష్ట్రప్రభుత్వం సైన్యాలను అట్టే పెడుతుంది. సైనికులకు సుశిక్షణ యివ్వబడుతుంది. స్థానికాధికారులకు అవసరమైనప్పుడు వీరు సహాయపడుతారు. ఈ సైనికుల దళాన్ని నేషనల్ గార్డ్ అంటారు. రాష్ట్రం గవర్నరే నేషనల్ గార్డుకు నాయకుడు. స్థానికాధికారులు శాంతి బధ్రతలను కాపాడలేకపోయారని గవర్నరుకు తోచినప్పుడు నేషనల్ గార్డ్ సైనికులను ఆయన రాష్ట్రంలో ఏ ప్రాంతానికైనాసరే పంపగలడు. ప్రజల ఆస్తి పాస్తులకు, ప్రాణాలకు ప్రమాదం కలగకుండాకూడా నేషనల్ గార్డ్ సైనికులు రక్షణ కూర్చగలరు. కొన్ని రాష్ట్రాలలో రహదారుల రక్షణకు పోలీసు దళాలున్నాయి. అందువల్ల ప్రజలు నిరపాయకరంగా ప్రయాణాలు చెయ్యగలరు.

**మోటారు రవాణాలు:** అమెరికాలో సుమారు నాలుగు కోట్ల మోటారుకారు లున్నాయి. రవాణాలు ఎక్కువగా లారీలద్వారా జరుగుతాయి. అందుచేత, రోడ్లను ఎల్లప్పుడు బాగుచేయిస్తూ, వాటిని చక్కగా అట్టే పెట్టవలసిన అవసరం ఉంది. రాష్ట్ర ప్రభుత్వాలు అనేక సంవత్సరాలనుంచి కోట్ల కొలది డాలర్లను ఈ రోడ్ల మరమ్మత్తుకు వినియోగిస్తున్నాయి. ప్రపంచంలో రోడ్లు అత్యుత్తమంగా ఉన్న దేశాలలో అమెరికాకూడా ఒకటి. అందుకు చాలా వరకు రాష్ట్ర ప్రభుత్వాలు కారణం.

రోడ్లను నిర్మించడానికి, వాటిని బాగు చేయించడానికి అధిక ధనవ్యయం అవుతుంది గనుక, జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలు మొదలైనవి రాష్ట్ర ప్రభుత్వంనుంచి సహాయాన్ని పొందుతూ ఉంటాయి. రహదారులను రాష్ట్ర ప్రభుత్వాలే నిర్మించి, వాటి పోషణవ్యయాన్ని భరిస్తాయి. అన్ని రాష్ట్రాలను లంకెగా కల్పడానికి కేంద్ర ప్రభుత్వం ట్రంకు రోడ్డులను నిర్మించడానికి రాష్ట్ర ప్రభుత్వాలు సహాకరిస్తాయికూడా.

బస్సులు, లారీలు మొదలైనవాటికి రాష్ట్ర ప్రభుత్వాలు లైసెన్సులు ఇస్తాయి. అవి సరిగా పని చేస్తున్నాయో లేదో కూడా పరీక్ష జరుగుతూంటుంది. ప్రభుత్వాధికారులు డ్రయివర్లను పరీక్ష చేసి, సమర్థులైన వారికి లైసెన్సులు యిస్తారు. మోటారుకార్లు ఏ ప్రాంతంలో ఎంత వేగంతో వెళ్ళవచ్చునో రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయిస్తాయి. రోడ్లలో

మోటారులకు గుర్తుగా బోర్డులను ఏర్పాటు చేస్తాయి. ఇన్ని విధాలుగా మోటారు ప్రమాదాలను తప్పించడానికి రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు తీసుకుంటాయి.

**నిస్సహాయులకు సహాయం** : నిస్సహాయులైన వారి రక్షణకు చర్యలు తీసుకొనే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వాలు శ్రద్ధ వహిస్తాయి. అనాథులకు, అంగ విహీనులకు శరణాలయాలను స్థాపించి, వాటిని నిర్వహిస్తాయి. వృద్ధులకోసం ప్రత్యేక రక్షణాలయాలు, మూగ, చెవిటి వారికి ప్రత్యేక పాఠశాలలు నెలకొల్ప బడుతూంటాయి. ముఖ్యంగా నిరుద్యోగ సమస్య లేర్పడిన సమయాలలో రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజల రక్షణకు ఇటువంటి కృషి చెయ్యడం చాలా అవసరం.

**సహజ సంపదల రక్షణ** : అమెరికా ప్రజలు అనేక సంవత్సరాలు తమ అడవులను, వ్యవసాయ భూములను, గనులను వృథా చేశారు. ఆ విధంగా జరగకుండా ఈ నాడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమష్టిగా చర్యలు తీసుకొంటున్నాయి. ముఖ్యంగా ఈ క్రింది అంశాలలో సహాకారం నెరపుకొంటున్నాయి :

అడవులుగా తయారు చెయ్యడానికి కొన్ని భూములను కేటాయించడం, లేదా కొనడం ; వాటిలో చెట్లను ఒక క్రమప్రకారం కొట్టించడం.

చెట్లు కొట్టివెయ్యబడినా, పడిపోయినా, కాలి పోయినా వాటి స్థానే కొత్తచెట్లను నాటడం.

భూసారం కాపాడడం.

పెద్ద పార్కులను ఏర్పాటు చేసి, వాటిని జాగ్రత్త పెట్టడం.

అడవులలో మృగాలు, పక్షులు నాశనమైపోకుండా కాపాడడం.

వ్యవసాయదారులకు ఉత్తమ పద్ధతులను నేర్పి, ఎప్పుడు ఏ పంటలను పండించాలో, ఎరువులను ఏ విధంగా వెయ్యాలో చెప్పి, భూసారాన్ని కాపాడడం.

నదీజలాలను సద్వినియోగ పరచుకొనే పద్ధతులను అనుసరించడం.

పెట్రోలు, బొగ్గు, ఖనిజాలను వాడడాన్ని కంట్రోలు చెయ్యడం.

సేద్యానికి పనికివచ్చే భూములను క్రొత్తగా సాగుకు తేవడం.

సహజ సంపదలను కాపాడడం అవసరమని ప్రజలకు బోధించి, అందుకు వారేవిధంగా తమ పాత్రను నిర్వహించాలో బోధించడం.

**వాణిజ్య రంగానికి రక్షణ :** కొందరు వ్యక్తులు కలిసి ఒక కంపెనీని స్థాపించ దలచినప్పుడు, తమ ప్రధాన కార్యాలయాన్ని నెలకొల్పుకోడానికి ఆ రాష్ట్రప్రభుత్వం అనుమతి పత్రాన్ని పొందాలి. కంపెనీ వ్యాపారం ఏ విధంగా జరుగు

తున్నదో అప్పుడప్పుడు రాష్ట్ర ప్రభుత్వానికి నివేదికలు పంపుతూ ఉండాలి. కార్మికులు పనిచేసే గనులను, ఫ్యాక్టరీలను, పారిశ్రామిక సంస్థలను రాష్ట్ర ప్రభుత్వాధికారులు పరిశీలించడానికి సాధారణంగా అధికారం ఉంటుంది. రవాణాలు సరిగా జరగడానికి, ప్రజల అవసరాలను తీర్చడానికి ఉద్దేశించబడిన టెలిగ్రాఫ్, టెలిఫోన్, గ్యాసు, నీటిసరఫరా, ఎలక్ట్రిసిటీ కంపెనీలు సక్రమంగా పని చేయడానికి ప్రభుత్వం చర్యలు తీసుకోగలదు. ప్రజలు ధనాన్ని దాచుకొనే బ్యాంకులను, ఇన్స్యూరెన్సు కంపెనీలను ప్రభుత్వం పర్యవేక్షిస్తుంది. ఈ కంపెనీలకు ఖాతాదారులైన ప్రజలకు, వీటిలో డబ్బు పెట్టుబడి పెట్టిన ప్రజలకు రక్షణ కలిగించడానికై ఇటువంటి చర్యలు తీసుకోబడుతాయి.

**ప్రజల జీవన పరిస్థితులకు రక్షణ :** ప్రజల క్షేమానికై రాష్ట్ర ప్రభుత్వాలు అనేక శాసనాలను చేస్తూంటాయి. అవి చేసే నిమిత్తం వాటికి "పోలీసు అధికారాలు" అనేవి ఉన్నాయి. అంటే, తమ ప్రాణాలను, ఆరోగ్యాన్ని, నైతిక ధర్మాలను కాపాడి, సౌకర్యాలను చేసి, తమకు భద్రత కలిగించడానికి ప్రజలు యిచ్చిన అధికారాలన్నమాట. జూదాలనుగాని, లాటరీలనుగాని నిషేధించడానికి, మద్యపానాలను కంట్రోలు చెయ్యడానికి, లేదా నిషేధించడానికి ప్రభుత్వం ఈ పోలీసు అధికారాలనుబట్టి చట్టాలు చేస్తుంది. ఇవే అధికారాలను పురస్కరించుకొని, ఒక్కొక్కప్పుడు ఫ్యాక్టరీలలో, గనులలో స్త్రీలు, పిల్లలు పనిచేసే గంటలను పరిమితం చేస్తుంది.

కార్మికులు ఫ్యాక్టరీలలో ప్రమాదకర పరిస్థితులకు లోను కాకుండా నివారిస్తుంది. ఫ్యాక్టరీలలో గాలి సరిగా రావడానికి ఏర్పాట్లు చెయ్యాలనీ, దీపాలు వుండాలనీ, నీటి సదుపాయా లుండాలనీ, అగ్నిప్రమాదాలు సంభవించకుండా ఏర్పాట్లు ఉండాలనీ చట్టాలు చెయ్యబడ్డాయి. పనిసమయంలో గాయాలు తగిలినవారికి పరిహారం యివ్వాలని అనేక రాష్ట్రాలు చట్టాలను చేశాయి. కార్మికులు, యజమానులు తమమధ్య వివా దాలను పరిష్కరించుకొనేందుకు సాయపడే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వాలు తరచుగా ప్రత్యేక కార్యాలయాలను ఏర్పాటు చేసాయి.



అమెరికా కాంగ్రెసు సమావేశం ప్రారంభమైన మొదటి రోజున క్రొత్త సభ్యులు ప్రమాణాన్ని స్వీకరిస్తారు. ప్రపంచంలో అన్ని రాజ్యాంగ చట్టాల కంటె ప్రాచీనమైన అమెరికా రాజ్యాంగ చట్టాన్ని బలపరచగలమనీ, దానిని కాపాడగలమనీ వారు ప్రమాణం చేస్తారు.




అమెరికా కాంగ్రెసు భవనంలోని పోస్టాఫీసుకు ప్రతిరోజూనా తెరిపిలేకుండా పని వుంటుంది. శాసన సభ్యులకు తమ నియోజక వర్గాలలోని వోటరుల వద్దనుంచి, ఇతరుల వద్దనుంచి ప్రతిదినం ఉత్తరాలు, టెలిగ్రాములు, కార్డులు వస్తాయి. అనేక వార్తా పత్రికలు, తదితర పత్రికలు వారికి చేరుతాయి. వాటన్నింటిద్వారా వ్యక్తమైన ప్రజాభిప్రాయాన్ని శాసన సభ్యులు శ్రద్ధగా పరిశీలిస్తారు.



ప్రతినిధుల సభలో ఒక బిల్లును ప్రతిపాదించ దలచినప్పుడు దానిని ఒక కాగితంమీద వ్రాసి హాపర్ అనే పెట్టెలో పడవేయాలి. సెనేటులో బిల్లులను వాచా ప్రతిపాదించవచ్చు. బిల్లును శాసనం చెయ్యాలంటే దానిని ప్రతినిధుల సభలోని అధిక సంఖ్యాకులు, సెనేటులోని అధిక సంఖ్యాకులు ఆమోదించాలి. ఎన్ని బిల్లులనైనా సరే ప్రతినిధుల సభలోనూ, సెనేటు లోనూకూడా ప్రతిపాదించవచ్చు. కాని, పన్నులకు సంబంధించిన బిల్లులను మాత్రం ప్రతినిధుల సభలోనే ప్రతిపాదించి తీరాలి.



ఏదైనా ఒక బిల్లు ప్రతిపాదించబడినప్పుడు దానికి అనుకూలురైనవారి అభిప్రాయాలను ప్రతికూలురైనవారి అభిప్రాయాలను కాంగ్రెసులోని ఉప సంఘాలు సేకరిస్తాయి. బిల్లును గురించి తమ అభిప్రాయాలను తెల్పదలచామని కొందరు అనుమతి కోరుతారు. కొందరిని కాంగ్రెసే ఆహ్వానిస్తుంది. ప్రజలు ఈ విధంగా తమ అభిప్రాయాలను చెప్పడం తరచుగా కొన్ని రోజుల పాటుగాని, కొన్ని వారాలపాటుగాని జరుగుతుంది. ఈ సభలకు ప్రజలు, వార్తా విలేఖరులు, ఫొటోగ్రాఫరులుకూడా హాజరు కావచ్చు.



ఒక శాసన సభ్యుడు ఉపసంఘ సమావేశంలో పాల్గొంటున్నా, లేదా ఇతర పనుల మీద ఎక్కడికైనా వెళ్ళినా, ప్రతినిధుల సభలోగాని, సెనేటులోగాని ఏమి జరిగిందీ అతడికి వివరంగా తెలియదు. అందుచేత, "కాంగ్రెషనల్ రికార్డు" చదువుకుంటే అతడికి పూర్తి వివరాలు తెలుస్తాయి. ఈ పత్రిక ప్రతిదినం ఉదయాన శాసన సభ్యులకు అందజెయ్యబడుతుంది. క్రిందటి రోజున కాంగ్రెసులో ఎవరేమి మాట్లాడారో ప్రతి అక్షరం దానిలో అచ్చు




ఈయనొక శాసనసభ్యుడు. అమెరికా జాతీయ శాసనాలను చెయ్యడానికి ప్రజలచేత ఎన్నుకోబడిన పురుషులు, స్త్రీలు కలిపి కాంగ్రెసులో 531 మంది శాసనసభ్యు లున్నారు. కాంగ్రెసు సమావేశాలు జరుగుతున్న రోజులలో వీరందరు వాషింగ్టన్‌లో నివసిస్తారు.

# 13

# రాష్ట్ర ప్రభుత్వాల నిర్మాణం

ప్రతి రాష్ట్ర రాజ్యాంగచట్టంకూడా ఆ యా రాష్ట్రాల ప్రత్యేక సమస్యల ననుసరించి రచించబడ్డాయి. పెద్ద నగరాలలో స్థానిక ప్రభుత్వాలను ఏ విధంగా ఏర్పాటు చెయ్యడమో గురించి కొన్ని రాష్ట్రాలు యోచించవలసి వచ్చింది. పట్టణాల, గ్రామాల స్వపరిపాలనగురించి అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అవకాశాలు కూర్చడం జరిగింది. అన్ని విషయాలను ఆలోచించుకొన్నమీదట రాజ్యాంగ చట్టాలను తయారు చేసుకొన్నాయి.

అమెరికాలోని 48 రాష్ట్రాలు వేర్వేరు సమస్యలు, స్వభావాలు కలవి. వైశాల్యంలోనూ, జనాభాలోనూ కూడా అనేక తేడాలున్నాయి. రోడ్ దీవి వైశాల్యం 1200 చదరపు మైళ్ళకు కొంచెం మించివుంటుంది. టెక్సాస్ వైశాల్యం 2,66,000 చదరపుమైళ్ళు. కొన్ని రాష్ట్రాలు కేవలం వ్యవసాయంమీద ఆధారపడ్డవి. మిగిలినవి పరిశ్రమల మీద ఆధారపడ్డవి. అందుచేత, ప్రభుత్వ నిర్మాణ పద్ధతిలో పెద్ద తేడాలు లేకుండా, తమ తమ ప్రజల అవసరాలను ముఖ్యంగా గమనించి అన్ని రాష్ట్రాలు రాజ్యాంగ చట్టాలను రచించుకొన్నాయి.

కేంద్ర ప్రభుత్వంలాగే, ప్రతి రాష్ట్ర ప్రభుత్వానికి మూడు స్వతంత్ర శాఖలున్నాయి. అవి : శాసనశాఖ, కార్య నిర్వాహక శాఖ, న్యాయశాఖ.

I

# ఫెడరల్, రాష్ట్ర, నగర ప్రభుత్వాల నిర్మాణ పద్ధతులలో పోలికలు

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వం | శాసనాలు చెయ్యడానికి ప్రతిదానికీ ఒక శాసన శాఖ | శాసనాలను అమలు పరచడానికి ప్రతిదానికీ ఒక కార్యనిర్వాహక శాఖ | శాసనాలను వ్యాఖ్యానం చెప్పడానికి ప్రతిదానికీ ఒక న్యాయశాఖ |
| జాతీయ ప్రభుత్వం | కాంగ్రెసు : సెనేటు, ప్రతినిధుల సభ | ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు, కార్యనిర్వాహక కార్యాలయాలు, ఇతర కార్యాలయాలు | ఫెడరల్ కోర్టులు |
| రాష్ట్ర ప్రభుత్వం | రాష్ట్ర శాసనసభ(నెబ్రాస్కాలో తప్ప మిగిలిన అన్ని రాష్ట్రాలలో రెండేసి శాసనసభలు) | గవర్నరు, ప్రభుత్వ కార్యాలయాల ప్రధానులు | స్టేట్ కోర్టులు |
| నగర ప్రభుత్వం | సిటీ కౌన్సిలు లేదా కమీషనర్లు | మేయరు, లేదా మేనేజరు, లేదా కమిషనర్ల బోర్డు | సిటీ కోర్టులు |

నెబ్రాస్కా రాష్ట్రంలో తప్ప, మిగిలిన అన్ని రాష్ట్రాలలో రెండేసి శాసనసభ లున్నాయి. ఒకదానిని సాధారణంగా సెనేటు అనీ, రెండవదానిని ప్రతినిధులసభ అనీ అంటారు. నెబ్రాస్కాలో మాత్రం ఒకే శాసనసభ ఉంది. చాలా రాష్ట్రాలలో సెనేటు సభ్యులకంటె ప్రతినిధుల సభాసభ్యులు ఎక్కువమంది ఉంటారు.

సెనేటుకు, ప్రతినిధులసభకు కొన్ని రాష్ట్రాలలో సభ్యులు నియోజక వర్గాలనుంచి ఎన్నుకోబడుతారు. కొన్ని రాష్ట్రాలలో కొన్ని నియోజక వర్గాలను కలిపి ఒక జిల్లాగా చేసి, దానిని ప్రాతిపదికగా తీసుకొని సభ్యులను ఎన్నుకుంటారు. చాలా రాష్ట్రాలలో సెనేటర్లు నాలుగేసి సంవత్సరాలు, ప్రతినిధులు రెండేసి సంవత్సరాలు సభ్యులుగా ఉంటారు. కొలది రాష్ట్రాలలోమాత్రం సెనేటర్లు, ప్రతినిధులు కూడా రెండు సంవత్సరాలు మాత్రమే సభ్యులుగా ఉంటారు. కొన్ని రాష్ట్రాలలో ఉభయులుకూడా నాలుగేసి సంవత్సరాలు సభ్యులుగా ఉంటారు.

చాలా రాష్ట్రాలలో ఉభయ శాసనసభలు రెండేసి సంవత్సరాలకొకసారి సమావేశమై చట్టాలను చేస్తూంటాయి. కొలది రాష్ట్రాలలో సంవత్సరానికొకసారి, అలబామా రాష్ట్రంలో నాలుగు సంవత్సరాలకొకసారి సమావేశాలు జరుగుతాయి. అయితే, అవసర మనుకున్నప్పుడు ఆ రాష్ట్రం గవర్నరు ప్రత్యేక సమావేశాలను ఏర్పాటు చెయ్యగలడు.

## శాసన సభ్యుల ఎన్నిక

ప్రతి రాష్ట్రం జిల్లాలక్రింద విభజించబడింది. ప్రతి జిల్లా నుంచి ఒక సెనేటరు, ఒకడో అంతకంటె ఎక్కువగానో ప్రతినిధులూ ఎన్నుకోబడుతారు. ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థులు ఆ జిల్లాలో కనీసం ఒక సంవత్సరమైనా నివసించి వుండాలి. గ్రామాలకు, నగరాలకు శాసనసభలలో సమానంగా ప్రతినిధు లుండే నిమిత్తం జిల్లాలుగా విభజించడంలో రాష్ట్ర ప్రభుత్వానికి తరచు పెద్ద చిక్కులు ఏర్పడుతూ వుంటాయి.

రెండేసి శాసనసభలు గల 47 రాష్ట్రాలలో కూడా శాసనాలు చేసే పద్ధతి ఇంచుమించు ఒక టే. ఏ శాసనసభలోని సభ్యుడైనా సరే చట్టం చెయ్యవలసిన విషయం గురించి ప్రతిపాదన చెయ్యవచ్చు. ఒక బిల్లు ప్రతిపాదించబడిన పిమ్మట దానిని పరిశీలించే నిమిత్తం అదే శాసనసభలోని ఒక ప్రత్యేక సంఘానికి అప్పగించుతారు.

రాష్ట్ర శాసనసభ కార్యకలాపాలలో అధికభాగం కమిటీల ద్వారా నిర్వహించబడుతుంది. ముఖ్యమైన బిల్లుల విషయంలో ఈ కమిటీలు ప్రజాభిప్రాయాలను సేకరిస్తాయి. బిల్లుకు అనుకూలురు, ప్రతికూలురు అయిన ప్రజలు తమ తమ కారణాలను తెల్పుతారు. బిల్లును శాసనం చెయ్యడం అవసర మని కమిటీవారు నిశ్చయించుకొనే యెడల శాసన సభవారికి నివేదిక పంపుతూ, ఈ శాసనం వల్ల ఎటువంటి ప్రయోజనాలు కలగగలవో వివరిస్తారు. అనేక బిల్లుల విషయంలో ఈ కమిటీలు వాటిని అనుమతించక పోవడమో, ఒక అంగీకారానికి రాలేక

పోవడమో జరుగుతూంటుంది. అప్పుడూ కమిటీలు నివేదికలను పంపవు. అటువంటి బిల్లులను శాసనసభలు యోచించడం జరగదు. కాని, ఆ బిల్లులను ప్రతిపాదించినవారు సభ్యులలో అధిక సంఖ్యాకులను సుముఖులుగా చెయ్యగలిగితే, కమిటీ ప్రమేయం లేకుండా వాటిని శాసనాలుగా చెయ్యవచ్చు.

ఒక కమిటీవారు ఆమోదించిన బిల్లు శాసన సభకు పంపబడిన తరువాత, శాసనసభలో దాని మీద చర్చలు జరుగుతాయి. సభ్యులు బిల్లువలన కలిగే మంచి చెడ్డలను వివరిస్తారు. వోటింగు సమయంలో అధిక సంఖ్యాకులు దానికి అనుకూలంగా వోట్లు వేస్తే అది శాసనమవుతుంది. లేకపోతే అది వీగిపోతుంది. కమిటీలోగాని, శాసన సభలోగాని బిల్లులు సవరించబడుతూంటాయి.

ఒక శాసన సభలో ఆమోదించబడిన బిల్లు రెండవ శాసన సభకు పంపబడుతుంది. రెండవ దానిలో కూడా ఆ బిల్లు తిరిగి కమిటీకి పంపబడడం మొదలైనవి జరుగుతాయి. బిల్లుకు ఏదైనా సవరణ చెయ్యబడిన సందర్భంలో మాత్రం ఉభయ శాసన సభలలోని సభ్యులతో "కాన్ఫరెన్సు కమిటీ" సమావేశమై, దాని మీద చర్చలు జరుపుతాయి. తత్ఫలితంగా ఉభయ శాసన సభలకు అంగీకారం కుదరగల బిల్లు తయారుచెయ్యబడి, గవర్నరు సంతకానికి పంపబడుతుంది. ఆయన సంతకం చేస్తే అది శాసన మవుతుంది.

ఉత్తర కెరోలినా రాష్ట్రంలో తప్ప, మిగతా రాష్ట్రాల లోని గవర్నరు బిలులను వీటో చేసి, అవి శాసనాలు కాకుండా

చెయ్యగల అధికారంవుంది. అయితే, శాసన సభ్యులు అదే బిల్లును తిరిగి ఆమోదించగల హక్కువుంది. కొన్ని రాష్ట్రాలలో వేర్వేరుగా శాసన సభలలో మెజారిటీ సభ్యులు తిరిగి బిల్లునామోదించి, గవర్నరు వీటోను నిష్ప్రయోజనం చెయ్యగలరు. మరి కొన్ని రాష్ట్రాలలో మూడింట రెండువంతుల మంది అనుకూలంగా వోటు వేస్తేగాని గవర్నరు వీటో నిష్ప్రయోజనం కాదు.

మొత్తం రాష్ట్ర శాసనాలు స్థానిక బాధ్యతలను బట్టి చెయ్యబడుతాయి. కేంద్ర ప్రభుత్వపు బాధ్యతలకు చెందిన అంశాలను గురించి, కాంగ్రెసు చెయ్యవలసిన పనులను గురించి, విదేశాలతో సంధులను గురించి రాష్ట్ర ప్రభుత్వాలు చట్టాలను చెయ్యరాదని కేంద్ర రాజ్యాంగ చట్టంలో నిషేధించబడింది.

## రాష్ట్ర ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖ

ప్రతి రాష్ట్రం యొక్క ప్రధాన కార్య నిర్వాహకాధికారి గవర్నరు. ప్రజలు ఆయన్ని ఎన్నుకుంటారు. సుమారు సగం రాష్ట్రాలలోని గవర్నర్లు రెండేసి సంవత్సరాల కొకసారి, మిగతా రాష్ట్రాలలో నాలుగేసి సంవత్సరాల కొకసారి ఎన్నుకోబడుతూంటారు.

రాష్ట్ర రాజ్యాంగ చట్టంలో గవర్నరు అధికారాలు వివరించబడుతాయి. తను అవసరమనుకున్న క్రొత్త శాసనాలను చెయ్యవలసిందని ఆయన శాసన సభలకు సలహా యివ్వవచ్చు. అటువంటి శాసనాలను చేసే నిమిత్తం శాసన సభల ప్రత్యేక సమావేశాలను జరపగలడు. అనేక బోర్డుల,కమిషన్ల

## రాష్ట్ర ప్రభుత్వంలో మూడు స్వతంత్ర శాఖలు



సభ్యులను ఆయన నియమించగలడు. కొన్ని రాష్ట్రాలలో ఆయన చేసే ముఖ్య నియామకాలను సెనేటులు ఆమోదించ వలసివుంటుంది. రాష్ట్రంలోని నేషనల్ గార్డు సైనికులకు ఆయన నాయకుడు. రాష్ట్రం శాంతి భద్రతలు భంగపడే సమయాలలో ఆయన వారి నుపయోగించగలడు. రాష్ట్రంలోని కోర్టులలో శిక్షించబడినవారిని ఆయన క్షమించి విడుదల చెయ్యవచ్చు; వారి శిక్షాకాలాన్ని తగ్గించవచ్చు. గవర్నరుతో పాటు ప్రతిసారి లెఫ్టినెంట్ గవర్నరు కూడా ఎన్నుకోబడు తూంటాడు. ఆయన సెనేటుకు అధ్యక్షత వహిస్తాడు. గవర్నరు మరణించినా, పదవినుంచి తొలగించబడినా ఆ పదవి స్వీకరించగలడు.

రాష్ట్ర ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖలో అనేక మంది ముఖ్యమైన అధికారులుంటారు. దేశీయశాఖా మంత్రి ప్రభుత్వపు రికార్డు లన్నింటినీ జాగ్రత్త పెడుతూంటాడు. రాష్ట్ర శాసనాలను ప్రకటిస్తాడు. ఎన్నికల సమయాల్లో నోటీసులు పంపుతాడు. రాష్ట్ర ఎన్నికల ఫలితాలను ప్రకటిస్తాడు.

రాష్ట్ర ప్రభుత్వం న్యాయశాఖకు ప్రధానాధికారి అటార్నీ జనరల్. రాష్ట్ర ప్రజలకు సంబంధించిన కేసులు వచ్చినప్పుడు ఆయన, లేదా ఆయన అసిస్టెంటులు ప్రభుత్వం తరఫున వాదిస్తారు. అనేక రాష్ట్ర శాసనాలను అమలు జరపడంలోను, వాటికి వ్యాఖ్యానాలు చెయ్యడంలోను ఆయన గవర్నరుకు, తదితర అధికారులకు సహాయపడుతాడు.

రాష్ట్ర ప్రభుత్వపు జమా ఖర్చులను చూడడానికి స్టేట్ ఆడిటర్ వుంటాడు. బిల్లులు సరిగావుంటే ఆ విధంగా డబ్బు చెల్లించవలసిందని ఆయన ఖజానా మంత్రికి ఉత్తరువులిస్తాడు. ఖజానా శాఖకు చెల్లించబడిన ధనం లెక్కలను ఆయన జాగ్రత్తగా అట్టే పెట్టాలి. రాష్ట్ర ప్రభుత్వం తరఫున పన్నులు మొదలైనవి వసూలు చేసే జిల్లా, నగర, గ్రామాధికారుల వద్ద లెక్కలను ఆయన తణిఖీ చెయ్యాలి. చాలా రాష్ట్రాలలో ఆడిటరు ఎన్నుకోబడుతూ వుంటాడు.

రాష్ట్రం ఖజానా మంత్రి పన్నులు, లైసెన్సులు మొదలైన వాటి ద్వారా వచ్చే ఆదాయాన్ని జాగ్రత్త పరుస్తాడు. సరియైన బిల్లులు వచ్చినప్పుడు వాటికి ప్రభుత్వం తరఫున డబ్బు చెల్లిస్తాడు.

రాష్ట్ర ప్రభుత్వంలో ఇంకా అనేక కార్యాలయాలు, కమిషన్‌లు ఉన్నాయి. అనేక రాష్ట్రాలలో లేబర్ కమిషనర్లు ఉన్నారు. లేదా, లేబర్ బోర్డులు ఉన్నాయి. రాష్ట్రాలలో కార్మికుల పరిస్థితుల పట్ల శ్రద్ధవహించడానికి వారు నియమించ బడ్డారు. రాష్ట్రంలోని బ్యాంకులు సరిగా పనిచేస్తున్నాయో లేదో పరిశీలించడానికి బ్యాంకింగ్ కమిషన్‌లు ఉన్నాయి. ఇదే విధంగా, ప్రజారోగ్య రక్షణకు, రహదారుల రక్షణకు కమిషన్‌లు ఉన్నాయి.

రాష్ట్ర ప్రభుత్వంలోని మంత్రులందరూ ఎన్నుకోబడక తప్పదు. కొన్ని రాష్ట్రాలలో గవర్నర్లకు మంత్రుల మీద కొంత వరకు కంట్రోలు వుంది. ఇతర రాష్ట్రాలలో లేదు.

ఫెడరల్ ప్రభుత్వంలో లాగే, కొన్ని రాష్ట్రాలలో ప్రభుత్వోద్యోగాలు పొందదలచినవారు సివిల్ సర్వీస్ పరీక్షలు ప్యాసుకావాలి. ఎన్నుకోబడిన మంత్రులకు సహాయపడగల సమర్థులను ఈ విధంగా పదవులలో నియమిస్తారు. వారిమీద రాజకీయ పక్షాల పలుకుబడి పనిచేయదు. కొన్ని రాష్ట్రాలలో సివిల్ సర్వీస్ పరీక్షలు ప్యాసు కానవసరం లేకుండానే కొన్ని ఉద్యోగాలిస్తారు.

రాష్ట్ర శాసనాలను తెలియచెప్పడానికీ, వాటిని అమలు జరపడంలో వివాదాలు ఏర్పడినప్పుడు పరిష్కరించడానికీ న్యాయశాఖకు చెందిన కోర్టులున్నాయి. వ్యక్తుల, వర్గాల, సంస్థల వివాదాలను తీర్చడం జడ్జీల విధి. వ్యక్తుల, ఆస్తిపాస్తుల విషయాల్లపై కేసులలో వారు తీర్పులిస్తారు. నేరస్థులకు శిక్షలు విధిస్తారు.

రాష్ట్ర శాసనసభలు చేసిన ఒకచట్టం రాష్ట్ర రాజ్యాంగ చట్టానికి విరుద్ధమైనా, అమెరికా రాజ్యాంగ చట్టానికి విరుద్ధమైనా అది చెల్లనేరదని రాష్ట్రం సుప్రీంకోర్టు ప్రకటించగలదు.

## రాష్ట్రంలో కోర్టుల విధులు

రాష్ట్రంలోని కోర్టులు సివిల్, క్రిమినల్ కేసులను విచారించడానికి అధికారం కలదు. ప్రతి వ్యక్తికి తన స్వాతంత్ర్యాన్ని, ఆస్తిపాస్తులను, ప్రాణాన్ని కాపాడుకోడానికి హక్కువుంది. మరొక వ్యక్తి వీటికి భంగం కలిగిస్తే కోర్టులో కేసుపెట్టవచ్చును. జడ్జీలు విచారణ జరిపి, దోషులకు తగిన

శిక్ష విధిస్తారు. శాసనాలను పాటించక, ప్రజానీకానికి ప్రమాదం తెచ్చేపనులు చేసేవారి మీద ప్రభుత్వం తరఫున కేసులు మోపబడుతాయి. ఇటువంటి నేరాలలో ముఖ్యమైనవి హత్యలు, దొంగతనాలు, లంచాలు, దొంగ సంతకాలు మొదలైనవి.

అన్నింటికన్న చిన్న కోర్టు జడ్జిని జస్టిస్ ఆఫ్ పీస్ అంటారు. ఇటువంటి కోర్టులలో చాలా తక్కువ డబ్బుకు సంబంధించిన కేసులు, చిన్న నేరాలు విచారణ చెయ్యబడుతాయి. పెద్ద నగరాలలో ఈ విచారణలు పోలీసు కోర్టులలోనో, స్పెషల్ మునిసిపల్ కోర్టులలోనో జరుగుతాయి.

అంతకంటె పెద్ద కేసుల విచారణలు ఇతర కోర్టులలో జరుగుతాయి. సాధారణంగా అవి జిల్లా కోర్టులు, సుపీరియర్ కోర్టులు, సర్క్యూట్ కోర్టులు, కామన్ ప్లీస్ కోర్టులు అయి వుంటాయి. వీటిలో సివిల్ కేసులు, క్రిమినల్ కేసులుకూడా విచారణ జరుపబడుతాయి.

రాష్ట్రంలో అన్నింటి కంటె పెద్దది సుప్రీం కోర్టు. అప్పీలు చెయ్యబడిన కేసులు దానిలో విచారణ చెయ్యబడుతాయి. క్రింది కోర్టులలో తనకు అన్యాయం జరిగిన దనుకున్న వ్యక్తి అప్పీలు చేస్తాడు. ఏ విధంగానూ అన్యాయం జరగకుండా చెయ్యడానికే సుప్రీం కోర్టు ఉద్దేశించబడింది.

కొన్ని రాష్ట్రాలలో అనేకం స్పెషల్ కోర్టులున్నాయి. ఉదాహరణకు, వారసులకు ఆస్తిని సమానంగా పంచిపెట్టే

బాధ్యతగల కోర్టులు ప్రొబేట్ కోర్టులు. పిల్లలు శాసనాలను ఉల్లంఘించి ప్రవర్తిస్తే వారిని విచారణ చేయడానికి స్పెషల్ కోర్టులున్నాయి. విడాకుల కేసులకు వేరే కోర్టులున్న రాష్ట్రాలు కూడా కొన్ని ఉన్నాయి.

కొన్ని రాష్ట్రాలలో జడ్జీలను ప్రజలు ఎన్నుకుంటారు. మిగిలిన వాటిలో వారిని గవర్నరులు నియమిస్తారు; లేదా, శాసన సభలు నియమిస్తాయి. పెద్ద కోర్టులలో జడ్జీల పదవీ కాలం ఆరు సంవత్సరాల నుంచి 15 సంవత్సరాల వరకు, లేదా ఇంకా ఎక్కువ కాలం ఉంటుంది. క్రింది కోర్టులలో అంతగా వుండదు.

## కోర్టులలో విధానం ; జూరీలు

అమెరికా కోర్టులలో అనుసరించబడే అనేక విధానాలు ఇంగ్లీషు కోర్టులనుంచి వచ్చినవి. ఏదైనా నేరమారోపించబడిన వ్యక్తికి జూరీల సమక్షంలో విచారణ చెయ్యబడడానికి హక్కువుంది. ఒకే నేరానికి ఏ వ్యక్తికూడా రెండుసార్లు శిక్షించబడకూడదు.

విచారణలలో రెండు రకాల జూరీలు నియమించబడుతారు. ఒక జూరీ వర్గాన్ని గ్రాండ్ జూరీ అనీ, రెండవ జూరీ వర్గాన్ని ట్రయల్ జూరీ లేదా పెటిట్ జూరీ అనీ వ్యవహరిస్తారు. ఒక వ్యక్తి మీద నేరమారోపించ వచ్చునో లేదో నిర్ణయించడానికి గ్రాండ్ జూరీని ఏర్పాటుచేస్తారు. గ్రాండ్ జూరీ సభ్యులలో అధిక సంఖ్యాకులు ఆ వ్యక్తి నేరంచేసినట్లు

సమ్మిసట్లయితే కేసు మోపబడుతుంది. తరువాత విచారణ జరపడానికి ట్రయల్ జూరీని ఏర్పాటుచేస్తారు. ట్రయల్ జూరీలో సాధారణంగా 12 మంది పౌరులుంటారు. కేసు వివరాలను విన్న తరువాత వారు ఆ వ్యక్తి దోషి అనో, నిర్దోషి అనో తీర్పుయిస్తారు. చాలా రాష్ట్రాలలో ట్రయల్ జూరీ సభ్యులు ఏకగ్రీవంగా తీర్పు చెప్పాలి. జూరీలకు సహాయ పడడానికి కోర్టు జడ్జి న్యాయ చట్టాలను వారికి వివరిస్తూంటాడు.

నేర మారోపించబడిన వ్యక్తి ప్లీడరును పెట్టుకో లేని వాడైతే ప్రభుత్వ వ్యయంతో అతడికి ప్లీడరును ఏర్పాటు చేస్తారు. ప్రభుత్వం తరఫున ప్రాసిక్యూటింగు అటార్నీ వాదిస్తాడు.

# 14

# నగర ప్రభుత్వం

ఫెడరల్ ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వానికి మధ్య ఎటువంటి సంబంధాలున్నాయో, రాష్ట్ర ప్రభుత్వానికి, నగర ప్రభుత్వానికి (మునిసిపాలిటీ) అనేక విషయాలలో అటువంటి సంబంధాలే ఉన్నాయి. నగర ప్రభుత్వాలు తమ హక్కులను రాష్ట్ర ప్రభుత్వాలనుంచి పొందుతాయి. అయినప్పటికీ అవి రాష్ట్రప్రభుత్వాలు ఎలా చెయ్యమంటే అలాగ చెయ్యనవసరంలేదు. వాటికి స్వాతంత్రాధికారం కలదు. ప్రతి నగర ప్రభుత్వానికి ఒక ప్రణాళిక ఉంటుంది. దానిలో ఆ నగర ప్రభుత్వాశయాలు, లక్ష్యాలు, అధికారాలు వివరించబడుతాయి.

నగర ప్రభుత్వం నిర్వహించవలసిన విధులు పరిమితమైనవి గనుక, నగరవాసుల అవసరాలనుబట్టి పరిపాలన జరుగుతుంది. అందుచేత, ఫెడరల్, రాష్ట్ర ప్రభుత్వాలవలె గాక, నగరప్రభుత్వం తన ప్రజల కైసందిన అవసరాలను, సౌకర్యాలను గమనిస్తూండాలి. వాటినిబట్టి అది తన విధిని నిర్వహించాలి. అమెరికా ఆర్థికాభివృద్ధికి, సాంఘికాభివృద్ధికి నగరాలు ప్రధానపాత్ర వహించిన కారణంచేత, అనేక రాష్ట్రాలలోని జనాభాకంటె నగరాలలోని జనాభా ఎక్కువ. 1940 లో న్యూయార్క్ నగరం జనాభా 74,00,000 మంది. కాని, అదే సంవత్సరంలో అంతకంటె ఎక్కువ జనాభాగల రాష్ట్రాలు మూడే ఉన్నాయి. మిగతా 45 రాష్ట్రాల జనాభా

అంతకంటె తక్కువ. 1940 లో 38 రాష్ట్రాలలో ఏ వొక దాని జనాభాకంటె కూడా షికాగోనగరం జనాభా ఎక్కువ.

ఎక్కువమంది జనులు నగరాలకు చేరిన కారణంచేత, ఒక్కొక్క రాష్ట్ర ప్రభుత్వంకంటె ఒక్కొక్క నగర ప్రభుత్వం పెద్ద సమస్యలను ఎదుర్కొనడం జరుగుతూంటుంది. "అమెరికా ప్రెసిడెంటు పదవి తరువాత కష్టతరమైన పదవి న్యూయార్కు మేయరుపదవి" అనే వారు. దానిలో కొంత నిజం లేకపోలేదు. అమెరికాలోని సగంమంది ప్రజలు నగర వాసులు. దానినిబట్టి నగర ప్రభుత్వాల పరిపాలన ఎంత ముఖ్యమైనదో తెలవగలదు.

## నగరప్రభుత్వ ఆశయం

మొత్తంమీద చూస్తే, ప్రజలు క్షేమంగా జీవించి, హాయిగా పనులు చేసుకోగల రీతిగా వ్యవహారాలను చక్క బెట్టడం నగర ప్రభుత్వ ఆశయం. అందుచేత, మునిసిపాలిటీ అధికారులు అనేక రంగాలలో పనులను పర్యవేక్షిస్తూ, తరుచు స్వయంగానే చర్యలు తీసుకుంటారు. లక్షలాదిజనులు నివసించే నగరాలలో సమస్త సౌకర్యాలు చెయ్యడానికి అత్యధికంగా ఏర్పాట్లు జరుగుతాయి. పెద్ద సిబ్బందిని సమ కూరుస్తారు. ఎన్నో కార్యాలయాలు నెలకొల్పబడుతాయి. ఉదాహరణకు, నగరవాసులకు పుష్కలంగా మంచినీరు లభించే ఏర్పాట్లు చెయ్యాలి. ప్రతియింటికి దానిని గొట్టాల ద్వారా అందించాలి. గృహనిర్మాణాలు జరగాలి. ఇటువంటి వన్నీ మునిసిపాలిటీ అధికారులు చెయ్యవలసినవి. ఈ పనులను

జయప్రదంగా నిర్వహించడానికి అనేకమంది టెక్నీషియన్లు, ఇంజనీర్లు నియమించబడుతారు.

**ఆరోగ్యరక్షణ కార్యాలయం :** నగరవాసులకు పరిశుభ్రమైన నీటిని సప్లయి చెయ్యడం ఎంత అవసరమో వారికి ఆరోగ్యం కలగగల పరిస్థితులను కలిగించడంకూడా అంత ముఖ్యం. అందుకు ఆహారపదార్థాలను అమ్మే దుకాణాలను పరిశీలించే సిబ్బంది ఉంటుంది. వారు మాంసం, ధాన్యాలు, రొట్టెలు, పాలు మొదలైనవాటిని తణిఖీచేసి, చెడిపోయినవాటిని ప్రజలకు అమ్మకుండా కట్టుదిట్టాలు చేస్తారు. అదే విధంగా కాఫీహొటళ్ళను, రొట్టెలు తయారుచేసే ఫ్యాక్టరీలను తణిఖీ చేస్తారు.

చాలా నగరాలలో ప్రభుత్వ వైద్యశాల లున్నాయి వాటిలో బడిపిల్లల ఆరోగ్యం పరీక్ష చెయ్యబడుతుంది. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్త వహించడానికి స్కూళ్ళలో ప్రత్యేకంగా నర్సులు నియమించబడుతారు. వైద్యపు ఖర్చులు భరించలేనివారికి ఈ వైద్యశాలల్లో ఉచితవైద్యం చెయ్యబడుతుంది కూడా.

నగరవాసుల ఆరోగ్యరక్షణకు ఇంచుమించు ప్రతి మునిసిపాలిటీ ఒక ఆరోగ్య కార్యాలయాన్ని నెలకొల్పింది. అంటువ్యాధులను నివారించడం ఆరోగ్య శాఖాధికారుల ప్రధాన బాధ్యతలలో ఒకటి. అంటువ్యాధి ప్రబలిన ప్రాంతాన్ని వారు బంధించివేసి, అక్కడి జనులకు చికిత్సచేసి,

ఇతర ప్రాంతాలకు అది వ్యాపించకుండా కట్టుదిట్టాలు చేస్తారు. అంటువ్యాధి ఎవరికైనా సోకినట్లు తమకు తెలియగానే వైద్యులందరూ మునిసిపల్ ఆరోగ్యాధికారులకు వెంటనే తెలియపరచాలి. ఆరోగ్యాధికారులు నగరంలో జననమరణాల లెక్కలను సేకరిస్తూ, వ్యాధులకు, మరణాలకు గల కారణాలను పరిశీలించి, తగు నివారణోపాయాలను అన్వేషిస్తారు.

నగరంలో చెత్తను, పెంటపోగులను తీసివెయ్యడానికి మునిసిపల్ అధికారులు శ్రద్ధవహించి, నగరాన్ని పరిశుభ్రంగా ఉంచడానికి, వ్యాధులు ప్రబలకుండా చెయ్యడానికి ప్రయత్నం చేస్తారు. కుళ్ళు నీళ్ళు పోవడానికి తూరలు నిర్మించబడుతాయి. నీరు నిలవ వుండకుండా ఏర్పాట్లు చేస్తారు. నగరం పరిశుభ్రంగా వుండడానికి, ప్రజలు హాయిగా జీవించడానికి అన్ని విధాలా చర్యలు తీసుకుంటారు. దుమ్ము, చప్పుళ్ళు, పొగ లేకుండా కట్టుదిట్టాలు చేస్తారు.

**రోడ్ల కార్యాలయం:** నగరంలో రోడ్ల నిర్మాణ బాధ్యత ఈ కార్యాలయానికి చెందినది. వీధులను పరిశుభ్రంగా వుంచడం, రోడ్లను బాగు చేయించడం, కొత్తరోడ్లను వేయించడం మొదలైన పనులను ఈ కార్యాలయం అధికారులు చేస్తారు. నగరంలో రవాణాలు, రాకపోకలు సులభంగా జరగడానికై బాగా అభివృద్ధి చెందిన నగరాలలోని అధికారులు నేలక్రింద మార్గాలు, అవసరమైనచోట్ల వంతెనలు మొదలైన వాటిని నిర్మిస్తూంటారు.

**పోలీసు డిపార్టుమెంటు :** నగర ప్రభుత్వ శాఖలలో సిటీ పోలీసు డిపార్టుమెంటు చాలా ముఖ్యమైనది. శాంతి భద్రతలను కాపాడడం, శాసనాలను ఉల్లంఘించే వారిని పట్టుకొనడం, దుర్మార్గుల బారినుంచి సన్మార్గులను కాపాడడం మొదలైనవి సిటీ పోలీసుల పనులు. ప్రతినగరం కొన్ని భాగాలక్రింద విభజించబడి, పోలీసువారి రక్షణక్రింద ఉంచబడుతుంది. ఆ యా భాగాలలోని పోలీసులు గస్తీ తిరుగుతుంటారు. రేడియోలు అమర్చబడిన పోలీసు మోటారు కారులుకూడా గస్తీ తిరుగుతాయి. ప్రతిభాగంలోను పోలీసు డిపార్టుమెంటుకు చెందిన గూఢచారులుకూడా పని చేస్తుంటారు.

పెద్ద నగరాలలోని పోలీసు కార్యాలయాలలో ఆరితేరిన గూఢచారు లుంటారు. వీరు పలురకాల నేరస్థులను పట్టు కొనడంలో అనుభవజ్ఞులు. అందుచేత, ఎటువంటి నేరస్థుల నైనా ఇట్టే పట్టుకో గలుగుతారు. సాధారణంగా, ఒక్కొక్క రకం నేరాలను గురించి అనుభవంవున్న గూఢ చారులు ఒక్కొక్కరు వుంటారు. మామూలు పోలీసులు కూడా అనేక ప్రత్యేక సందర్భాలలో నేరస్థులను పట్టుకో డానికి నియోగించబడుతారు.

పోలీసులుగా దృఢకాయులు మాత్రమే నియమించ బడుతారు. ప్రజలు అనుసరించ వలసిన శాసనాలు మొదలైన వాటి విషయంలోకూడా పోలీసులకు శిక్షణ యివ్వబడుతుంది.

**అగ్నిమాపక కార్యాలయం :** నగరాలలో అనేక యిళ్ళు వుంటాయి గనుక, అగ్ని ప్రమాదాలు సంభవించకుండా

జాగ్రత్తలు వహించడం ముఖ్యం. అందుచేత, చాలా నగర ప్రభుత్వాలు రెండు రకాల చర్యలు తీసుకుంటాయి. ఎక్కడా అగ్ని ప్రమాదాలు సంభవించడానికి అవకాశం లేకుండా చేస్తాయి. ఎవరైనా ఇల్లు కట్టదలచుకుంటే, మునిసిపాలిటీ అధికారులనుంచి పర్మిట్ పొందాలి. ఇంటి ప్లానును వారికి చూపాలి. నిబంధనల ప్రకారం ప్లాను సరిపోకపోతే పర్మిట్ యివ్వబడదు. నిప్పు అంటుకొనే సామగ్రితో ఇళ్ళు నిర్మించ రాదని నిబంధన లున్నాయి. ఎలక్ట్రిసిటీవల్ల అగ్ని ప్రమాదం సంభవించకుండా వైరింగు మొదలైనవి కట్టుదిట్టాలతో జరుప బడుతాయి. ఇదేవిధంగా తగినంత పెద్దవైన గుమ్మాలు ఉండా లనీ, ఇతర రక్షణ ఏర్పాట్లు ఉండాలనీ నిబంధనలున్నాయి.

అప్పుడప్పుడు తణిఖీ చెయ్యబడుతాయి. ఎలక్ట్రిక్ వైరింగు, చిమ్నీలు మొదలైనవి సరిగా ఉన్నాయో లేదో అధికారులు పరిశీలిస్తారు. నిప్పు అంటుకొనడానికి సులువైన పెట్రోలు, కర్రలు, నూనెలు మొదలైనవి దూరంగా ఉంచబడ్డాయో, లేదో తణిఖీ చెయ్యబడుతుంది. నిప్పు అంటుకొనే పెంటను, చిత్తుకాగితాలు మొదలైన వాటిని దూరంగా పారవేయ వలసిందని అనేక మునిసిపాలిటీలు ప్రజలను హెచ్చరిస్తూ ఉంటాయి.

వీటికి తోడు, ప్రతి మునిసిపాలిటీకూడా అగ్నిమాపక దళాన్ని అట్టే పెడుతుంది. దానిలో సుశిక్షితులైన వారుంటారు. నగరంలో అక్కడక్కడ అగ్నిమాపకదళాల స్థానాలుంటాయి. 24 గంటలూకూడా అవి సిద్ధంగా ఉంటాయి.

**విద్యా ప్రచార కార్యాలయం :** ప్రతి మునిసిపాలిటీలోను ఒక విద్యా ప్రచార కార్యాలయం ఉంటుంది. ఈ శాఖాధికారులు ఎలిమెంటరీ పాఠశాలలు మొదలుకొని హైస్కూళ్ళ వరకు నెలకొల్పి, వాటిని నడుపుతారు. కొన్ని నగరాలలో వయోజనులకు ప్రత్యేక పాఠశాలలు కూడా నెలకొల్పబడుతాయి. వృత్తి విద్యా పాఠశాలలు, చెవిటివారికి, గ్రుడ్డివారికి పాఠశాలలు మొదలైనవాటిని నడుపుతారు. గ్రంథాలయాలను, ఉపన్యాసాలివ్వడానికి మందిరాలను, ట్రెయినింగు స్కూళ్ళను కూడా నగర ప్రభుత్వాలు ఏర్పాటుచేసి ప్రజల విద్యాభివృద్ధికి తోడ్పడుతాయి.

**వ్యాధిగ్రస్తులకు, పేదలకు సహాయం :** అన్యథాశరణ్యం లేని వ్యాధిగ్రస్తులకు, వృద్ధులకు, నిస్సహాయులకు రక్షణ కల్పించడం నగర ప్రభుత్వాల విధి. అలాగే ఉన్మాదులకు, అనాధులకు, పేదలకు కూడా అవి సహాయపడగలవు. అనేక మునిసిపాలిటీ అధికారులు బాలాపరాధులను సక్రమ మార్గంలో పెట్టగల పద్ధతులను కూడా అనుసరిస్తున్నాయి.

**అభ్యుదయానికి సన్నాహాలు :** చాలా కాలం క్రితమే నిర్మించబడిన కొన్ని పెద్ద నగరాలు ఒక ప్లాను లేకుండా పెరిగిపోయాయి. ఈమధ్యనే నగరాల వృద్ధికి మంచి ప్లానులు అవసరమని గ్రహించబడింది. అందుచేత, ప్రతి మునిసిపాలిటీలోనూ ఒక ప్లానింగ్ డిపార్టుమెంటు ఉంటుంది. అది నగరాన్ని వృద్ధి చెయ్యడానికి వీలైన ప్లానులను తయారు చేస్తుంది. నీటి సప్లయి, రోడ్ల నిర్మాణం, విమానాశ్రయాల నిర్మాణం, గృహ

నిర్మాణం ఏ విధంగా జరగాలో ఈ కార్యాలయం వారు ప్లానులు రచిస్తుంటారు. నగరంలోని కొన్ని ప్రాంతాలు నివాస ప్రాంతాలనీ, కొన్ని వ్యాపార ప్రాంతాలనీ, కొన్ని పారిశ్రామిక ప్రాంతాలనీ వారు నిర్ణయించి, తద్విధంగా నిర్మాణాలు జరిగేటట్లు చూస్తారు. ఇప్పటి ప్రజలకు, భావి తరాలవారికి కూడా నగరం క్షేమం కూర్చేదిగా ఉండేటట్లు చెయ్యడం ఈ కార్యాయం వారి బాధ్యత.

**వినోద, విహార సౌకర్యాలు:** నగరాలలో ఇళ్ళు దగ్గర దగ్గరగా ఉంటాయి. నేల ఖరీదు ఎక్కువగా ఉంటుంది. అందు చేత, వినోద విహారాదులకు విశాలమైన ప్రాంతాలు కావాలంటే ప్రజలందరు సమష్టిగా చర్య తీసుకుంటేతప్ప సాధ్యపడదు. ఈనాటి అమెరికన్ మునిసిపాలిటీలు పెద్ద పార్కులను, ఆటస్థలాలను ఏర్పాటుచేసి, ప్రజలకు వినోద విహార సౌకర్యాలను సమకూరుస్తాయి. ఈత చెరువులను, క్రీడాస్థలాలను ఏర్పాటు చేస్తాయి. అనేక గ్రంథాలయాలు, మ్యూజియములు, చిత్రకళా ప్రదర్శనాలయాలు ఉంటాయి. ఇవన్నీ ప్రజలు ఉచితంగా ఉపయోగించుకో గలరు.

**కొన్ని ప్రయివేటు కంపెనీలు:** కొన్ని నగరాలలో ఇళ్ళకు గ్యాసు, ఎలక్ట్రిసిటీ, టెలిఫోన్‌లు సప్లయి చెయ్యడానికి, రాక పోకలకై బస్సులను నడపడానికి ప్రయివేటు కంపెనీలుంటాయి. అయితే, నగర ప్రభుత్వాలు వాటిని పరిశీలిస్తూ, అవి ప్రజలకు సక్రమంగా ఉపయోగ పడేలాగ చేస్తాయి. అయితే, కొన్ని నగరాలలో ఇవన్నీ మునిసిపాలిటీ స్వాధీనంలోనే ఉంటాయి.

# 15

# నగర ప్రభుత్వ నిర్మాణం

అమెరికాలోని నగర ప్రభుత్వాల నిర్మాణాలు వివిధ పద్ధతులలో జరుగుతాయి. అయితే, ప్రతి నగరంలోనుకూడా ప్రజాప్రతినిధులతో మాత్రమే ఏదో ఒక విధమైన నగర పరిపాలక వర్గం (మునిసిపల్ కౌన్సిల్) ఏర్పడుతుంది. వారే నగర పరిపాలనను సాగిస్తారు. పరిపాలకవర్గం నాయకుడుగా మేయరు, లేదా మేనేజరు ఉంటాడు. ప్రతి శాఖకు ఒక్కొక్క ప్రధానాధికారి ఉంటాడు. వారి క్రింద అనేకమంది ఉద్యోగులు పనిచేస్తారు.

నగర ప్రభుత్వాలు ఏర్పడే పద్ధతులు మూడున్నాయి. కొన్ని నగరాలలో వోటర్లు మేయరును, కౌన్సిలర్లను ఎన్నుకుంటారు. ఈ కౌన్సిలర్లనే ఆల్డర్‌మెన్ అని కూడా అంటారు. ఒక్కొక్క కౌన్సిలరు ఒక్కొక్క వార్డునుంచి ఎన్నుకోబడతాడు. అయితే, కొన్ని నగరాలలో వార్డుల ప్రకారం వోటింగు జరగదు. నగరంలోని వోటరులందరు కలిసి కౌన్సిలర్లను ఎన్నుకుంటారు. మరికొన్ని నగరాలలో వోటర్లు మునిసిపల్ అధికారులుగా ఉండేవారిని ఎన్నుకుంటారు. ఈ అధికారుల వర్గాన్ని కమిషన్ అంటారు. మరికొన్ని నగరాలలో ప్రజలు కౌన్సిలర్లను ఎన్నుకుంటారు. ఆ కౌన్సిలర్లు మేయరును ఎన్నుకుంటారు. ఈ మూడు పద్ధతులను క్రింది విధంగా వ్యవహరిస్తారు :

**మేయర్-కౌన్సిల్ పద్ధతి; కమిషన్ పద్ధతి; సిటీ-మేనేజరు పద్ధతి**

ఈ మూడు పద్ధతులనుంచి కొన్ని అంశాలను గ్రహించి తమ మునిసిపాలిటీలను ఏర్పాటు చేసుకొనే నగరాలుకూడా చాలా ఉన్నాయి.

## మేయర్-కౌన్సిల్ పద్ధతి

సుమారు 50 సంవత్సరాలక్రితంవరకు ఇంచు మించు అన్ని అమెరికన్ నగరాలలోనుకూడా మేయర్-కౌన్సిల్ పద్ధతి అనుసరించబడింది. అమెరికాలో ఇది అతి ప్రాచీన పద్ధతి. అనేక విధాల ఇది జాతీయ, రాష్ట్ర ప్రభుత్వ నిర్మాణ పద్ధతిని పోలినట్టిది. తరచు ప్రజలే మేయరును ఎన్నుకొని, ఆయనకు విశేషాధికారాలిస్తారు. అన్ని కార్యాలయాల ప్రధానులను, ఇతర అధికారులను మేయరు నియమిస్తాడు. అయితే, ముఖ్యమైన పదవులలో నియమించబడిన వారిని ఆమోదించడానికి, నిరాకరించడానికి కౌన్సిలుకు అధికారం ఉంది. కౌన్సిలు చేసిన తీర్మానాలను మేయరు సమ్మతించడానికి గాని, వీటో చెయ్యడానికి గాని అధికారం ఉంది. తీర్మానాలను అమలు జరిపే పూచీ మేయరుదే. ఒక్కొక్కప్పుడు మునిసిపల్ బడ్జెట్టును ఆయన తయారుచేసి, కౌన్సిలుకు అందజేస్తాడు. నగరవాసులనుంచి ఏ విధంగా పన్నులు వసూలుచెయ్యాలో, ధనాన్ని వేటికై ఖర్చుచెయ్యాలో ఆ విధంగా మేయరు సిఫారసు చేస్తాడు.

ఈ పద్ధతిగా ఏర్పడే నగర ప్రభుత్వంలో కౌన్సిలు అంటే శాసననిర్మాణ వర్గ మన్న మాట. కౌన్సిలులో తీర్మానాలు చెయ్యబడుతాయి. కాని, నగర ఆశయాల పత్రానికిగాని,

రాష్ట్ర, జాతీయ శాసనాలకుగాని విరుద్ధమైనవాటిని కౌన్సిలులో చెయ్యడానికి అధికారం లేదు. ప్రజలు ఎంత పన్ను చెల్లించాలో నిర్ణయించే అధికారం కౌన్సిలుది. మేయరు సహాయంతో కౌన్సిలు, ఏ పనికి ఎంత ధనాన్ని ఖర్చు పెట్టాలో, ఏ కార్యాలయం ద్వారా ఆ ఖర్చు జరగాలో నిర్ణయిస్తుంది.

## కమిషన్ పద్ధతి

మేయర్-కౌన్సిల్ పద్ధతికంటె ఇది కొత్తది. ఈ పద్ధతిగా ఏర్పడే నగర ప్రభుత్వానికి (మునిసిపాలిటీ) వోటర్లు ముగ్గురినో, అంతకంటె ఎక్కువమందినో కమిషనర్లను ఎన్నుకుంటారు. వీరిని సాధారణంగా నగరంలోని వోటరులందరూ కలిసి ఎన్నుకుంటారు. వార్డుల వారీగా ఎన్నుకోరు. నగరానికి సంబంధించిన శాసనాలను చెయ్యడానికి, వాటిని అమలు జరపడానికి కూడా వారికధికారం ఉంది. ఎంతపన్ను విధించాలో, ధనాన్ని ఏ విధంగా ఖర్చు చెయ్యాలో నిర్ణయిస్తారు. మునిసిపాలిటీ అధికారులు తణిఖీ చెయ్యవలసిన కంపెనీలకు పర్మిట్లను యిస్తారు. కమిషనర్లలో ఒకడు అధ్యక్షుడుగా ఎన్నుకోబడుతాడు. ఆయన్ని సాధారణంగా మేయర్ అంటారు. కాని, చాలా విషయాలలో ఇతర కమిషనర్లకంటె ఆయనకు ఎక్కువ అధికారా లుండవు.

నగర ప్రభుత్వ కార్యకలాపాలను చూడడానికి అనేక కార్యాలయా లుంటాయి. ప్రజల భద్రత, ప్రజాభ్యుదయం, ఆర్థిక వ్యవహారాలు, పార్కులు, మునిసిపాలిటీ ఆస్తిపాస్తులు

మొదలైన విషయాలలో అవి పనిచేస్తాయి. కమిషనర్లు ఈ కార్యాలయాల పనులను అజమాయిషీ చేస్తారు.

## సిటీ-మేనేజరు పద్ధతి

సిటీ—మేనేజరు పద్ధతి మొట్టమొదటిసారి 1908 లో వర్జీనియా రాష్ట్రనగరం స్టాన్‌టన్‌లో అనుసరించబడింది. ఆ తరువాత పలు నగరాలు దానిని అమలు జరిపాయి. ఈ పద్ధతిని అనుసరించే నగరాలలోని వోటర్లు కొలదిమంది కౌన్సిలర్లను ఎన్నుకుంటారు. వారు నగర శాసనాలనుచేసి, వాటిని అమలు జరుపుతారు. వోటర్లు కౌన్సిలర్లకు ఒక ముఖ్యమైన అధికారాన్ని యివ్వడం ఈ పద్ధతిలో ఉన్న విశిష్టత. నగర పరిపాలనలో మిక్కిలి అనుభవం కలిగి, సుశిక్షితుడైన ఒక ప్రభుత్వాధికారిని తమ కౌన్సిల్ నాయకుడుగా తెచ్చుకుంటారు. ఆ ప్రముఖుడు నగరంలోని వాడైనా కావచ్చు; బయటి వాడైనా కావచ్చు. తమకు అన్నివిధాలా నచ్చిన వ్యక్తిని రప్పించి, కౌన్సిల్ నాయకుడుగా చేసుకొంటారు. ఆయన్ని సిటీ మేనేజరు అంటారు. ఆయన వివిధ కార్యాలయాల ప్రధానోద్యోగులను, ఇతర ఉద్యోగులను నియమిస్తాడు.

కౌన్సిలుచేసిన శాసనాలను అమలు జరపడం సిటీ మేనేజరు బాధ్యత. నగర ప్రజలకు అవసరమైన పనులను ఆయన కౌన్సిలుకు నివేదించి, నగరాభివృద్ధికి ఏమి చెయ్యాలో, ధనాన్ని ఏ విధంగా ఖర్చుచెయ్యాలో ప్లానులు తయారు

చేస్తాడు. చాలా నగరాలలో కౌన్సిలుకు సమ్మతమైనంత కాలం మాత్రమే ఆయన సిటీ మేనేజరుగా ఉండగలడు.

ఏ క్షణంలోనైనా కౌన్సిలు సభ్యులు సిటీ మేనేజరును డిస్మిస్ చెయ్యగలరు. అందుచేత, నగర ప్రభుత్వంమీాద కంట్రోలు ప్రజల చేతిలోనే ఉన్నదన్నమాట. అంతేకాదు. కొన్ని నగరాలలో కౌన్సిలు సభ్యులను వోటర్లు తొలగించగల అధికారంకూడా ఉన్నది. మళ్ళా ఎన్నికలలో తమకు నచ్చని కౌన్సిలర్లకు ప్రజలు వోట్లు వెయ్యరనేదే కాక, నగర ప్రభుత్వాన్ని డిస్మిస్ చేసే అధికారం కూడా కలదు.

### సిటీ కోర్టులు

ప్రతి నగరంలోను ప్రత్యేకంగా కోర్టులున్నాయి. కొన్ని చోట్ల సిటీకోర్టు జడ్జీలను ప్రజలు ఎన్నుకుంటారు. మరికొన్ని చోట్ల వారిని సిటీ కౌన్సిలుగాని, కమిషన్‌గాని, రాష్ట్ర ప్రభుత్వపు గవర్నరుగాని, లేదా ప్రజలు అధికార మిచ్చిన మరొక వర్గంగాని నియమించడం జరుగుతుంది. పెద్ద నగరాలలో సివిల్, క్రిమినల్ కేసులను విచారణ చెయ్యడానికి వేర్వేరు సిటీ కోర్టు లుంటాయి.

### శాసనాలు చెయ్యగల అధికారాలు

నగర ప్రభుత్వాలుచేసే శాసనాలు అనేక రకాలున్నాయి. కొన్ని నగరప్రభుత్వ నిర్మాణ పద్ధతికి చెందినవి; మిగిలినవి పన్నులు, రోడ్లు, కార్యాలయాల ఖర్చులు మొదలైన వాటికి చెందినవి. నీటి సప్లయి, కుళ్ళు నీటి తూములు, ఆరోగ్య రక్షణ

మొదలైన విషయాలను గురించికూడా సిటీ కౌన్సిలు శాసనాలను చెయ్యగలదు.

సాధారణంగా నగరానికి ఎలక్ట్రిసిటీ, గ్యాసు, టెలిఫోనులు, బస్సులు మొదలైన అవసరాలను తీర్చడానికి ప్రయివేటు కంపెనీ లుంటాయి. వీటిలో ప్రతి కంపెనీకూడా నగర ప్రభుత్వం నుంచి అనుమతిని పొందాలి.

# 16

# ఇతర స్థానిక ప్రభుత్వాలు

అమెరికా జనాభా ఇంతగా పెరగని పూర్వకాలంలో నగరాలు మొదలైనవి దూర దూరంగా ఉండేవి. అవి వ్యక్తులపరిపాలన క్రిందనో, చిన్న సంఘాల పరిపాలన క్రిందనో ఉండేవి. ఈ నాడు ప్రభుత్వం చేస్తున్న పనులను ఆ నాడు ఆ వ్యక్తులో, సంఘాలో చెయ్యడం జరిగింది. పదమూడు కాలనీలుగల రోజులలో నగరాలలో పోలీసులు బహు కొలదిమంది ఉన్నారు; లేరనే చెప్పవచ్చుకూడా. ప్రజలే తమ ఆస్తిపాస్తుల రక్షణకై చర్యలు తీసుకొనేవారు. నగర ప్రభుత్వాలు వీధులలో దీపాలను పెట్టడానికిగాని, వీధులను బాగుచేయించ డానికిగాని చర్యలు తీసుకోలేదు. తమకుగల అవసరాల నన్నింటినీ ప్రజలే తీర్చుకొనేవారు.

ఈనాడు చిన్న పట్టణాలలో నయితం ప్రజలు తమ కవసరమైన వాటినన్నింటినీ ప్రభుత్వంచేత చేయిస్తారు. తాము స్వయంగా చేసుకొనడం కంటె, ప్రభుత్వంచేత చేయించడానికి పన్నులు కట్టడానికైనా ఇష్టపడుతారు. తమ స్థానిక ప్రభుత్వమే వీధులలో దీపాలను ఏర్పాటు చెయ్యాలనీ, వీధులను బాగుచేయించాలనీ అడుగుతారు. తమ గృహాలను రక్షించడానికి పోలీసు దళాలను ఏర్పాటు చెయ్యాలనీ, శాసనాలను ఉల్లంఘించే వారిని అరెస్టు చెయ్య డానికి షెరిఫ్‌ను నియమించాలనీ, క్షేమంగా జీవించగల ఇతర సదుపాయాలను చెయ్యాలనీ ప్రజలు ప్రభుత్వాన్ని కోరుతారు.

వీటన్నింటినీ గ్రామ, పట్టణ, తాలూకా (కౌంటీ) ప్రభుత్వాలు చేస్తాయి. ఒకొక్క తాలూకాలో సాధారణంగా కొలది పట్టణాలు, అనేక గ్రామాలు ఉంటాయి. గ్రామ, పట్టణ ప్రభుత్వాలు అన్నింటికంటె చిన్నవి.

## తాలూకా (కౌంటీ) ప్రభుత్వం

తాలూకా ప్రభుత్వం చెయ్యవలసిన పను లనేకం ఉన్నాయి. వాటిలో కొన్ని యివి :

స్థానిక ప్రభుత్వాల ఎన్నికలను జరిపడం ; రాష్ట్ర, జాతీయ ప్రభుత్వాల ఎన్నికలను జరపడానికి సహాయపడడం.

సివిల్, క్రిమినల్ కేసులు విచారణ చేసి తీర్పులిచ్చే కోర్టులను ఏర్పరచడం ; విల్లులు మొదలైన వ్యవహారాలు చూచే రిజస్ట్రేషన్ ఆఫీసులను ఏర్పరచడం.

తాలూకా ప్రభుత్వవ్యయానికై పన్నులు విధించి వసూలు చెయ్యడం; ఇతర ప్రభుత్వాల తరఫున విధించబడిన పన్నులు వసూలు చెయ్యడం.

రాష్ట్ర ప్రభుత్వంనుంచి తరచు ధనసహాయం పొందుతూ, పాఠశాలలను నెలకొల్పడం.

తాలూకాలో జనన మరణాల లెక్కలను, వివాహాల లెక్కలను జాగ్రత్త పరచడం.

ముఖ్యమైన పత్రాలను ప్రజలకోసం అట్టేపెట్టడం. ఇవి ఆస్తి పాస్తులకు సంబంధించిన విల్లులు, సివిల్

కేసులకు కావలసిన పత్రాలు, తణఖా పత్రాలు మొదలైనవి.

పేదల, వృద్ధుల, అనాథుల రక్షణకోసం సాధారణంగా శరణాలయాలను నెలకొల్పడం.

ప్రజల ఆరోగ్య, పారిశుద్ధ్య రక్షణకోసం శ్రద్ధ వహించడం.

కొన్ని పనుల విషయంలో లైసెన్సులను, పర్మిట్లను యివ్వడం.

రోడ్డుల నిర్మాణంలోను, వాటిని బాగుచేయించడంలోను తనవంతు బాధ్యతను నిర్వహించడం.

సాధారణంగా ఒక తాలూకా కోర్టును, జెయిలును నెలకొల్పడం; ప్రభుత్వ భవనాలను భద్రపరచడం.

ప్రతి తాలూకాకు ఒక ముఖ్య పట్టణం ఉంటుంది. అది తాలూకా కేంద్రం. తాలూకా ప్రభుత్వాధికారులు అక్కడి తాలూకా ఆఫీసులో ఉంటారు.

తాలూకా ప్రభుత్వ నిర్వహణకు సాధారణంగా ఒక కమిషనర్ల సంఘమో, సూపర్‌వైజర్ల సంఘమో ఉంటుంది. సంఘంలో సభ్యులు తక్కువ మందైనా ఉంటారు; ఎక్కువ మందైనా ఉంటారు. తక్కువ మందివుంటే, తాలూకాలోని వోటరు లందరిచేత ఎన్నుకోబడిన వారితో కూడినదన్న మాట; ఎక్కువ మందివుంటే, తాలూకాలోని పట్టణాల ప్రతినిధులతో కూడినదన్న మాట.

తాలూకా ప్రభుత్వాధికారులలో కొందరు ఒక్కొక్కప్పుడు నియమించబడడం, ఒక్కొక్కప్పుడు ఎన్నుకోబడడం జరుగుతుంది. వారి అధికారాలు, విధులు రాష్ట్ర ప్రభుత్వ చట్టంవల్ల పరిమితం చెయ్యబడుతాయి.

**ప్రాసిక్యూటింగ్ అటార్నీలు-షెరిఫ్‌లు-కోరనర్‌లు :** తాలూకా ప్రభుత్వాధికారులలో ముఖ్యులైన వారిలో ఒకడు ప్రాసిక్యూటింగ్ అటార్నీ. శాసనాలను అమలు పరచడం ఆయన బాధ్యత. ప్రభుత్వ శాసనాన్ని అనుసరించని నేరస్థులమీద కేసులు పెట్టడానికి ఆయన సహాయపడాలి. కోర్టులో ప్రజల పక్షాన ఆయన వాదించి, నేరస్థునికి శిక్షపడేటట్లు ప్రయత్నిస్తాడు.

అంత ముఖ్యంగాని కేసులు క్రింది కోర్టులో విచారణ చెయ్యబడుతాయి. ఈ కోర్టు న్యాయమూర్తి "జస్టిస్ ఆఫ్ ది పీస్." ఆయన సాధారణంగా పట్టణ ప్రజలచేత ఎన్నుకోబడుతాడు.

తాలూకా ప్రభుత్వంలో మరొక ముఖ్యమైన అధికారిని షెరిఫ్ అంటారు. ఆయన తాలూకా అంతటికీ పెద్ద పోలీసు అధికారి. ప్రజలకు భద్రత కూర్చవలసిన పూచీ ఆయనదే. దుర్మార్గులను పట్టుకొని జెయిలులో పెడుతాడు. తాలూకా జెయిలును పర్యవేక్షించడం, కోర్టుకు హాజరు కావలసిన సాక్షులకు, జూరీలకు నోటీసులు పంపడం, పన్నులు చెల్లించని వారి ఆస్తులను జప్తుచెయ్యడం మొదలైన పనులన్నీ ఆయన చెయ్యవలసినవే.

నేరస్థుని పట్టుకోవడంలో తనకు సహాయపడాలని ఎవరి నైనా ఆజ్ఞాపించడానికి షెరిఫ్‌కు అధికారం ఉంది. అదే విధంగా శాంతి భద్రతలను కాపాడడానికి తనకు సహాయ పడాలని కూడా ఎవరికైనా సరే ఉత్తరువు చెయ్యగలడు. అవసరమైతే గవర్నరును కూడా కోరగలడు. అప్పు డాయన రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన సైనికదళాలను ఆ తాలూకాకు పంపి, శాంతి భద్రతలను నెలకొల్పుతాడు.

ఎవరైనా హత్య చెయ్యబడ్డారని అనుమానం కలిగి నప్పుడు, అటువంటి కేసులను గురించి పంచాయతీ జరిపే అధికారి పేరు కోరనర్. మరణకారణాలను గురించి విచారణ జరపడానికి ఆయన కొందరు పెద్దమనుష్యులను జూరీలుగా పిలుస్తాడు.

**తాలూకా కోశాధికారులు - ఆడిటర్లు - అసెసర్లు :** తాలూకా ప్రభుత్వం ఆదాయ వ్యయాలు కోశాధికారి ద్వారా జరుగుతాయి. ఒకొక్కచోట కోశాధికారికి అసిస్టెంటు కలెక్టర్లు ఉంటారు. రాష్ట్ర, నగర, పట్టణ ప్రభుత్వాల వంతుకు రావలసిన పన్నుల ధనాన్ని వాటికి పంపుతారు.

తరచుగా ప్రతితాలూకా ప్రభుత్వానికి ఒక ఆడిటరు ఉంటాడు. కోశాధికారియొక్క ఆఫీసులోగల జమా ఖర్చుల లెక్కలను ఆయన తణిఖీ చేస్తాడు.

కొన్ని తాలూకా ప్రభుత్వాలలో అసెసర్లు ఉంటారు. తాలూకాలో ఏ ఆస్తిమీద ఎంత పన్ను వసూలుకావాలో

మొదలైన లెక్కలను అంచనా వెయ్యడం వారి విధి. అందువల్ల, తాలూకాలో ఎవరిదగ్గరనుంచి ఎంత పన్ను వసూలు కావలసివుందో కోశాధికారి మొదలైనవారు లెక్కలు తేల్చుకోగలరు.

తమ ఆస్తి పాస్తులను గురించి అసెసర్లు తప్పుడు అంచనాలు వేశారనీ, తమ వద్దనుంచి అన్యాయంగా ఎక్కువ పన్ను వసూలు చేస్తున్నారనీ కొందరు అప్పీలు చేస్తుంటారు. అటువంటి కేసులను ఒక స్పెషల్ బోర్డుగాని, కొందరు అధికారులతో కూడిన వర్గంగాని విచారణ చెయ్యడం జరుగుతుంది. తత్ఫలితంగా ఆ వ్యక్తులు చెల్లించే పన్నులను తగ్గించడమో, అసెసర్ల అంచనాలతో ఏకీభవించడమో, లేదా పన్నులను ఇంకా హెచ్చించడమో జరుగుతూంటుంది.

తాలూకాలో జనన మరణాల, వివాహాల లెక్కలను ఒక గుమాస్తా జాగ్రత్త పెడతాడు. రిజిస్టరు పత్రాల నకళ్ళను, ఇతర ప్రభుత్వపత్రాల నకళ్ళను కూడా ఆ గుమాస్తా భద్ర పరుస్తాడు. ప్రజలు వీటిని ఎప్పుడు కావలసినా చూచుకో వచ్చును. ఇవి ప్రజలకోసమే దాచబడుతాయి.

చాలా తాలూకాలలో స్కూళ్ళ సూపరెంటు ఉంటాడు. పాఠశాలలను తణిఖీ చెయ్యడం, తగిన ఉపాధ్యాయులను నియమించడం, రాష్ట్రప్రభుత్వపు స్కూళ్ళ సూపరెంటుతో సహకరించడం ఆయన విధులు. ఆరోగ్యాధికారులు, అనాథుల రక్షణకై చర్యలు తీసుకొనే అధికారులు, రోడ్లు వేయించే అధికారులు, ఇంకా ఇతర అధికారులు కూడా ఉంటారు.

ప్రతి తాలూకాకు కనీసం ఒక కోర్టుఅయినా ఉంటుంది. ఆకోర్టు నిర్వహణకు కనీసం ఒక జడ్జి, ఇతర అధికారులు ఉంటారు. కోర్టు భవనం తాలూకాప్రభుత్వానికి చెంది వుంటుంది. జడ్జీలు ఆ తాలూకాలోనే నివసించినవారు కానవసరంలేదు. కొన్ని రాష్ట్రాలలో కొన్ని తాలూకాలకు ఒక జడ్జి చొప్పున నియమించబడుతాడు. జడ్జీలను కొన్ని రాష్ట్రాలలో గవర్నర్లు, కొన్ని రాష్ట్రాలలో శాసనసభలు నియమించడం కలదు. మరికొన్ని రాష్ట్రాలలో వోటర్లు ఎన్నుకుంటారు.

## కౌంటీ మేనేజరు పద్ధతి

ఇటీవలి సంవత్సరాలలో కొన్ని తాలూకా ప్రభుత్వాల నిర్మాణపద్ధతి మార్పుచెయ్యబడింది. ఈ తాలూకాలలోని వోటర్లు కొలదిమంది కమిషనర్లను ఎన్నుకుంటారు. వారు తమకు నచ్చిన ఒక మేనేజరును తెచ్చుకొంటారు. ఆడిటరును, అటార్నీనికూడా కమిషనర్ల బోర్డువారే ఏర్పాటు చేసు కుంటారు. ఇంచుమించు మిగిలిన ఉద్యోగులనందరనూ మేనేజరు నియమిస్తాడు. తాలూకా వ్యవహారాల కన్నింటికి ఆయనే బాధ్యుడై వుంటాడు.

## గ్రామ, పట్టణ ప్రభుత్వాలు

న్యూ ఇంగ్లండు రాష్ట్రాలలోని కొన్ని పట్టణాలలో వోటర్లు కనీసం సంవత్సరాని కొకసారి అయినా సమావేశమై, తమ రోడ్లు, వంతెనలు, వీధులు, పాఠశాలలు మొదలైె వాటిని గురించి సొంతంగా శాసనాలు చేసుకుంటారు. పన్నులను

వారే నిర్ణయించి, ఆ ధనాన్ని ఎలాగ ఖర్చు చెయ్యడమో కూడా తీర్మానిస్తారు. ఈ శాసనాలను అమలుపరచడానికి మాత్రం అధికారులను ఎన్నుకుంటారు. ప్రత్యక్ష ప్రజా స్వామిక విధానంలో వుండే మంచి లక్షణాలకు ఇదొక ఉదాహరణ. ప్రజలే స్వయంగా శాసనాలు చేసుకుంటారు గాని ఏ ప్రతినిధులకు అప్పగించరు.

న్యూ ఇంగ్లండు రాష్ట్రాలలోని ఇతర పట్టణాలలోను, అమెరికా అంతటా తక్కిన పట్టణాలలోను కూడా న్యాయాధికారులు, పోలీసు అధికారులు, రోడ్ల సూపర్ వైజర్లు ఎన్నుకోబడుతారు. పట్టణ వ్యవహారాలను సాగించడానికై ప్రజలు వారికి అధికారమిస్తారు.

కొన్ని రాష్ట్రాలలోని పట్టణ ప్రభుత్వాల విధి ఎన్నికల సమయాలలో సహాయపడడం మాత్రమే.

గ్రామంగాని, పట్టణంగాని ఒక చిన్న నగరంవంటిది. తాము స్థానిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోదలచామని గ్రామవాసులు, లేదా పట్టణవాసులు రాష్ట్ర ప్రభుత్వానికి తెల్పుకుంటారు. రాష్ట్రప్రభుత్వం అంగీకరించినట్లయితే స్థానిక ప్రభుత్వాన్ని నెలకొల్పుకో గలుగుతారు.

గ్రామ, పట్టణ ప్రభుత్వాలు కేవలం స్థానికావసరాలను తీర్చుకోడానికి మాత్రమే చర్యలు తీసుకుంటాయి. సాధారణంగా అవి యివి :

వీధులను బాగుచేయించడం ; దీపాలు పెట్టడం ;
మంచి నీటిని సప్లయి చెయ్యడం ;

పోలీసులను ఏర్పాటు చెయ్యడం; అగ్ని ప్రమాదాలను నివారించడం;

స్థానిక ఆరోగ్య రక్షణకు చర్యలు తీసుకోవడం;

పంటపోగులు మొదలైన వాటిని తీసివేసే ఏర్పాటులు చెయ్యడం;

మంచి పాఠశాలలను నెలకొల్పడానికి రాష్ట్ర తాలూకా ప్రభుత్వాలతో, విద్యాధికారులతో సహకరించడం;

ఈ పనులు చెయ్యడానికి పన్నులు విధించడం.

గ్రామప్రభుత్వంగాని, పట్టణప్రభుత్వంగాని సాధారణంగా కొలదిమంది ప్రతినిధుల అధికారంలో వుంటుంది. ఒక్కొక్క చోట దానిని "ధర్మకర్తల బోర్డు" అంటారు. ప్రతినిధులను ప్రజలు ఎన్నుకుంటారు. కొన్ని గ్రామాలు, పట్టణాలు ప్రెసిడెంటును, లేదా మేయరును ఎన్నుకుంటాయి. ఆయనకు ప్రత్యేకాధికారాలు యిస్తాయి. ఆఫీసులలో పనులకు ఆయన గుమాస్తాలను, ఆరోగ్యాధికారులను, పోలీసు ఉద్యోగులను నియమిస్తాడు.

# 17

# ప్రభుత్వం సౌకర్యాలు చెయ్యాలంటే పన్నులు అవసరం

గ్రామ ప్రభుత్వం మొదలుకొని ఫెడరల్ ప్రభుత్వం వరకుగల ప్రభుత్వాలు ప్రజలకు సౌకర్యాలు చెయ్యడానికి తగినంతగా ధనవ్యయం అవుతుంది. ప్రజలకోసం తన విధులను నిర్వర్తించడానికై ఫెడరల్ ప్రభుత్వం ఇరవై లక్షలమంది ఉద్యోగులచేత పనులు చేయిస్తూంది. రాష్ట్ర, నగర, స్థానిక ప్రభుత్వాలలో వేలకొలది ఉద్యోగులు పని చేస్తున్నారు. పాఠశాలలు స్థాపించడానికీ, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికీ, వృద్ధాప్యంలో ధనం వచ్చేలాగ కార్మికులను ఇన్సూరు చెయ్యడానికీ, ధాన్యాల ధరలు హెచ్చిపోకుండా చేసే నిమిత్తం సబ్సిడీలు యివ్వడానికీ, ఇటువంటి ఇతరపనులు చెయ్యడానికీ పెద్ద ధనం అవసరమవుతుంది.

ఈ ఖర్చులకు తోడు, ద్వితీయ ప్రపంచ యుద్ధంలో ప్రభుత్వం చేసిన ఋణాలను తీర్చడానికీ, విదేశాలకు సహాయం చెయ్యడానికీ, ఇతర ఖర్చులకూ బోలెడు ధనం కావాలి.

ప్రెసిడెంటు 1949 జూలై 1వ తేదీన బడ్జెటులో తెల్పిన వ్యయం మొత్తం 42,00,00,00,000 డాలర్లు. ఈ ధనంకోసం అనేక విధాలయిన పన్నులు విధించబడుతాయి. అయితే, వీటిని చెల్లించేవారు అమెరికా ప్రజలు. పన్నులలో ఎటువంటి మార్పులున్నా చెల్లించేవారిలో మార్పులేదు. ప్రజలే చెల్లించాలి.

పన్నులు చెల్లించడమంటే ప్రజలకు బాధ అనిపించడం ప్రాచీనకాలంనుంచి ఉన్నదే. ప్రపంచంలోని ఇతర దేశాల ప్రజల వంటివారే అమెరికనులు కూడా. అందుచేత, పన్నులు చెల్లించడానికి వారుకూడా సణుక్కుంటూనే ఉంటారు. అమెరికన్ కాలనీలు బ్రిటిష్ పరిపాలనలో వుండగా చిచ్చును పుట్టించినది టీ మీాద విధించబడిన పన్ను. బ్రిటిష్ రాజు పన్ను విధించగా, అమెరికా ప్రజలు అది అన్యాయమని ప్రతిఘటించారు. తత్ఫలితంగా అమెరికా స్వాతంత్ర్య యుద్ధాగ్ని రగుల్కొన్నది. అమెరికా చరిత్రలో ప్రస్తుతం జరుగుతున్నంత ప్రభుత్వవ్యయం ఎన్నడు లేనిది. అందుకై ప్రజలు అత్యధికంగా పన్నులు చెల్లిస్తున్నారు. ప్రపంచ సముద్ధరణకు అవుతున్న వ్యయంలో పెద్దభాగాన్ని అమెరికా ప్రజలు వహిస్తున్నారు. దీనినిబట్టి, వారు స్వపరిపాలనా విధానంగల తమ ప్రభుత్వం పట్ల ఎటువంటి విశ్వాసం కలిగి వున్నారో ద్యోతకం కాగలదు; ప్రపంచంలోని స్వతంత్ర రాజ్యాల ప్రజలు స్వయం సమృద్ధిని సాధించడానికి అమెరికా ప్రజలు ఎంతగా సహాయపడదలచారో విదితం కాగలదు కూడా.

ప్రజలలో కొన్ని వర్గాలవారికి మితిమీారిన భారమనిపించకుండా, ప్రజల కొనుగోలుశక్తి హరించకుండా, వర్తక సరళి దెబ్బ తినకుండా తమ దేశీయ అవసరాలకు, విదేశాలకు సహాయాలకు ధనం కూర్చడమనేది మహా కష్టతర సమస్య. ప్రభుత్వంలోని వివిధ శాఖలవారు బడ్జెట్టులను తయారు చేసుకొనడం ద్వారా ఆ సమస్యను ఎదుర్కొంటారు. ప్రతి

కార్యాలయ ప్రధానాధికారి కూడా (ప్రెసిడెంటు, గవర్నరు, లేదా మేయరు) వచ్చే సంవత్సర వ్యయాన్ని జాగ్రత్తగా అంచనా వేయిస్తాడు. అందుకు సాధారణంగా ఆర్థిక శాస్త్ర నిపుణులు సలహాలిస్తారు. వృథా ఖర్చులుగాని, అనవసరపు ఖర్చులుగాని లేకుండా జాగ్రత వహిస్తారు. తరువాత, ఆ ధనాన్ని ఏవిధంగా సమకూర్చడమో ఆలోచన చేస్తారు. ఈ విధంగా తయారైన ఫెడరల్ బడ్జెట్టు కాంగ్రెసులోని ప్రతినిధుల సభ అనుమతికై పంపబడుతుంది. దానిలో బడ్జెట్టులోని ప్రతి అంశము సూక్ష్మంగా పరిశీలించబడుతుంది.

కాంగ్రెసులోని కేటాయింపుల సంఘంవారు బడ్జెట్టులోని ఖర్చులను గురించి వివరంగా సాక్ష్యాలు గ్రహిస్తారు. చిన్నఖర్చులను, పెద్దఖర్చులనుకూడా సూక్ష్మంగా పరిశీలిస్తారు. తరువాత, కేటాయింపుల సంఘం సిఫారసులు ప్రతినిధుల సభకు పంపబడుతాయి. బడ్జెట్టు ప్రతిపాదనలను ఆమోదించే అధికారం ప్రతినిధుల సభవారిదేనని ఇంతకు ముందొక అధ్యాయంలో వివరించబడింది. రాష్ట్రాల విషయంలో గవర్నర్లు, రాష్ట్ర శాసన సభలు, మేయరు మొదలైనవారు ఇటువంటి బడ్జెట్టులను గురించి చర్యలు తీసుకుంటారు.

## ప్రభుత్వాదాయ మార్గాలు

వేర్వేరు విధాలుగా పన్నులను విధించడం ద్వారా ఫెడరల్ ప్రభుత్వానికి ఆదాయం రాగలదు. పెద్దమొత్తాలుగా ధనం వచ్చే పన్ను లివి :

పన్నులు చెల్లించడమంటే ప్రజలకు బాధ అనిపించడం ప్రాచీనకాలంనుంచి ఉన్నదే. ప్రపంచంలోని ఇతర దేశాల ప్రజల వంటివారే అమెరికనులు కూడా. అందుచేత, పన్నులు చెల్లించడానికి వారుకూడా సణుక్కుంటూనే ఉంటారు. అమెరికన్ కాలనీలు బ్రిటిష్ పరిపాలనలో వుండగా చిచ్చును పుట్టించినది టీ మీద విధించబడిన పన్ను. బ్రిటిష్ రాజు పన్ను విధించగా, అమెరికా ప్రజలు అది అన్యాయమని ప్రతిఘటించారు. తత్ఫలితంగా అమెరికా స్వాతంత్ర్య యుద్ధాగ్ని రగుల్కొన్నది. అమెరికా చరిత్రలో ప్రస్తుతం జరుగుతున్నంత ప్రభుత్వవ్యయం ఎన్నడు లేనిది. అందుకై ప్రజలు అత్యధికంగా పన్నులు చెల్లిస్తున్నారు. ప్రపంచ సముద్ధరణకు అవుతున్న వ్యయంలో పెద్దభాగాన్ని అమెరికా ప్రజలు వహిస్తున్నారు. దీనినిబట్టి, వారు స్వపరిపాలనా విధానంగల తమ ప్రభుత్వం పట్ల ఎటువంటి విశ్వాసం కలిగి వున్నారో ద్యోతకం కాగలదు; ప్రపంచంలోని స్వతంత్ర రాజ్యాల ప్రజలు స్వయం సమృద్ధిని సాధించడానికి అమెరికా ప్రజలు ఎంతగా సహాయపడదలచారో విదితం కాగలదు కూడా.

ప్రజలలో కొన్ని వర్గాలవారికి మితిమీరిన భారమనిపించకుండా, ప్రజల కొనుగోలుశక్తి హరించకుండా, వర్తక సరళి దెబ్బ తినకుండా తమ దేశీయ అవసరాలకు, విదేశాలకు సహాయాలకు ధనం కూర్చడమనేది మహా కష్టతర సమస్య. ప్రభుత్వంలోని వివిధ శాఖలవారు బడ్జెట్టులను తయారు చేసుకొనడం ద్వారా ఆ సమస్యను ఎదుర్కొంటారు. ప్రతి

కార్యాలయ ప్రధానాధికారి కూడా (ప్రెసిడెంటు, గవర్నరు, లేదా మేయరు) వచ్చే సంవత్సర వ్యయాన్ని జాగ్రత్తగా అంచనా వేయిస్తాడు. అందుకు సాధారణంగా ఆర్థిక శాస్త్ర నిపుణులు సలహాలిస్తారు. వృథా ఖర్చులుగాని, అనవసరపు ఖర్చులుగాని లేకుండా జాగ్రత వహిస్తారు. తరువాత, ఆ ధనాన్ని ఏవిధంగా సమకూర్చడమో ఆలోచన చేస్తారు. ఈ విధంగా తయారైన ఫెడరల్ బడ్జెట్టు కాంగ్రెసులోని ప్రతినిధుల సభ అనుమతికై పంపబడుతుంది. దానిలో బడ్జెట్టులోని ప్రతి అంశము సూక్ష్మంగా పరిశీలించబడుతుంది.

కాంగ్రెసులోని కేటాయింపుల సంఘంవారు బడ్జెట్టు లోని ఖర్చులను గురించి వివరంగా సాక్ష్యాలు గ్రహిస్తారు. చిన్నఖర్చులను, పెద్దఖర్చులనుకూడా సూక్ష్మంగా పరిశీలిస్తారు. తరువాత, కేటాయింపుల సంఘం సిఫారసులు ప్రతినిధుల సభకు పంపబడుతాయి. బడ్జెట్టు ప్రతిపాదనలను ఆమోదించే అధికారం ప్రతినిధుల సభవారిదేనని ఇంతకు ముందొక అధ్యాయంలో వివరించబడింది. రాష్ట్రాల విషయంలో గవర్నర్లు, రాష్ట్ర శాసన సభలు, మేయరు మొదలైనవారు ఇటువంటి బడ్జెట్టులను గురించి చర్యలు తీసుకుంటారు.

## ప్రభుత్వాదాయ మార్గాలు

వేర్వేరు విధాలుగా పన్నులను విధించడం ద్వారా ఫెడరల్ ప్రభుత్వానికి ఆదాయం రాగలదు. పెద్దమొత్తాలుగా ధనం వచ్చే పన్ను లివి :

**ఆదాయం పన్ను :** వ్యక్తుల ఆదాయాలమీద, వ్యాపార సంస్థల మీద ఈ పన్ను విధించ బడుతుంది. ఆదాయాన్ని బట్టి పన్ను విధింపు జరుగుతుంది. వారి వారి శక్తికి మించిన పన్నును విధించరాదని ప్రభుత్వం తలపోస్తుంది. పన్నులు చెల్లించేవారికి కష్టం కలగకుండా చెయ్యడానికై ఆ యా వ్యక్తుల కుటుంబాలను బట్టి, ఖర్చులను బట్టి, వ్యాపార సంస్థలకు కలిగేనష్టాలనుబట్టి పన్నులలో కొంత భాగాన్ని తగ్గిస్తారు కూడా.

**వారసత్వం పన్ను :** పెద్ద ఆస్తి పాస్తులకు వారసులైన వారిమీద ఈ పన్ను విధించబడుతుంది. ఒకరు ఇంకొకరికి చాలా ధనాన్ని గాని, ఆస్తిని గాని దానంచేసినా, బహుమాన మిచ్చినా కూడా ఈ పన్నును విధిస్తారు.

**ఎక్సైజు పన్ను :** పరిశ్రమలలో తయారయ్యే ఆహార పదార్థాలమీద, మద్యపానీయాలమీద, సిగరెట్లమీద, చీట్ల పేకలమీద, ఎలక్ట్రిక్ బల్బులమీద ఇది విధించబడుతుంది.

**కష్టమ్సు పన్ను :** విదేశాలనుంచి దిగుమతి అయిన సరకుల మీద విధించబడే పన్ను.

**కార్పొరేషన్ పన్ను :** పెద్దకంపెనీలమీద విధించబడే పన్ను.

**వినోదాల పన్ను :** సినిమాలు, నాటకాలు మొదలైన వాటిని చూచే ప్రేక్షకుల మీద, నగలు, సబ్బులు, ఫేస్ పౌడర్లు మొదలైన విలాస వస్తువులమీద ఈ పన్ను విధించ బడుతుంది.

ట్రాన్స్‌ఫర్ పన్ను : స్టాకులను, బాండులను ఒకరికి ఇంకొకరు విక్రయించేటప్పుడు ఈ పన్ను విధించబడుతుంది.

ప్రత్యేక కార్యాల పన్ను : కొన్ని ప్రత్యేక కార్యాల నిమిత్తం ఈ పన్ను విధించబడుతుంది. ఉదాహరణకు : కార్మికుల జీతాలను బట్టి కొంత పన్ను విధించబడుతుంది. అదే విధంగా పరిశ్రమల యజమానులవద్దనుంచి కొంత పన్ను వసూలు చెయ్యబడుతుంది. ఈ రెండు విధాలుగా వచ్చే ధనాన్ని, కార్మికులు నిరుద్యోగులైనప్పుడు వారి సదుపాయానికై వినియోగిస్తారు. వారు వృద్ధులైనప్పుడు చేసే సదుపాయాలకు కూడా ఈ ధనం వ్యయపరుస్తారు.

ఫెడరల్ ప్రభుత్వానికి ఆదాయం వచ్చే ఇతర మార్గాలుకూడా కొన్ని వున్నప్పటికీ, ముఖ్యమైన ఆదాయం పన్నుల రూపంలోనే వస్తుంది. పనామా కాలువనుంచి వెళ్ళే నౌకలు చెల్లించే టోల్ పన్ను మొదలైనవికూడా ప్రభుత్వానికి అందుతాయి. గవర్నమెంటు భూములను పశువులను మేపడానికి వేలం వేసినప్పుడు, అడవులలో కలప కొట్టుకున్నప్పుడు కూడా ప్రభుత్వానికి ప్రజలనుంచి డబ్బు వస్తుంది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం విదేశాలలో మిగిలి పోయిన యుద్ధసామగ్రిని అమ్మివెయ్యడంవల్ల అమెరికా ప్రభుత్వానికి చాలా ధనం లభించింది.

## రాష్ట్ర ప్రభుత్వాల ఆదాయం

రాష్ట్ర ప్రభుత్వాలు తమ కార్యకలాపాల నిమిత్తం అనేక విధాల పన్నులను విధించగలవు. అవి ఒక్కొక్క

రాష్ట్రంలో ఒకొక్కొక్క విధంగా విధించ బడుతాయి. ఆ యా రాష్ట్ర పరిస్థితులనుబట్టి, అక్కడి అవకాశాలనుబట్టి విధించ బడగలవు. ఒకే వస్తువుమీద గ్రామంలోను, తరువాత పట్టణంలోను, ఆ తరువాత మరొకచోట పన్నులు విధించ బడకుండా చెయ్యాలని ప్రయత్నాలు చెయ్యబడ్డాయి. కాని. అది పూర్తిగా ఫలప్రదం కాలేదు.

సాధారణంగా రాష్ట్ర ప్రభుత్వాలు విధించే పన్ను లివి :

ఆస్తి పన్ను : భూములు, బంగాళాలు, యంత్రాలమీద విధించబడుతుంది.

వారసత్వపు పన్ను : ఇంచు మించు అన్ని రాష్ట్రాలలోను ఈ పన్నువుంది. మరణించిన వానికి వారసులైనవారిమీద విధించబడుతుంది.

ఆదాయం పన్ను : ఫెడరల్ ప్రభుత్వం విధించే ఆదాయం పన్నుకంటె చాలా తక్కువ విధించబడుతుంది.

వర్తకపు పన్ను : రాష్ట్రంలోని కంపెనీలమీద, పెద్ద వాణిజ్య సంస్థలమీద విధించబడుతుంది.

ఫ్రాంఛైజ్ పన్ను : ప్రయివేటు కంపెనీలుగాని, వ్యక్తులు గాని ప్రభుత్వానికిచెందిన భూములను, రహదారులను వాడు గానే సందర్భాలలో విధించబడుతుంది.

**మోటారు కారుల పన్ను** : వ్యక్తులు మోటారు కారులను కొనేటప్పుడు విధించబడుతుంది. సాధారణంగా రోడ్ల మరమ్మతుకు ఈ ధనం వినియోగించబడుతుంది.

**అమ్మకం పన్ను :** కొన్ని రాష్ట్రాలలో అన్ని సరకుల అమ్మకాలమీద విధించబడుతుంది.

**స్పెషల్ అసెస్‌మెంట్సు :** భవనాలు మొదలైన వాటిని పెద్దవి చెయ్యడంవలన వాటివిలువ హెచ్చుతుంది. అటువంటి సందర్భాలలో విధించబడుతుంది.

**ఇతర పన్నులు :** రిజిస్ట్రేషను పత్రాలు, కాలువలలో రవాణాలు, నంకెనలు, పడవలు, జరిమానాలు మొదలైనవి ఈ తరగతి పన్నులు.

అనేక రాష్ట్రాలు పన్నులద్వారా వచ్చిన ధనంకాక. ఫెడరల్ ప్రభుత్వంనుంచికూడా ధన సహాయాన్ని పొందుతాయి. కొన్ని ప్రత్యేక కార్యాలకు కావలసిన ధనాన్ని కూడా ఫెడరల్ ప్రభుత్వంనుంచి పొందుతాయి.

స్థానిక ప్రభుత్వాల ఆదాయాలు

స్థానిక ప్రభుత్వాలకు ఆదాయాన్ని సమకూర్చేవి ముఖ్యంగా ఆస్తి పాస్తులమీద పన్నులు. కొన్ని సందర్భాలలో ఈ పన్నులలోని కొంత భాగాన్ని రాష్ట్ర ప్రభుత్వానికి చెల్లించాలి. అందువల్ల, రాష్ట్ర ప్రభుత్వాలు నగర, తాలూకా, పట్టణ ప్రభుత్వాల యాజమాన్యంలో ఉండే పాఠశాలలను, రోడ్లను, ఇంకా అటువంటి వాటిని వృద్ధిచేసే నిమిత్తం ధనమిస్తాయి. స్థానిక ప్రభుత్వాలు విధించే పన్నులివి:

రాష్ట్రప్రభుత్వాలు విధించే ఫ్రాంచైజ్ పన్నులను పోలిన పన్నులు.

చిల్లర అమ్మకాలమీద పన్నులు.

వ్యాపార సంస్థలు మొదలైన వాటిని ఒకరికి ఇంకొకరు అమ్ముకొనే సందర్భాలలో పన్నులు.

భవనాలు మొదలైనవాటిని వృద్ధిచేసేటప్పుడు పన్నులు.

వినోదాలమీద పన్నులు.

వివాహాలకు, మోటారు కారులకు, కుక్కలకు లైసెన్సులను యివ్వడం; వేటకు, చేపలు పట్టడానికి పర్మిట్లు; మద్యపానీయాలను, సిగరెట్లను అమ్మడానికి లైసెన్సులు; సినిమా, నాటకశాలలను నడపడానికి లైసెన్సులు—వీటన్నింటి ద్వారా కూడా స్థానిక ప్రభుత్వాలకు ఆదాయం వస్తుంది.

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రతి అమెరికన్ పౌరుడు ప్రభుత్వ వ్యయానికి ధనమిస్తాడు. అద్దె యింటిలోని వారు చెల్లించే అద్దెలో కొంతభాగం పన్నురూపంగా ప్రభుత్వానికి జమ అవుతుంది. ఎవరు ఏ సరకు కొన్నప్పటికీ ప్రభుత్వానికి ఎంతో కొంత ముట్టుతుంది. కార్మికుల వేతనాలనుంచి సయితం ప్రభుత్వానికి తృణమో పణమో చేరుతుంది. ఈ విధంగా కార్మికులు చెల్లించేది వారిని ఇన్సూరు చెయ్యడానికి ప్రీమియం ధన మన్నమాట. నిజానికి వారు చెల్లించేది పన్ను కాదు.

ప్రభుత్వంనుంచి ప్రజలు ఎన్ని సదుపాయాలను కోరితే, అంతగా ప్రభుత్వానికి వ్యయమవుతుంది. కాని, ప్రజాస్వామిక

ప్రభుత్వంలో ఈ పనులన్నీ ప్రజలే చేసుకుంటారు. అందువల్ల ప్రభుత్వ కార్యక్రమాలు ప్రజలుకోరిన కార్యక్రమాలే. అందుచేత, ప్రజలు తమ ప్రజాస్వామిక ప్రభుత్వంపట్ల శ్రద్ధ వహించేటట్లు ప్రోత్సహించడానికి పన్నులు ఉపకరించ గలవు. ఆ కార్యక్రమాలు సఫలమయ్యేటట్లు శ్రద్ధ వహించాలని వారికి సదా జ్ఞాపకం చేసేవికూడా పన్నులే.

## 18

# ప్రజాస్వామిక ప్రభుత్వానికి ప్రాణప్రదమైన సూత్రాలు

ప్రజలకు స్వపరిపాలనాధికారంగల అమెరికా ప్రభుత్వ పద్ధతి కొన్ని ప్రధాన సూత్రాలమీద ఆధారపడింది. వాటిలో కొన్ని అమెరికా జాతి ప్రత్యేక లక్షణాలవల్ల జనించినట్టివి. మిగిలినవి అమెరికా రాజ్యాంగచట్టం ఉపోద్ఘాతంలో వ్యక్తం చెయ్యబడిన ప్రధానాశయాలను అమలులో పెట్టడంవలన జనించినట్టివి.

ప్రజలందరు సమానులనీ, వారికి తిరుగులేని కొన్ని హక్కులు కలవనీ అమెరికా రాజ్యాంగచట్టం ఉద్ఘాటించింది. మానవులకు న్యాయం కలిగించడానికీ, స్వాతంత్ర్యం ప్రసాదించడానికీ ఈ రెండు సూత్రాలుకూడా రెండు పెట్టనికోటలు. ఈ లక్ష్యాల సాధనకు మరొక ముఖ్యవిషయ మేమిటంటే, ప్రభుత్వ శాసనం అనుల్లంఘనీయమైనదని గుర్తించడం. ధనవంతులైనా సరే, అధికారులైనా సరే, సంస్థలైనా సరే, వ్యక్తులైనా సరే శాసన ధిక్కారణ చెయ్యరాదు. ప్రజలందరకూ అది వర్తించాలి. తేడా పాడాలు పాటించకుండా అది ప్రతి వ్యక్తినీ కాపాడాలి.

పైన తెల్పిన వంటివే మరికొన్ని ప్రధాన సూత్రాలు కూడా ఉన్నాయి. ప్రజల ప్రధాన స్వత్వాలకు గాని, వారి ప్రాథమికాధికారానికి గాని భంగంరాని పద్ధతిలో ఈ సూత్రాలను ఆచరణ సాధ్యం చేసి, స్వపరిపాలనాధికారం గల ప్రభుత్వాన్ని స్థాపించడానికి కొన్ని విధానాలను అమలు

జరపడం అవసరమైంది. అక్షరాలా స్వపరిపాలనాధికారంగల ప్రభుత్వాన్ని స్థాపించడం సాధ్యమైన పనికాదు. అందుకు దేశం విస్తీర్ణం, జనాభా అడ్డువస్తాయి. ఈ కారణంచేత, ప్రజా ప్రతినిధులద్వారా ప్రభుత్వాన్ని స్థాపించాలనే సూత్రం తయారు చెయ్యబడింది.

వోటర్లు కొందరు ప్రతినిధులను ఎన్నుకొని, ప్రభుత్వ పదవులకు పంపుతారు. ఎన్నిక అయిన ఈ ప్రతినిధులకు, వీరు నియమించే అధికారులకు ప్రజలు కొన్ని అధికారాలను యిస్తారు.

ప్రభుత్వాధికారులు (మంత్రులు మొదలైనవారు) పదవులలో వున్నారన్నా, అధికారం కలిగివున్నారన్నా ప్రజలు యిచ్చిన అధికారమే కారణం. ప్రజలకు సంతృప్తికరంగా ప్రవర్తించినంత కాలమే వారు పదవులలో వుండగలరు. తమ ప్రతినిధుల మీాద ప్రజలు ఒత్తిడి తేగల మార్గాలు అనేకం ఉన్నాయి. ప్రజా ప్రతినిధులంటే ప్రజా సేవకులు, ప్రజా నాయకులుకూడా. ఈ విషయాన్ని వారికి గుర్తుకు తేవడానికి ప్రజలు అనేక మార్గాలను అనుసరించగలరు.

ప్రభుత్వాధికారులపై తమకు కంట్రోలు కలదని ప్రజలు చెప్పడానికి వీలైనవి ఎన్నికలు. ఇది సాధారణంగా జరిగే పద్ధతి. ఎన్నికలలో పోటీకి నిలచి, ప్రజలకు ప్రాతినిధ్యం వహించ దలచిన వ్యక్తి వోటరులందరకు విజ్ఞాపన చేస్తాడు. ఆ కాలపు సమస్యలను గురించి తాను ఏ విధానాలను అనుసరించ దలచాడో ఒక కార్యక్రమాన్ని వారికి తెలియపరుస్తాడు.

ఇదివరకే మంత్రిగానో, మరొక పదవిలో ప్రజా ప్రతినిధిగానో ఉన్న వ్యక్తికూడా తిరిగి ఎన్నికలలో పోటీ చేస్తే ఈ విధంగానే చేస్తాడు. పైగా, అతడంతవరకు తను ఆ పదవిలో చేసిన పనులనుకూడా ప్రజలకు చెబుతాడు. అధికారంలో ఉన్న ప్రజా ప్రతినిధులు తిరిగి ఎన్నికలు రాగలవనీ, అప్పుడు ప్రజలు తనను పదవిలో ఉంచడమో తీసివెయ్యడమో ఎన్నికల ద్వారా నిర్ణయించగలరనీ గుర్తు వుంచుకోక తప్పదు. అందు చేత, వారు పదవిలో వుండగా చేసే పనుల మీద వారి రాజకీయ భవిష్యత్తు ఆధారపడి వుంటుంది.

ప్రజల ఓట్ల ద్వారా పదవిలోకి వచ్చినవారు ప్రజల సానుభూతిని కోల్పోకూడదని జ్ఞాపకం చెయ్యడానికి ఎన్నికలు కాక ఇతర పద్ధతులుకూడా ఉన్నాయి. పరిపాలన గురించిగాని, ప్రభుత్వ విధానం గురించిగాని సామాన్య ప్రజలు తమ అభిప్రాయాలను ప్రతినిధులకు స్వయంగా చెప్పగలరు. అందుకు వెనుదీయరు. ప్రజా ప్రతినిధికిగాని, సెనేటరుకుగాని రోజుకి కొన్నివందల లేఖలు వారి నియోజకవర్గాలలోని వోటరుల వద్దనుంచి వస్తాయంటే ఆశ్చర్యం లేదు. కాంగ్రెసులో చర్చించ బడగల బిల్లులను గురించి వారు లేఖలలో తమ అభిప్రాయాలను వ్రాస్తారు.

కొందరు వోటరులు తమ నియోజవర్గంలోని ప్రతినిధుల వద్దకు రాయబారం వెడుతూంటారు. అప్పటి సమస్యలను గురించిగాని, భావి సమస్యలను గురించిగాని వారితో చర్చలు జరుపుతారు. వాణిజ్య సంస్థల తరఫున, కార్మిక, కర్షక సంస్థల

తరఫున, ఇతర సంస్థల తరఫున తరచు రాయబారులు వెళ్ళడం జరుగుతూంటుంది. వారు చెప్పిన విషయాలను ప్రజా ప్రతినిధులు శ్రద్ధగా ఆలకిస్తారు. పోతే, శాసన సభా సమావేశం జరగని రోజులలో ఆ ప్రతినిధులు తామే తమ నియోజక వర్గాలకు వెళ్ళి, వోటరులను స్వయంగా కలుసుకొని, వారి సమస్యలను, అభిప్రాయాలను తెలుసుకుంటారు.

పత్రికలకు, రేడియోలకు వోటరులతో పరస్పర సంబంధం ఉండడంచేత, ఆ రెండింటిద్వారా వెలిబుచ్చబడే అభిప్రాయాలను, వార్తలను ప్రజాప్రతినిధులు రెండుకారణాల చేత మన్నిస్తారు. ఒక పత్రికలోని సంపాకీయం, దాని విధానం పత్రికాధిపతుల అభిప్రాయాలమీద ఆధారపడి వుంటాయి. ఆ పత్రికకు బలం దానికిగల ప్రచారం. ఎక్కువ ప్రజలు అభిమానించే పత్రికకు ఎక్కువ ప్రచారం వుంటుంది. అలాగే రేడియో విషయంలోకూడా. అందుచేత, కొంతవరకు పత్రికలద్వారా, రేడియోలద్వారా ప్రజాభిప్రాయం వ్యక్తమాతుంది. అందుచేతనే, ప్రభుత్వాధికారులు వాటిని శ్రద్ధగా పాటిస్తారు.

ఇది యిలావుండగా, పత్రికలలో, రేడియోలలో వార్తలు, ప్రకటనలు కూడా ప్రజలు చదవడానికీ, వినడానికీ ఉద్దేశించబడుతాయి గనుక, కొంతవరకు ప్రజలమీద వాటి ప్రభావం వుండగలదు. అందుచేత, ప్రభుత్వాధికారులకు అవి రెండూ మిత్రులూ, శత్రులూ కూడా. ఈ విషయాన్ని గుర్తెరిగే ప్రజాప్రతినిధులు ప్రవర్తిస్తారు.

అమెరికా ప్రభుత్వం చాలా గజిబిజిగా వున్న యంత్రం లాగ అయినప్పటికీ, ఈ మార్గాలన్నింటిద్వారా వోటరు ప్రభుత్వ పరిపాలనను అదుపులో పెట్టగలడు. అధికారాన్ని తన చేతులనుంచి జారిపోనివ్వడు.

అమెరికా ప్రభుత్వ నిర్మాణం ప్రారంభమైనప్పటినుంచి కూడా ప్రజాస్వామిక విధానం అతిజాగరూకతగా భద్రపరచ బడింది. అమెరికా వ్యవస్థ ఆధారపడిన ప్రాణప్రద సూత్రాలలో అదొకటి. ఇదివరలో చెప్పినట్లు, ఫెడరల్ ప్రభుత్వంలోని మూడు శాఖలుకూడా (కాంగ్రెసు, ప్రెసిడెంటు, సుప్రీంకోర్టు) సగంవరకు మాత్రమే స్వతంత్రాధికారం కలవి. అయినప్పటికీ, ఒకదానికంటె మరొకదానికి ఎక్కువ అధికారం కలదు. కాంగ్రెసు చేసిన బిల్లును ప్రెసిడెంటు వీటో చేసి, త్రోసి వెయ్యగలడు. లేదా, ఏదైనా చట్టం న్యాయవిరుద్ధమైనదని సుప్రీంకోర్టు నిర్ణయించవచ్చు. ప్రెసిడెంటుమీద, సుప్రీం కోర్టుమీదకూడా కాంగ్రెసుకు అధికారం వుంది. బడ్జెటును అనుమతించే అధికారం కాంగ్రెసుకు వ్యగడడంచేత, ప్రెసిడెంటును, సుప్రీంకోర్టును అది కంట్రోలు చెయ్యగలదు. సుప్రీంకోర్టు జడ్జీల నియామకాన్ని, ముఖ్యమైన అధికారుల నియామకాన్ని కాంగ్రెసులోని సెనేటు ఆమోదించాలి.

ఒకరిమీద మరొకరికి పెద్ద అధికారం ఉండాలనే సూత్రమే కాంగ్రెసు నిర్మాణానికికూడా వర్తింపచెయ్యబడింది. ప్రతినిధులసభకు, సెనేటుకు వేర్వేరు ప్రత్యేకాధికారాలు యివ్వబడ్డాయి. ఒక సభ చేసిన బిల్లును సవరించడానికి రెండవ

సభకు అధికారమివ్వబడింది. ఈ విధంగానే, ఫెడరల్, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వాల మధ్య అధికారాలు విభజించబడ్డాయి, ఎన్నికల పద్ధతిలోకూడా ఇటువంటి కలక విషయాలున్నాయి. ప్రతినిధుల సభకు ఎన్నుకోబడిన సభ్యుడు రెండు సంవత్సరాలు మాత్రమే పని చేస్తాడు. ప్రెసిడెంటు నాలుగు సంవత్సరాలు, సెనేటరు ఆరు సంవత్సరాలు పనిచేస్తారు. రెండు సంవత్సరాల కొకసారి ప్రతినిధుల సభాసభ్యులందరూ ఎన్నుకొనబడేటప్పుడే, సెనేటర్లలో మూడవవంతుమంది మాత్రమే ఎన్నుకో బడుతారు. నాలుగు సంవత్సరాలకొకసారి ప్రెసిడెంటు ఎన్నుకో బడే సమయంలోనే ప్రతినిధులసభకు క్రొత్త సభ్యులందరు ఎన్నుకోబడడం జరుగుతుంది.

ఈ విధంగా ఎక్కడికక్కడ ఆటంకాలున్నాయి. అధికారం ఏ ఒకరి హస్తగతం కాకుండా, అందరికీ సమానంగా పంచబడుతుంది. ఇందువల్ల, ఫలప్రదంకాగల స్వపరిపాలనకు ముఖ్యమైన ప్రధాన సూత్రం కాపాడబడుతుంది. అమెరికా ప్రజలు నమ్ముకొంటున్న ప్రజాస్వామిక విధానం క్షేమంగా ఉంటుంది. కోర్టులకు స్వతంత్రాధికారం ఉంది గనుక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక వర్గాల ఒత్తిడికిగాని, పలుకుబడికిగాని అవి లొంగివుండ నవసరంలేదు. అందుచేత, అవి శాసనాలకు న్యాయమైన వ్యాఖ్యానాలను చెప్పడానికి, శాసనాలను అమలు జరిపించడానికి అనుకూలంవుంది. సర్వాధికారం ఏ ఒక శాఖకు లేక, అన్ని శాఖలమధ్య విభజించబడడంవల్ల, తొందరపడి ఏశాఖ చర్యలు తీసుకొనజాలదు. ఒక శాఖకే,

లేదా ఒక వర్గానికే సర్వాధికారం వుండడం కాలనీల కాలం నాటినుంచికూడా అమెరికనులకు విముఖత కలిగించింది.

ప్రభుత్వాధికారాన్ని వివిధ శాఖల మధ్య విభజించడం వల్లనే పరిపాలన చాలా మందకొడిగా అసమర్థంగా జరుగుతుందని కొన్ని వర్గాలవారు విమర్శించారు. ప్రభుత్వం త్వరపడి ఒక చర్య తీసుకున్నా, ఒక విధానాన్ని రూపొందించుకున్నా దానివల్ల దుష్ఫలితాలు రావడం అమెరికాకు గతంలో అనుభవైకవేద్యం. వివిధ ప్రభుత్వ శాఖలు, ప్రజలుకూడా ఆ చర్యగురించిగాని, విధానం గురించిగాని యోచించుకోడానికి తగినంత వ్యవధివుంటే సత్ఫలితాలు కలిగివుండేవని కూడా అమెరికాకు స్వానుభవమే. అంతేకాదు, అత్యవసర పరిస్థితులలో చటుక్కున చర్యలు తీసుకోడానికి ఈ యేర్పాట్ల వల్ల అవరోధాలు కలగలేదు.

ఒక ప్రభుత్వంయొక్క గొప్పతనం దానిపరిపాలన చక్కగా జరగడాన్నిబట్టి, అది ప్రజలకు చేయగలసేవనుబట్టి వుంటుంది. ఈవిధంగా చూస్తే అమెరికా ప్రభుత్వం ఉత్తమ స్థాయిలో నడుస్తూంది. అమెరికా వైశాల్యం, జనాభా, సైనిక ఆర్థిక శక్తులు ఎంత పెద్దవో ప్రభుత్వ చాకచక్యం కూడా అంత ఘనమైనది. అమెరికా కొత్తగా స్వాతంత్ర్యం పొందిన తరువాత దేశంలో కల్లోలాలను, విదేశాలనుంచి ప్రమాదాలను కూడా అది ఎదుర్కోవలసి వచ్చింది. వాటినన్నింటిని దాటుకొని విజయం సాధించగలిగింది. వ్యష్టి స్వాతంత్ర్య సమస్య గురించి విజృంభించిన అంతర్యుద్ధంనుంచి బయటపడ

గలిగింది. ఆర్థిక రంగంలో కలిగిన అనేక కష్టాలను దాటుకొని, వాటివల్ల లభించిన అనుభవంతో ఆర్థిక వ్యవస్థను చక్కదిద్దు కొన్నది. ఒక శత్రురాజ్యం జరిపిన ముట్టడిని తరిమికొట్టి, స్వాతంత్ర్య, స్వపరిపాలనా సూత్రాలను కాపాడుకో గలిగింది.

అయితే, అమెరికా చేసిన పనులన్నీ నిర్దుష్టమైనవని గాని, లోపరహితమైనవని గాని ప్రజలు వాదించరు. సదాశయంతో ఒక పని చేసినప్పుడు కొంత అనుభవం కలుగుతుంది. ఆ పనిలోని లోపాలు తెలుస్తాయి. అమెరికా చరిత్రనుంచి వాటిని వేలుపెట్టి చూపవచ్చు. దేశాభ్యు దయాన్ని అవరోధించిన చర్యలను గ్రహించవచ్చు. తద్విధంగా జాతీయ మార్గాన్ని సుగమం చేసుకొనడం సాధ్యమౌతుంది.

భావిలో కూడా తాము ఇంకా పొరపాట్లు చేసినా చేయవచ్చునని అమెరికా ప్రజలకు తెలుసు. కాని, వారికి అన్నింటికంటె ముఖ్యమైన విషయమేమిటంటే, తమ ప్రభుత్వం ప్రజా ప్రతినిధులతో కూడినదనేది. తరతరాలనుంచి అమూల్య మానవ స్వత్వాలను కాపాడిన ప్రజాప్రభుత్వం తమకు కలదని వారు సంతోష పడుతారు. ఏ పౌరుడైనాసరే తన ప్రభుత్వాన్ని విమర్శించుకోడానికి అధికారం కలదు. నూతన పరిస్థితులకు తగినట్టుగా అతడు ప్రభుత్వాన్ని సరిదిద్దుకో గలడు. అత్యధిక సంఖ్యాకులు ఏది ఉత్తమమని భావిస్తే ఆవిధంగా ప్రభుత్వం మార్పు చెయ్యబడుతుంది. అమెరికాను పటిష్ఠం చెయ్యడానికి రాజ్యాంగచట్టం ఉపోద్ఘాతంలో పేర్కొన బడిన రీతిగా ప్రభుత్వ శాఖలు తమ విధిని నిర్వహిస్తూ వస్తున్నాయని

అమెరికా చరిత్ర విదితం చెయ్యగలదు. అమెరికా శక్తిమంతమైనదనీ, దేశంలో శాంతి వర్ధిల్లుతున్నదనీ, ప్రజా క్షేమానికై అంతకంతకు ఎక్కువశ్రద్ధ వహించబడుతూందనీ దేశరక్షణకు అవసరమైన చర్యలు తీసుకోబడుతున్నాయనీ స్పష్టం కాగలదు.

ప్రజాప్రభుత్వ శక్తిని పరీక్షించ గలవి భావిసమస్యలు. "ప్రజలకోసం ప్రజలే నెలకొల్పుకున్న ప్రజాప్రభుత్వం" భావి సమస్యలను విజయవంతంగా పరిష్కరించుకో గలదని మానవ విమోచకుడైన మహనీయుడు అబ్రహాం లింకన్ ప్రవచించాడు. అమెరికా గతంలో ఆవిధంగా తన సమస్యలను పరిష్కరించుకో గలిగింది. అబ్రహాం లింకన్ చెప్పిన సువర్ణాక్షరాలయందు అమెరికా ప్రజలకు ప్రగాఢ విశ్వాసముంది.

1776 జూలై 4వ తేదీన కాంగ్రెసులో ఆమోదించబడిన

# స్వాతంత్ర్య ప్రకటన ఉపోద్ఘాతం

అమెరికా పదమూడు రాష్ట్రాలు ఏకగ్రీవంగా ఆమోదించిన ప్రకటన :—

మానవ చరిత్రలో కొన్ని సంఘటనలు జరిగినప్పుడు, ఒక దేశంతో తమకు రాజకీయంగా గల సంబంధాలను మరొక దేశం ప్రజలు త్రెంచుకోవలసిన అవసరం ఏర్పడుతుంది; భగవదత్తమైన సహజ శాసనాలను కలిగి, ప్రపంచ రాజ్యాలతో సమానస్థాయిని పొందవలసిన అవసరం ఏర్పడుతుంది. అటువంటి కారణాలనన్నింటినీ విధిగా ప్రకటించడం ఆ దేశ ప్రజల ధర్మం. మానవకోటి యెడల గౌరవ మర్యాదలు కలవారు ఆ విధంగా చెయ్యాలి.

మానవులందరు సమాన హక్కులు కలవారుగా సృష్టించబడ్డారు; భగవంతుడు వారికి కొన్ని తిరుగులేని హక్కులను ప్రసాదించాడు. ఆ హక్కులు ఇవి : జీవించడం, స్వాతంత్ర్య మనుభవించడం, సుఖపడడానికి ప్రయత్నించడం—ఇవన్నీ నగ్నసత్యాలని మా విశ్వాసం. ఈ హక్కులను సాధించడానికే మానవులకు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. వాటికి న్యాయమైన హక్కులను ప్రజలే యిస్తారు. ఏదైనా ఒక ప్రభుత్వం ఈ లక్ష్యాలను నాశనం చేయగల్గదైతే దానిని మార్పు చేసుకోడానికిగాని, రద్దు చేసుకోడానికిగాని ప్రజలకు అధికారం కలదు. తమ సౌఖ్యానికి, భద్రతకు తోడ్పడగల రీతిగా ప్రజలు చర్యలు తీసుకోవాలి. అందుకై సూత్రాలను తయారుచేసు

కొని, తమ అధికారాలతో నూతన ప్రభుత్వాన్ని స్థాపించు కోడానికి ప్రజలు హక్కు కలవారు. అయితే, చిరకాలం క్రిందట స్థాపించబడిన ప్రభుత్వాలను స్వల్పకారణాలచేతగాని, తాత్కాలిక కారణాలచేతగాని మార్పు చెయ్యకపోవడం వివేకవంతమైన పని. అటువంటి ప్రభుత్వాలను మార్పు చెయ్యాలని ప్రయత్నించడంకంటె, వాటివల్ల కలిగే స్వల్పమైన బాధలను అనుభవించడానికే ప్రజలు ఇష్టపడుతారు. ఎందుకంటే, మానవులు బాధలైనా పడుతారుగాని, తాము చిరకాలంగా అలవాటుపడిన వ్యవస్థను మార్చుకోడానికి ప్రయత్నించరు. ఇది మానవాళికి అనుభవమే. కాని, ఒక ప్రభుత్వం ఏకలక్ష్యంతో తన అధికారాన్ని అదే పనిగా దుర్వినియోగం చేస్తూ, ప్రజలను నిరంకుశంగా పరిపాలించి నట్లయితే, అటువంటి ప్రభుత్వాన్ని కూలద్రోయడం, తమ భావి భద్రతకు కట్టుదిట్టాలు చేసుకోనడం ప్రజల హక్కు; ప్రజల విధి. ఈ కాలనీలలోని ప్రజలు ఆ విధంగా, చాలా కాలం నుంచి ఓపిక పట్టివున్నారు. ఈ కారణాలచేతనే, తమ పూర్వపు ప్రభుత్వాలు ఏర్పడిన పద్ధతులను మార్పుచేసుకొనడం అవసరమని తలపోస్తున్నారు. ఇప్పటి గ్రేట్ బ్రిటను రాజు చరిత్ర అధికార దుర్వినియోగ పూరితమై వుంది. ఈ కాలనీలపై నిరంకుశ ప్రభుత్వాన్ని చెలాయించడమే ఆయన లక్ష్యమని బ్రిటిష్ రాజు చర్యలు నిరూపిస్తున్నాయి. ఈ విషయాన్ని ఋజువు చెయ్యడానికి వాస్తవ సమాచారాలను యదార్థ ప్రపంచ ప్రజలకు నివేదిస్తున్నాము.

# అమెరికా రాజ్యాంగ చట్టం

## ఉపోద్ఘాతం

అమెరికా కాలనీలతో ఇప్పటికంటె ఉత్తమమైన యూనియన్‌ను స్థాపించడానికీ, శాంతి భద్రతలు వర్ధిల్లడానికీ, సమష్టి రక్షణను ఏర్పాటు చెయ్యడానికీ, ప్రజా క్షేమాభివృద్ధికీ, మేము, మా సంతతివారు స్వాతంత్ర్యాన్ని అనుభవించడానికీ ఈ రాజ్యాంగ చట్టాన్ని అమెరికా ప్రజలమైన మేము స్థిరపరుస్తున్నాము.

## 1 వ సూత్రం

**1 వ నిబంధన:**—ఈ రాజ్యాంగ చట్టానికి లోబడివుండే శాసనాలను చేసే అధికారం, సెనేటు, ప్రజా ప్రతినిధులసభ అనే రెండు విభాగాలుగల అమెరికా కాంగ్రెసుకే ఉండగలవు.

**2 వ నిబంధన:**—వివిధ రాష్ట్రాల్లోని ప్రజలు ప్రతి రెండోయేట ఎన్నుకొనే ప్రతినిధులతో ప్రజా ప్రతినిధులసభ యేర్పడగలదు. ఆ యా రాష్ట్ర శాసనసభలు నిర్ణయించే యోగ్యతలు గలవారే వోటర్లుగా పరిగణించబడగలరు.

పాతికేండ్లలోపు వయస్సు గలవారు, అమెరికాలో ఏడేండ్లపాటు పౌరస్వత్వంలేనివారు, తాము ప్రతినిధులుగా ఎన్నికయ్యే రాష్ట్రంలో ఎన్నికల తరువాత నివసించనివారు ప్రజా ప్రతినిధులుగా పరిగణించబడరాదు.

ఈ యూనియన్‌లో చేరే రాష్ట్రాల జనాభాలనుబట్టి వాటి ప్రతినిధుల సంఖ్య నిర్ణయించబడుతుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో ఏది వేటిమీద సూటిగా పన్నులు విధించగలదో నిర్ణయించబడుతుంది. ప్రతినిధుల సంఖ్య నిర్ణయించడానికి జనాభా లెక్క యిది: పన్నులులేని రెడ్ ఇండియనులను మినహాయించి మిగతా అమెరికన్‌ల, నీగ్రోల సంఖ్య తీసుకుంటారు. వీరు కాక, ఇతరుల సంఖ్యలో అయిదింట మూడు వంతులను ఆ సంఖ్యకు కలుపుతారు. అమెరికా కాంగ్రెసు మొదటిసారి సమావేశమైన మూడేండ్లలోగా వోటర్ల లెక్కలను తయారు చెయ్యాలి. అటుతరువాత ప్రతి పదేండ్లకొకసారిగాని, లేక చట్టం ఏ విధంగా నిర్ణయిస్తే ఆ విధంగా గాని వోటర్ల లెక్కలు తయారు చెయ్యాలి. ఒక్కొక్క రాష్ట్రానికి కనీసం ఒక ప్రతినిధి ఉండాలి. ప్రతి 30 వేల మంది జనాభాకు ఒక ప్రతినిధి చొప్పున

ఎన్నుకోబడాలి. ఆ విధంగా వోటర్లలెక్కలు తయారు చేసేటంతవరకు న్యూహాంప్‌షైర్ రాష్ట్రానికి ముగ్గురు ప్రతినిధులు, మసాచుసెట్స్ రాష్ట్రానికి ఎనిమిదిమంది, రోడ్ ఐలెండ్, ప్రావిడెన్స్ ప్లాంటేషన్సు ఈ రెండింటికీ కలిపి ఒక ప్రతినిధి, కనెక్టికట్ రాష్ట్రానికి అయిదుగురు, న్యూయార్కు రాష్ట్రానికి ఆరుగురు, న్యూజెర్సీ రాష్ట్రానికి నలుగురు, పెన్సిల్వేనియా రాష్ట్రానికి ఎనిమిదిమంది, డిలావేర్ రాష్ట్రానికి ఒకరు, మేరీలాండ్‌కు ఆరుగురు, వర్జీనియాకు పదిమంది, ఉత్తర కెరోలినాకు అయిదుగురు, దక్షిణ కెరోలినాకు అయిదుగురు, జార్జియా రాష్ట్రానికి ముగ్గురు ప్రతినిధులు వుండగలరు.

ఏ రాష్ట్రంలోనైనా ఖాళీ లేర్పడ్డప్పుడు, ఆ రాష్ట్రానికి సంబంధించిన అధికారులు ఎన్నికలకు తగు ఏర్పాట్లుచేసి, వాటిని జరిపించి, ఆ ఖాళీలను భర్తీచేయగలరు.

ప్రజా ప్రతినిధుల సభవారు ఒక స్పీకరును, తదితర ఉద్యోగస్థులను ఎన్నుకొనగలరు. నేరంచేసిన అధికారులను విచారించే పూర్తి అధికారం ప్రజా ప్రతినిధుల సభవారికి కలదు.

**3 వ నిబంధన** :—ప్రతి రాష్ట్రంనుంచి ఇద్దరు సెనేటర్లు అమెరికా సెనేటుకు ఎన్నుకోబడగలరు. ఆ సెనేటర్లను ఆయా రాష్ట్రాల శాసనసభలు ఎన్నుకొనగలవు. సెనేటర్లు ఆరేండ్లపాటు అధికారంలో ఉండగలరు. ఒక్కొక్క సెనేటరుకు ఒక వోటు మాత్రమే ఉండగలదు.

మొదటిసారి ఎన్నికలు పూర్తయిన తరువాత మొత్తం సెనేటర్లందరు మూడు విభాగాలుగా పరిగణించ బడగలరు. ప్రతి రెండో యేడు మొత్తం సెనేటర్లలో మూడవవంతు మంది ఎన్నుకొనబడే సౌకర్యం కలిగించేటందుకుగాను మొదటిశ్రేణి సెనేటర్లు రెండవ సంవత్సరం ఆఖరున, రెండవశ్రేణి సెనేటర్లు నాలుగవ సంవత్సరం ఆఖరున, మూడవ శ్రేణి సెనేటర్లు ఆరవ సంవత్సరం ఆఖరున విరమిస్తారు. ఒక రాష్ట్ర శాసనసభ సమావేశం కానిరోజుల్లో ఆ రాష్ట్రం సెనేటర్లలో ఎవరన్నా రాజీనామా చేసినా, లేక మరేకారణంచేతనైనా వారి స్థానాలు ఖాళీ అయినా, శాసనసభ తిరిగి సమావేశమయేవరకు సెనేటర్లను ప్రభుత్వాధికారులే తాత్కాలికంగా నియమించగలరు.

ముప్ఫయ్యేండ్లలోపు వయస్సు గలవారు, అమెరికాలో తొమ్మిదేండ్ల పాటయినా పౌరస్వత్వంలేని వారూ, సెనేటర్లుగా ఎన్నికయిన తరువాత ఆ రాష్ట్రంలో నివసించని వారూ సెనేటరుగా పదవికి అర్హులు కారు.

అమెరికా వైస్ ప్రెసిడెంటు సెనేటుకు ప్రెసిడెంటు పదవి నలంకరించ గలడు. అయితే, సెనేటులో ఏదైనా ఒక విషయంమీద వోటింగు జరిగినప్పుడు రెండు పక్షాలవారికి సమానంగా వోట్లు వచ్చినట్లయితే తుది నిర్ణయం చేయడానికి తప్ప సెనేటు ప్రెసిడెంటుకు వోటింగుహక్కు ఉండదు.

వైస ప్రెసిడెంటు ఏకారణంవల్లయినా సెనేటు సమావేశానికి హాజరు కాకపోయినా, లేక అమెరికా ప్రెసిడెంటుగా అయినా, సెనేటు సభ్యులు తాత్కాలికంగా ఒకరిని సెనేటుకు ప్రెసిడెంటుగా ఎన్నుకోగలరు. కొంతమంది ఆఫీసర్లను కూడా సెనేటుసభ్యులు ఎన్నుకొన గలరు.

ప్రభుత్వాధికారులపై నేరారోపణలను విచారించే అధికారం సెనేటుకు ఉండగలదు. ఆ విధంగా నేరాలు విచారించేముందు సెనేటర్లందరు ధర్మచింతనతో, న్యాయదృష్టితో వ్యవహరించ గలమని ప్రమాణం చేయగలరు. ప్రెసిడెంటును విచారణ చేసేటప్పుడు ప్రధాన న్యాయమూర్తి సెనేటుకు అధ్యక్షత వహించగలడు. సెనేటుకు హాజరైన సభ్యులలో మూడింట రెండు వంతులు అంగీకరించనిదే ఎవరికీ శిక్ష విధించబడదు.

అయితే, ఈ విధంగా ఉద్యోగస్థులను సెనేటు విచారించి నేరం చేసినట్లు నిర్ణయించిన వారిని ఆ పదవినుంచి తొలగించడం, మరే పదవికి అతడు పనికిరాడని నిర్ణయించడం, అమెరికా ప్రభుత్వోద్యోగాల్లో అతన్ని నియమించ రాదని నిర్ణయించడం తప్ప, మరేశిక్ష విధించరాదు. అయినప్పటికీ, ఆ విధంగా నేరం ఆరోపించబడ్డ ఉద్యోగస్థులమీద కోర్టులో కేసుమోపి, విచారణ జరిపించి, శిక్ష విధించవచ్చు.

**4 వ నిబంధన :**— సెనేటర్లను, ప్రజాప్రతినిధులను ఎన్నుకొనవలసిన స్థలాలను, సమయాలను, పద్ధతులను ఆ యా రాష్ట్ర శాసనసభలే నిర్ణయించ గలవు. అయితే, సెనేటర్ల ఎన్నిక స్థలాలు మినహా మిగిలిన ఎన్నికల నిబంధనలను అప్పుడప్పుడు అవసరమైనట్లు చట్టరీత్యా మార్చే అధికారం అమెరికా కాంగ్రెసుకు కలదు.

కనీసం ఏడాదికొకసారయినా అమెరికా కాంగ్రెసు సమావేశం కావాలి. కాంగ్రెసు చట్టరీత్యా అన్యథా నిర్ణయిస్తే తప్ప సాధారణంగా ఆ సమావేశం డిసెంబరులో మొదటి సోమవారంనాడు జరగాలి.

**5 వ నిబంధన :**—శాసనసభ్యుల ఎన్నికలు జరిగే విధానాలు, వారికి ఉండవలసిన యోగ్యతలు, మొదలైన వాటిని నిర్ణయించే అధికారం ఆ శాసనసభలకే వుండగలవు. మొత్తం శాసనసభ్యులలో అధికసంఖ్యాకులు హాజరైతే ఆ సమావేశానికి కావలసిన కనీససంఖ్య (కోరమ్) అవుతుంది. అయితే, ఒక శాసనసభలో కొంతమంది అప్పుడప్పుడు సమావేశాలకు గైరు హాజరైనట్లయితే అటువంటివారిని సమావేశాలకు హాజరయేటట్లు చేయడానికవసరమైన చర్యలు తీసుకోవడానికి ఆ శాసనసభ కొంతమందిని నియమించవచ్చు. గైర్ హాజరయే సభ్యులు శాసనసభ సమావేశాలకు హాజరయేటట్లు చేయడానికవసరమైన పనులను ఆ శాసనసభలే నిర్ణయించగలవు.

తాము అనుసరించదగు కార్యక్రమ విధానాలను ఆ యా శాసనసభలే నిర్ణయించుకోనగలవు. సభానియమాలకు విరుద్ధంగా వ్యవహరించే సభ్యులను శిక్షించే అధికారం శాసనసభలకు ఉండగలదు. మూడింట రెండువంతుల సభ్యులు అంగీకరించే పక్షంలో ఒక సభ్యుని శాసనసభనుంచి బహిష్కరిస్తూ నిర్ణయం చేయవచ్చు.

నిర్ణయాలు మొదలైనవాటిని ప్రకటించే నిమిత్తం ప్రతి శాసనసభకు ఒక జర్నల్ (పత్రిక) ఉండగలదు. రహస్యంగా ఉంచవలసిన విషయాలు తప్ప మిగిలిన వాటన్నింటిని ఆ జర్నల్‌లో ప్రకటించగలరు. సమావేశానికి హాజరైన సభ్యులలో అయిదింట ఒకవంతు సభ్యులు కోరినట్లయితే ఒక విషయంమీద జరిగిన చర్చలో సభ్యుల ఇష్టాయిష్టాలనుకూడా ఆ జర్నల్‌లో నమోదు చేయగలరు.

కాంగ్రెసు సమావేశాలు జరిగే సమయంలో ఏశాసనసభ రెండవదాని అనుమతి లేకుండా మూడురోజులకు మించి వాయిదా వెయ్యరాదు; సెనేటు, ప్రజాప్రతినిధులసభ రెండూకూడా సమావేశమయే భవనాలలోతప్ప మరెక్కడికీ వాటిలో దేనినీ మార్చరాదు.

**6 వ నిబంధన :**—అమెరికా చట్టాలు నిర్ణయించిన విధంగా సెనేటర్లు ప్రభుత్వ కార్యకలాపాలు నిర్వహించినందుకుగాను ప్రభుత్వం

వారికి వేతనాలివ్వగలరు. ప్రభుత్వ ద్రోహం, మహాపరాధం, ప్రజాశాంతికి భంగకరమైన పనులు చేసినప్పుడు తప్ప మరేసందర్భంలోను ఒక శాసన సభా సమావేశంలో పాల్గొంటున్నప్పుడుగాని, సమావేశానికి వెళ్ళు తున్నప్పుడుగాని, సమావేశంనుంచి తిరిగి వెళుతున్నప్పుడుగాని సెనేటర్లలో ప్రజాప్రతినిధులలో ఎవరినీ అరెస్టు చెయ్యరాదు; సెనేటు, ప్రజాప్రతి నిధుల సభలలో జరిగిన చర్చలనుబట్టి వారిమీద కేసులు పెట్టడానికి వీలు లేదు.

సెనేటర్లు సెవరినీ, ప్రజాప్రతినిధుల సెవరిని వారు ఆ పదవుల్లో వున్నంతకాలము అమెరికా సివిల్ ఉద్యోగాల్లో నియమించరాదు. అలాగే అమెరికా ప్రభుత్వోద్యోగులెవరినీ సెనేటర్లుగాగాని, ప్రతినిధులుగా గాని ఎన్నుకోరాదు. ఎన్నికలలో పాల్గొన దల్చుకుంటే ప్రభుత్వోద్యోగులు ఆ వుద్యోగాలను వదలుకోవాలి.

7 వ నిబంధన :- భూమిశిస్తులను ఎక్కువ చేసే శాసనాలన్నింటినీ ప్రజా ప్రతినిధుల సభ చేయగలదు; అందుచేత, ఇతర బిల్లులవలెనే వాటికి కూడా సెనేటు సభవారు కొన్ని సవరణలు ప్రతిపాదించ వచ్చు; లేదా శిస్తు హెచ్చింపునకై ప్రజా ప్రతినిధుల సభ ప్రతిపాదించిన బిల్లులను ఆ విధంగానే సెనేటు సభ ఆమోదించవచ్చు.

ప్రజా ప్రతినిధుల సభవారు గాని, సెనేటు గాని ఆమోదించిన ఒక బిల్లు శాసనం కాకముందు దాన్ని అమెరికా ప్రెసిడెంటు ఆమోదానికి పంపించాలి. ప్రెసిడెంటుకు ఆ బిల్లు ఆమోదించడం ఇష్టమయితే దానిమీద సంతకం చేసి దాన్ని తిరిగి ఆ బిల్లు ప్రతిపాదించిన సభవారికి పంపించ గలడు. ఒకవేళ ఆ బిల్లు శాసనం కావడం ప్రెసిడెంటుకు ఇష్టం లేక పోయినట్లయితే, తన అభ్యంతరాలతో సహా ఆ బిల్లును దానికి సంబంధించిన సభవారికి ఆయన పంపించగలడు. ఆ సభవారు ప్రెసిడెంటు అభ్యంతరాలను తమ జర్నలులో నమోదుచేసుకొని వాటి దృష్టితో ఆ బిల్లును తిరిగి పరిశీలించగలరు. ఆ విధంగా పరిశీలించిన తరువాత కూడా ఏదైనా ఒక బిల్లును శాసనంగా రూపొందించడం మంచిదని ఆ సభ సభ్యుల్లో మూడింట రెండువంతులు అభిప్రాయ పడినట్లయితే ఆ సభవారు ఆ బిల్లును ఆమోదించి, దాని మీద ప్రెసిడెంటు తెలిపిన అభ్యంతరాలతోసహా దాన్ని

రెండవ సభవారి పరిశీలనకు పంపించగలరు. ఆ సభవారుకూడా ఆ బిల్లును అదే విధంగా తిరిగి పరిశీలించి, సభ్యులలో మూడింట రెండు వంతులు అది శాసనంగా రూపొందడం అవసరమని అభిప్రాయపడినట్లయితే, అది శాసనంగా ఆమోదించబడగలదు. అయితే, అటువంటి బిల్లుల విషయంలో వాటిని బలపరచినవారి పేర్లను, వ్యతిరేకించినవారి పేర్లను ఏ సభకు ఆ సభ తన జర్నలులలో నమోదుచేయడ మవసరము. ఒక బిల్లును ప్రెసిడెంటు పరిశీలనకు పంపించిన పది రోజులలోగా (ఆదివారాలు కాక) ఆయన దాన్ని దానికి సంబంధించిన శాసనసభకు పంపించకపోయినట్లయితే ఆయనకు ఆ బిల్లు శాసనంగా రూపొందడం ఇష్టమైనట్లే భావించి దాన్ని చట్టంగా ఆమోదించినట్లవుతుంది. అమెరికా కాంగ్రెసుకు ఆ బిల్లు ఇష్టంలేక పోయి నట్లయితే అది శాసనంగా రూపొందకుండా, సభను పది రోజులకుపైగా వాయిదా వేస్తారు. ఆ విధంగా ప్రెసిడెంటుకు ఇష్టమైన బిల్లును త్రోసి వేయగలరు.

సెనేటుగాని, ప్రజా ప్రతినిధుల సభగాని ఆమోదించే ప్రతి నిబంధన, తీర్మానం మొదలైన వాటిన్నింటినీ అమెరికా ప్రెసిడెంటు ఆమోదానికి పంపించవలసిందే. అవి చట్టంగా రూపొందక పూర్వం ప్రెసిడెంటు వాటిని ఆమోదించవ మవసరము. ఆయన వాటిని ఆమోదించకపోతే, ప్రజా ప్రతినిధుల సభ, సెనేటు సభ్యులలో మూడింట రెండువంతుల మంది ఆమోదం వున్నట్లయితే ఇతర శాసనాలవలెనే అవి శాసనాలుగా రూపొంద గలవు.

**8 వ నిబంధన:**— అన్నిరకాల పన్నులు, సుంకాలు విధించే అధికారం అమెరికా కాంగ్రెసుకే ఉండగలదు. అమెరికా కాంగ్రెసే దేశం మొత్తానికి సంబంధించిన అప్పులు చెల్లించగలదు. దేశ రక్షణ మొదలైన దేశానికంతటికి సంబంధించిన శాఖలకయ్యే ఖర్చులు అమెరికా కాంగ్రెసే భరించగలదు. అమెరికా వివిధ రాష్ట్రాలలో ఒకే రకమైన పన్నులు విధించబడగలవు.

అమెరికా కాంగ్రెసు ఇంకా యీ క్రింది పనులు చేయగలదు:

అమెరికా తరఫున అవసరమైనప్పుడు ఇతర దేశాలనుంచి అప్పు చేయడం;

అమెరికా విదేశాలతో చేసే వ్యాపారాన్ని సక్రమంగా నడిపించడం; వివిధ రాష్ట్రాల మధ్య జరిగే వాణిజ్యాన్ని, అమెరికన్ ఇండియన్లతో జరిగే వ్యాపారాన్ని సక్రమంగా నడిపించడం;

అమెరికాలోని వివిధ రాష్ట్రాల్లో ఒకే రకమైన బ్యాంకరప్సీ సూత్రాలను అమలుపరచడానికి అనుగుణంగా శాసనాలు చేయడం;

నాణాలు ముద్రించి, వాటికి సముంజసమైన విలువ నిర్ణయించడం; విదేశీ నాణాల విలువ నిర్ణయించడం; తూనికలు, కొలతల ప్రమాణం నిర్ణయించడం;

అమెరికాలో చలామణీలో వున్న కరెన్సీకి ప్రమాదం తెచ్చే వారిని శిక్షించడానికి కావలసిన నిబంధనలు చేయడం;

పోస్టాఫీసులు, తపాలా మార్గాలు ఏర్పాటుచేయడం;

శాస్త్రవేత్తలు కనిపెట్టే పరికరాలకు, రచయితలు వ్రాసే గ్రంథాలకు కొంత కాలం పాటు సర్వహక్కుల నివ్వడంద్వారా, శాస్త్రవేత్తలకు, రచయితలకు చేయూతనిచ్చి విజ్ఞానాభివృద్ధికి పాటుపడడం;

సుప్రీంకోర్టుకు అనుబంధంగా చిన్న న్యాయస్థానాలు నెలకొల్పడం;

అమెరికన్ నౌకలను ఓడ దొంగలనుంచి కాపాడడ; ఓడ దొంగలను పట్టి శిక్షించడం;

యుద్ధాలు ప్రకటించడం; ఇతర దేశాలవారు పట్టుబడ్డ అమెరికన్లను గాని, లేక అమెరికన్ల ఆస్తులనుగాని తిరిగి అమెరికాకు స్వాధీనం చేయవలసిందిగా విదేశాలతో వ్యవహారం జరపడం;

సైన్యాలను ఏర్పరచి వాటిని సక్రమంగా పోషించడం; అయితే, వాటికయ్యే ఖర్చులు ఒక్కొక్కసారి రెండేండ్లకంటె ఎక్కువ కాలానికి మంజూరు చేయరాదు.

నౌకాదళాన్ని ఏర్పరచి పోషించడం; ప్రభుత్వ నిబంధనలను నిర్ణయించడం; నౌకా పదాతి దళాలు అనుసరించ వలసిన నిబంధనలు నిర్ణయించడం;

దండయాత్రలను ఎదుర్కొనడానికి, దేశంలో జరిగే సాయుధ విప్లవాల నణచడానికి, యూనియన్ నిబంధనల నమలు జరపడానికి అవసరమైన సైన్యాలను సమకూర్చడం;

అమెరికా ప్రభుత్వానికవసరమైన సైన్యాలన్నింటినీ నెలకొల్పి, వాటికవసరమైన శిక్షణనిచ్చి, వివిధ రాష్ట్రాలకు అవసరమైన సైన్యాలను, సైనికోద్యోగులను ప్రత్యేకించడం; అమెరికా కాంగ్రెసు నిర్ణయించిన నిబంధనల ప్రకారం సైన్యాలకు శిక్షణ ఇవ్వడానికై తగు సైనికోద్యోగులను, ఇతర ఉద్యోగస్థులను నియమించడం.

కొన్ని రాష్ట్రాలకు చెందిన చిన్న భాగాలతో ఒక కొత్త జిల్లాను ఏర్పాటు చేసినప్పుడు (దాని వైశాల్యం పది చదరపు మైళ్ళు మించరాదు) ఆ జిల్లాకు వర్తించగల శాసనాలన్నింటినీ కాంగ్రెసు చెయ్యడం; కాంగ్రెసు అనుమతితో కోటలుగాని, నౌకాశ్రయాలు మొదలైనవిగాని కట్టడానికై కొనిన ప్రాంతాలన్నింటికి వర్తించగల చట్టాలనుకూడా చెయ్యడం;

అమెరికా ప్రభుత్వానికి, దాని ఉపశాఖలకు, కార్యాలయాలకు, రాజ్యాంగం ప్రకారం సిద్ధిస్తున్న పై అధికారాలను, ఇంకా ముందు పేర్కొనబడనున్న అధికారాలను అమెరికా ప్రభుత్వం అమలు పరచడానికి అవసరమైన చట్టాలు చేయడం.

**9 వ నిబంధన :**— ప్రస్తుతం అమెరికాలో ఉన్న వివిధ రాష్ట్రాలలోకి ఏ దేశంనుంచైనా ఎవరైనా పదెనిమిదివందల ఎనిమిదవ సంవత్సరానికిపూర్వం వలస రాదలచుకొంటే, అమెరికా కాంగ్రెసు దానికి అభ్యంతరం చెప్పరాదుగాని, ఒక్కొక్క వ్యక్తికి 10 డాలర్లకు మించని పన్ను విధించవచ్చు.

ప్రజాశాంతికి భంగకరమైన దండయాత్ర, తిరుగుబాటు మొదలైన సందర్భాలలోతప్ప మరే సందర్భంలోనూ, హెబియస్ కార్పస్ దరఖాస్తు పెట్టుకునే సౌకర్యం ఎవరికీ నిరాకరించరాదు.

దేశం కీర్తిప్రతిష్ఠలకు కళంకం కలిగించే బిల్లులనుగాని, గతంలో జరిగిన సంఘటనలకు వర్తించే చట్టాలనుగాని ఇప్పుడు చేయరాదు.

ఈ రాజ్యాంగంలో సూచించబడిన విధంగా జనాభా లెక్కలు తయారుచేయక పూర్వము తలపన్నువంటి పన్నులు విధించరాదు.

రాష్ట్రాలమధ్య ఎగుమతిజరిగే వస్తువులమీద సుంకాలు విధించరాదు.

ఒక రాష్ట్రంలోని ఓడరేవులకు వాణిజ్య సుంకాలు, పన్నులు విషయంలో ఇతర రాష్ట్రాల రేవులకన్న ఎటువంటి ప్రత్యేక సౌకర్యాలు కలిగించరాదు. అంతేగాక, ఒక రాష్ట్రం నౌకలు మరొక రాష్ట్రానికి వస్తువులు తీసుకువెళ్ళినా, లేక వస్తువులు తీసుకువస్తున్నా, లేక వస్తువులను ఆ రాష్ట్రాని కందజేసి తిరిగి వస్తున్నా, ఆ రెండో రాష్ట్రంలో సుంకాలు చెల్లించ నవసరం లేదు.

చట్టంలో కేటాయించిన విధంగా తప్ప, మరే సందర్భంలోను ఎవరూ ఏ పనికీ ప్రభుత్వ (ఖజానానుంచి) ధనం ఖర్చు చెయ్యరాదు; ప్రభుత్వ ధనం జమాఖర్చులను వివరంగా అప్పుడప్పుడు ప్రకటించాలి.

అమెరికా ప్రభుత్వం ఎవరికీ గౌరవ బిరుదు లివ్వరాదు; అమెరికా ప్రభుత్వోద్యోగులుగా పనిచేసే వారెవరూ అమెరికా కాంగ్రెసు అనుమతి లేకుండా ఏ రాజు వద్దనుంచిగాని, ఏ విదేశ ప్రభుత్వం వద్దనుంచిగాని ఎటువంటి బహుమతిని స్వీకరించరాదు; ధనం బహుమానంగా పొందరాదు. ఉద్యోగాలనుగాని, గౌరవ బిరుదులనుగాని కాంగ్రెసు అనుమతి లేకుండా స్వీకరించరాదు.

10 వ నిబంధన:—విదేశాలతో ఒప్పందాలు, ఒడంబడికలు మొదలైన సంబంధాలు ఏ రాష్ట్రము పెట్టుకోరాదు. విదేశాల స్వాధీనమైన వస్తువులనుగాని, మనుష్యులనుగాని తనకు తిరిగి స్వాధీనం చేయమని ఏ రాష్ట్రము స్వయంగా ఆ యా విదేశాలను కోరరాదు; ఏ రాష్ట్రము నాణాలు ముద్రించరాదు; అప్పు లిచ్చి పత్రాలు వ్రాయించుకోరాదు; అప్పు లన్నింటిని బంగారు వెండి నాణాలలోనే తప్ప మరోవిధంగా చెల్లించరాదు; ఎవరికీ గౌరవ బిరుదు లివ్వరాదు; గతంలో జరిగిన కంట్రాక్టులు మొదలైన వాటికి ప్రమాదం తెచ్చిపెట్టే బిల్లులు, దేశానికి కళంకం తెచ్చే బిల్లులు మొదలైన వాటిని ఏ రాష్ట్రము ఆమోదించరాదు.

తన రాష్ట్రంనుంచి ఎగుమతయ్యే సరుకులు, తన రాష్ట్రానికి దిగుమతి అయ్యే సరుకులను పరీక్షించడానికి అవసరమైన ధనం సేకరించడానికి తప్ప, మరేరకమైన సుంకాలను ఆ యా వస్తువులమీద ఏ రాష్ట్ర ప్రభుత్వము అమెరికా కాంగ్రెసు అనుమతిలేకుండా విధించరాదు. ఎగుమతి, దిగుమతుల మీద ఆ యా రాష్ట్ర ప్రభుత్వాలు వసూలుచేసే పన్నుల్లో వాటి ఖర్చులు

పోను మిగిలిన సొమ్మును అమెరికా ప్రభుత్వపు ఖజానాకు చెల్లించాలి. రాష్ట్ర ప్రభుత్వాలు ఎగుమతులు, దిగుమతులుమీద సుంకాలు, పన్నులు విధిస్తూ చేసే చట్టాలను అమెరికా కాంగ్రెసు సవరించవచ్చు. అమెరికా కాంగ్రెసు అనుమతి లేకుండా ఏ రాష్ట్ర ప్రభుత్వము వాణిజ్య నౌకల మీద పన్నులు విధించరాదు. శాంతికాలంలో సైన్యాలను, యుద్ధ నౌకలను ఏ రాష్ట్ర ప్రభుత్వానికి వుండరాదు. తనమీదకు ఏ విదేశమో దండ యాత్రకు వచ్చినప్పుడు, లేక అటువంటి పెద్ద ప్రమాదమేదో ముంచుకువచ్చి వ్యవధి లేనప్పుడు తప్ప, ఏ రాష్ట్ర ప్రభుత్వము అమెరికా కాంగ్రెసు అనుమతిలేకుండా మరొక రాష్ట్రంతో ఒప్పందం చేసుకోరాదు; యుద్ధానికి దిగరాదు. విదేశాలతో ఏ రాష్ట్రము కాంగ్రెసు అనుమతిలేకుండా యుద్ధానికి దిగరాదు.

## 2 వ సూత్రం

1 వ నిబంధన:—పరిపాలనాధికారాలన్నీ అమెరికా ప్రెసిడెంటుకే వుండగలవు. ఆయన, వైస్ ప్రెసిడెంటుకూడా ఎన్నికయిన తరువాత నాలుగేండ్లపాటు అధికారంలో వుండగలరు. వారిద్దరు ఈ క్రిందివిధంగా ఎన్నుకోన బడగలరు:

అమెరికా కాంగ్రెసులోను, ప్రజా ప్రతినిధుల సభలోను, సెనేటులోను ఏరాష్ట్రంనుంచి ఎంతమంది సభ్యులుండగలరో, అంతమంది ఎలక్టర్లను ఆ రాష్ట్ర ప్రభుత్వం నియమించ గలదు. లేదా ఈ ఎలక్టర్ల సంఖ్యను ఆ రాష్ట్ర శాసనసభ మరొక విధంగా నిర్ణయించవచ్చు. అయితే, అమెరికా ప్రభుత్వోద్యోగాల్లో పనిచేసేవా రెవరినీ సెనేటర్లుగా గాని, ప్రజా ప్రతినిధులుగా గాని, ఎలక్టర్లుగా గాని నియమించరాదు.

తదనంతరం ఎలక్టర్లు తమ రాష్ట్రాల్లో సమావేశమై ఇద్దరిని బాలట్ ద్వారా ఎన్నుకోన గలరు. ఈ యిద్దరిలో కనీసం ఒక్కరైనా తమ రాష్ట్ర వాసి కానివాడై వుండాలి. ఆ వోటింగులో పాల్గొన్నవారి పేర్లను, ఆ యిద్దరు అభ్యర్థులలో ఒక్కొక్కరికి వచ్చిన వోట్ల జాబితాను తయారుచేసి, వాటిమీద ఎలక్టర్లు సంతకాలు చేసి, తాము ఆ ఎన్నికలను నడిపినట్లు తమ ధ్రువపత్రాలను ఆ జాబితాలతో జతపరచి, సీల్చువేసి

అమెరికా ప్రభుత్వం ద్వారా సెనేటు ప్రెసిడెంటుకు వాటిని పంపించాలి. ప్రజా ప్రతినిధులసభ, సెనేటుల సమక్షాన సెనేటు ప్రెసిడెంటు ఆ సీళ్ళను పగలగొట్టి, ఎలక్టర్ల ధ్రువపత్రాలు సరిచూచి, వోట్లు లెక్కించగలడు. మొత్తం ఎలక్టర్లలో మెజారిటీ వోట్లు వచ్చిన అభ్యర్థి అమెరికా ప్రెసిడెంటుగా పరిగణించబడగలడు. అయితే, ఒకరికన్న ఎక్కువ మందికి ఆ విధంగా ఆ ఎన్నికల్లో మెజారిటీ వోట్లు వచ్చినా, ఇద్దరికీ సమంగా వోట్లువచ్చినా, ప్రజా ప్రతినిధులసభవారు వెంటనే సమావేశమై బ్యాలట్ ద్వారా ప్రెసిడెంటును ఎన్నుకోగలరు;ఎలక్టర్లు జరపిన ఎన్నికల్లో ఏ ఒక్కరికీ మెజారిటీ వోట్లు రాకపోయినట్లయితే, ఎక్కువ వోట్లువచ్చిన మొదటి అయిదుగురిలో ఒకర్ని ప్రజా ప్రతినిధుల సభవారు బ్యాలట్ ద్వారా ప్రెసిడెంటుగా ఎన్నుకోగలరు. అయితే, ప్రెసిడెంటు ఎన్నికలో ప్రతి రాష్ట్రము ఒక ప్రతినిధిద్వారా పాల్గొనాలి. ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క వోటు వుండగలదు. మొత్తం అమెరికాలోని రాష్ట్రాలన్నింటిలో మూడింట రెండువంతులు ఈ ఎన్నికకు కనీస సంఖ్యగా (కోరం) నిర్ణయించ బడగలదు. ఎన్నికలో మెజారిటీ వోట్లు వచ్చిన అభ్యర్థే గెలిచినట్లు నిర్ణయించ బడగలదు. ప్రెసిడెంటు ఎన్నికలో ఆయన తరువాత ఎక్కువ వోట్లు వచ్చిన అభ్యర్థి అమెరికా వైస్ ప్రెసిడెంటుగా పరిగణించ బడాలి. అయితే, ఆ విధంగా ఎక్కువవోట్లు (సమంగా) వచ్చిన అభ్యర్థులు ఇద్దరు గాని, ఇంకా ఎక్కువమంది గాని వున్నట్లయితే, సెనేటు బ్యాలట్ ద్వారా వైస్ప్రెసిడెంటును ఎన్నుకోగలదు.

ఎలక్టర్ల ఎన్నికల తేదీని కాంగ్రెసే నిర్ణయించ గలదు. అమెరికా అంతట అదేరోజున ఆ ఎన్నికలు జరగాలి.

ఈ రాజ్యాంగం అమల్లోకి వచ్చేటప్పటికి అమెరికా పౌరుడు, అమెరికా నివాసి, కనీసం ముప్పయి అయిదేండ్ల వయస్సున్నవాడు, అమెరికాలో కనీసం పధ్నాలుగేండ్లయినా నివసించినవాడు మాత్రమే అమెరికా ప్రెసిడెంటు పదవికి అర్హుడు.

ఒకవేళ ఏ సందర్భంలోనైనా అమెరికా ప్రెసిడెంటు తొలగించ బడినా, లేక మరణించినా, లేక ఏ కారణం చేతనైనా రాజీనామాచేసినా,

వైస్ ప్రెసిడెంటు ప్రెసిడెంటుగా పనిచేయగలడు. ఒకవేళ ఏ కారణం చేతనైనా, ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు పదవులు రెండూ ఖాళీ అయినట్లయితే, ఏ వుద్యోగి ఆ పదవిని నిర్వహించ వలసిందీ అమెరికా కాంగ్రెసు శాసనరీత్యా నిర్ణయించవచ్చు. ఆ విధంగా నియామకుడైన వుద్యోగి, ప్రెసిడెంటుగా పనిచేయగలడు.

అమెరికా ప్రెసిడెంటుకు ఆ పదవిలో వున్నంతకాలం వేతనమివ్వబడగలదు. ఆ వేతనం ఎక్కువగాని, తక్కువగాని చేయబడదు. ప్రెసిడెంటు పదవిలో వున్నంతకాలం ఆ వ్యక్తి అమెరికా ప్రభుత్వంనుంచి మరేవిధంగానూ ధనాన్ని తీసుకోరాదు.

ప్రెసిడెంటు పదవిని స్వీకరించేముందు ఆయన యీ విధంగా ప్రమాణం చెయ్యాలి: "శక్తి వంచనలేకుండా అమెరికా ప్రెసిడెంటు పదవిని నిర్వహించగలను. అమెరికా రాజ్యాంగం అమల్లోకి రావడానికి, దాని రక్షణకు, హృదయ పూర్వకంగా శాయశక్తులా నేను ప్రయత్నించ గలనని వాగ్దానం చేస్తున్నాను."

**2 వ నిబంధన :—** అమెరికా సైన్యాలకు, నౌకాదళానికి, రాష్ట్ర ప్రభుత్వాల సేనలు అమెరికా సైన్యాలుగా పని చేసేటప్పుడు వాటికి ప్రెసిడెంటే సర్వసైన్యాధ్యక్షుడు. అవసరమైనప్పుడు వివిధ శాఖోద్యోగులు తమశాఖలకు సంబంధించిన ఏ విషయాలను గురించిన వివరాలనైనా వ్రాతపూర్వకంగా తనకు తెలియచేయమని అమెరికా ప్రెసిడెంటు కోరవచ్చు. నేరాలుచేసిన ఉద్యోగుల విషయంలో తప్ప, ఇతర నేరస్థులకు విధించబడే శిక్షలను కొంతకాలంపాటు ఆపడానికి, లేక నేరాలను మన్నించడానికి, లేక అమెరికా ప్రభుత్వ నియమాలను ఉల్లంఘించినవారిని క్షమించడానికి అమెరికా ప్రెసిడెంటుకు అధికారం ఉండగలదు.

సెనేటును సంప్రతించి, సెనేటు సభ్యుల్లో మూడింట రెండువంతులు అంగీకరించినట్లయితే ఒప్పందాలు చేసుకొనే అధికారం ప్రెసిడెంటుకు కలదు. ఈ రాజ్యాంగ చట్టంలో మరొక విధంగా నియమించాలని పేర్కొనని ఇతర ఉద్యోగస్థులను అమెరికా ప్రెసిడెంటు, సెనేటును సంప్రతించి, ఆ సభ ఆమోదంతో నామినేట్ చేయవచ్చు ; లేదా నియమించవచ్చు. రాయబారులు, మంత్రులు, కాన్సల్సు, సుప్రీమ్‌కోర్టు

న్యాయమూర్తులు ఈ విధంగా నియమించబడగలరు. ఈ రాజ్యాంగ చట్టంలో మరొక విధంగా పేర్కొనబడిన వుద్యోగస్థులు ఆ యా శాసనాల దృష్ట్యా నియుక్తులు కాగలరు. వారి విషయంలో పై నిబంధన వర్తించదు. అయితే, తనకు సమంజసమని తోచిన చిన్న చిన్న వుద్యోగస్థులను నియమించే అధికారాలను, అమెరికా ప్రెసిడెంటుకుగాని, న్యాయస్థానాలకు గాని, ఆ యా శాఖల అధికారులకుగాని అమెరికా కాంగ్రెసు యివ్వవచ్చు.

సెనేటు సమావేశంకాని సమయాన ఏర్పడే ఖాళీ లన్నింటిలోను, కమీషన్ల రూపాన అమెరికా ప్రెసిడెంటు ఉద్యోగస్థులను నియమించగలడు; అయితే, సెనేటు తిరిగి సమావేశ మయేవరకే ఆ వుద్యోగాలు అమల్లో వుండగలవు.

**3 వ నిబంధన:**—రాజ్యస్థితిని గురించి, అత్యవసరంగా అమలు జరపాలని తాను భావిస్తున్న చర్యలను గురించి అమెరికా ప్రెసిడెంటు అప్పుడప్పుడు కాంగ్రెసుకు తెలియచెయ్యాలి; అత్యవసర పరిస్థితుల్లో సెనేటును, ప్రజా ప్రతినిధుల సభను, రెండింటినీ గాని, ఏ ఒక్క సభను గాని అమెరికా ప్రెసిడెంటు సమావేశ పరచవచ్చు; ఆ సభల సమావేశాల వాయిదాలను గురించి ఆ రెండింటి మధ్య అభిప్రాయభేద మేర్పడినప్పుడు అవసరమని తనకు తోచినంత కాలం ప్రెసిడెంటు సభలను వాయిదా వెయ్యవచ్చు; విదేశ రాయబారులు, మంత్రులు మొదలైన వారి కాయన స్వాగత మివ్వగలడు. అమెరికా ప్రభుత్వ నిబంధనలన్నీ సక్రమంగా అమలు జరిగేటట్లు ఆయన జాగ్రత్త వహించాలి; అమెరికా ప్రభుత్వోద్యోగులందరినీ ఆ వాయిదా కాలంలో ఆయనే నియమించగలడు.

**4 వ నిబంధన:**—దేశద్రోహము, లంచాలు, మొదలైన పెద్ద నేరాలు చేసిన సందర్భాల్లో ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు, ఇతర ఉద్యోగస్థులు విచారణ చెయ్యబడగలరు. ఆ విధంగా నేరాలు రుజువయినవారు ఆ యా పదవులనుంచి తొలగించబడగలరు.

## 3 వ సూత్రం

**1 వ నిబంధన :**—న్యాయవిచారణ జరిపే అధికారం అమెరికా సుప్రీంకోర్టుకు, అమెరికా కాంగ్రెసు ఆ యా సందర్భాలనుబట్టి ఏర్పరిచే చిన్న

కోర్టులకు ఉండగలదు. సక్రమంగా ప్రవర్తించినంత కాలము సుప్రీంకోర్టు న్యాయమూర్తులు, తదితర చిన్న కోర్టుల న్యాయమూర్తులు అధికారంలో ఉండగలరు. వారు ఆ యా పదవులలో ఉన్నంతకాలం వారికి వేతనాలు లభించగలవు; వారు ఉద్యోగంలో వున్నంతకాలం వారి వేతనాలు తగ్గించ బడవు.

**2 వ నిబంధన** :—ఈ రాజ్యాంగం ఆమోదిస్తున్న న్యాయవిచారణాధికారాలు, అమెరికా చట్టాలు, అమెరికా చేసుకున్న ఒప్పందాలు, ముమ్ముందు చేసుకొననున్న ఒప్పందాలు సమంగా, న్యాయంగా ఈ క్రింద పేర్కొనబడినవారికి, ఆ యా విషయాలకు కూడా వర్తించగలవు;

రాయబారులు, మంత్రులు, కాన్సల్సుకు సంబంధించిన కేసులు;

నౌకాశాఖోద్యోగులు, సముద్రతీరమండలి ప్రత్యేకోద్యోగులకు సంబంధించిన కేసులు;

అమెరికాకు సంబంధమున్న వివిధ తగాదాలు;

అమెరికాలోని రెండు రాష్ట్రాలకు లేక కొన్ని రాష్ట్రాల మధ్య వచ్చే వివాదాలు;

ఒక రాష్ట్రప్రభుత్వానికి మరొక రాష్ట్రంలోని ప్రజలకు వచ్చే వివాదాలు;

వివిధ రాష్ట్ర ప్రజల మధ్య వచ్చే వివాదాలు;

ఒకే రాష్ట్రంలోని ప్రజలకు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు ఇచ్చిన భూముల విషయంలో వారి మధ్య వచ్చే వివాదాలు;

ఒక రాష్ట్రప్రభుత్వానికి, లేక అందులోని కొంతమంది పౌరులకు విదేశీయులతోగాని, విదేశాల ప్రభుత్వాలతోగాని వచ్చే వివాదాలు;

రాయబారులు, మంత్రులు, కాన్సల్సుకు సంబంధమున్న ప్రభుత్వాభియోగాలు సుప్రీంకోర్టు చేతనే మొదట విచారణ చెయ్యబడగలవు. ఇటువంటి అభియోగాలు తప్ప మిగిలిన అభియోగాలకు సంబంధించిన అప్పీళ్ళు సుప్రీంకోర్టు విచారించగలదు. అయితే, పైన పేర్కొనబడిన కేసులలో కొన్నింటినికూడా మరొక విధంగా విచారించాలని అమెరికా కాంగ్రెసు శాసనరీత్యా నిర్ణయించవచ్చు. అటువంటి అభియోగాలుకూడా సుప్రీం కోర్టు విచారణకు రాకపోవచ్చు.

నేరాలు చేసిన ఉద్యోగస్థుల విచారణ తప్ప మిగిలిన అభియోగా లన్నింటినీ జూరీల సంఘంవారే విచారించగలరు; నేరాలు జరిగిన స్థలాల్లోనే వాటికి సంబంధించిన కేసులను విచారించాలి; అయితే, ఒక నేరం జరిగిన స్థలం ఏ రాష్ట్రంలోను చేరక పోయినట్లయితే, కాంగ్రెసు శాసనరీత్యా నిర్ణయించే స్థలంలోగాని, స్థలాల్లోగాని, ఆ నేరం విచారించబడాలి.

3 వ నిబంధన :—అమెరికామీద యుద్ధం తలపెట్టినవారు, లేదా అమెరికాకు శత్రువులైనవారి పక్షాన చేరినవారు, అట్టివారికి ఆర్థికంగా గాని మరి ఏ విధంగానైనా సహాయపడ్డవారు మాత్రమే దేశద్రోహులుగా పరిగణించబడగలరు. నేరం చేసినట్లు ఇద్దరు సాక్షులు రుజువు చెయ్యాలిదే, లేక ఆ నేరస్థుడు న్యాయస్థానంలో బహిరంగంగా తన నేరాన్ని అంగీక రించనిదే, దేశద్రోహ నేరం క్రింద ఎవరినీ శిక్షించరాదు.

దేశద్రోహులకు ఎట్టి శిక్షలు విధించడమో నిర్ణయించే అధికారం అమెరికా కాంగ్రెసుకు కలదు.

## 4 వ సూత్రం

1 వ నిబంధన :—ఒక రాష్ట్రంలో అమలులో గల చట్టాలు, ప్రభుత్వ పత్రాలు, న్యాయ విచారణ విధానాలు మొదలైన వాటిని మరొక రాష్ట్రం మన్నించి గౌరవించాలి. ఈ కార్యక్రమం అమలు జరుగ వలసిన పద్ధతులను అన్ని రాష్ట్రాలకు వర్తించే శాసనాలద్వారా అమెరికా కాంగ్రెసు నిర్ణయించగలదు.

2 వ నిబంధన :—ప్రతి రాష్ట్రంలోని ప్రజలకు అమెరికాలో అన్ని రాష్ట్రాలలో పౌరస్వత్వాలు, హక్కులు ఉండగలవు.

ఒక రాష్ట్రంలో దేశద్రోహ నేరం మొదలైన మహాపరాధ మేదైనా చేసి, న్యాయస్థానాలకు చిక్కకుండా మరొక రాష్ట్రానికి పారిపోయిన వ్యక్తిని నేరం జరిగిన రాష్ట్ర ప్రభుత్వం కోరగానే రెండవ రాష్ట్రం పంపించి వెయ్యాలి. అతనిని విచారణ చెయ్యడానికి అధికారం గల న్యాయస్థాన మున్న ప్రాంతానికి ఆ వ్యక్తిని పంపించాలి.

ఒక రాష్ట్రంలో పనిచేస్తున్న ఒక వుద్యోగి అక్కడినుంచి తప్పించు కొని మరొక రాష్ట్రానికి పారిపోయి, అక్కడ మరొక వుద్యోగంలో

చేరినట్లయితే, అతని తప్పిదం తెలిసినప్పటికీ రెండవ రాష్ట్ర ప్రభుత్వం ఆ వ్యక్తిని వుద్యోగం నుంచి బర్తరఫ్ చేయరాదు. కాని, అతడు మొదట వచ్చిన రాష్ట్ర ప్రభుత్వం కోరినప్పుడా వ్యక్తిని స్వాధీనం చేయాలి.

3 వ నిబంధన :— ఈ యూనియన్‌లోకి అమెరికా కాంగ్రెసు కొత్త రాష్ట్రాలను చేర్చుకోవచ్చు. అయితే, ఒక రాష్ట్రం సరిహద్దులో గల కొంత ప్రాంతంతో మరొక క్రొత్త రాష్ట్రాన్ని ఏర్పరచరాదు. అమెరికా కాంగ్రెసు, ఆ యా రాష్ట్ర శాసనసభల అనుమతి లేకుండా రెండు మూడు రాష్ట్రాల్లో గల కొంత భాగంతో క్రొత్త రాష్ట్రాన్ని ఏర్పరచరాదు.

అమెరికా సరిహద్దులకు, లేక యితర ఆస్తులకు భద్రత కలిగించేటందుకు అనుగుణంగా అమెరికా కాంగ్రెసు శాసనాలు చేయగలదు. మొత్తం అమెరికా సంయుక్త రాష్ట్రాలకు గాని, లేక ఏ ఒక్క రాష్ట్రం హక్కులకు గాని భంగం కలిగించే విధంగా ఈ రాజ్యాంగంలోని ఏ భాగానికీ అర్థం చెప్పరాదు.

4 వ నిబంధన :— తన యూనియన్‌లోని ప్రతి రాష్ట్రము రిపబ్లికు ప్రభుత్వాన్ని ఏర్పరచుకొనగల హక్కుకు అమెరికా హామీ యిస్తోంది. వాటిలో వేటిమీద దండయాత్ర జరగకుండా అమెరికా ప్రభుత్వం వాటికి రక్షణ కలిగించగలదు. ఆ యా రాష్ట్ర శాసన సభలు గాని, అవి సమావేశమయేటంత వ్యవధి లేకపోయినట్లయితే ఆ శాసనసభల కార్యవర్గాలు గాని కోరిన మీదట అక్కడ జరిగే అంతర్యుద్ధాలనుంచి కూడా రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వం రక్షణ కలిగించగలదు.

## 5 వ సూత్రం

సెనేటు, ప్రజా ప్రతినిధుల సభల సభ్యులలో మూడింట రెండు వంతులు అవసరమని భావించినప్పుడెల్ల అమెరికా కాంగ్రెసు ఈ రాజ్యాంగానికి సవరణలు ప్రతిపాదించగలదు. లేదా వివిధ రాష్ట్ర శాసనసభలలో మూడింట రెండువంతులు ఈ రాజ్యాంగానికి సవరణలు ప్రతిపాదిస్తూ దరఖాస్తు పెట్టవచ్చు. పై రెండు పద్ధతుల్లో యేపద్ధతి ప్రకారం సవరణలు ప్రతిపాదించబడినా, వివిధ రాష్ట్ర శాసనసభలలో నాలుగింట మూడువంతులు వాటిని ఆమోదించినప్పుడు అవి రాజ్యాంగంలో భాగాలు

కాగలవు. పై రెండు విధానాలలో ఏదో వొక పద్ధతి ననుసరించమని అమెరికా కాంగ్రెసు సూచించగలదు; అయితే, పందొమ్మిదివందల ఎనిమిదవ సంవత్సరానికి పూర్వం ఈ రాజ్యాంగానికి సూచించబడే ఏ సవరణవల్ల 1 వ సూత్రంలోని 9 వ నిబంధనలోగల మొదటి నాలుగు విభాగాల కెటువంటి ప్రమాదం గాకూడదు ; ఒక రాష్ట్రంతో సంప్రతించకుండా, ఆ రాష్ట్రానికి సెనేటులోగల వోటింగు హక్కును తొలగించరాదు.

## 6 వ సూత్రం

ఈ రాజ్యాంగం అమల్లోకి రాకపూర్వం అమెరికా చేసిన రుణాలు, తదితర ఒప్పందాలను, ఈ రాజ్యాంగం అమల్లోకి వచ్చిన తరువాతకూడా అమెరికా కట్టుబడి ఉండగలదు.

ఈ రాజ్యాంగానికి అనుగుణంగా అమెరికా ప్రభుత్వం శాసనాలు చేయగలదు. ఈ శాసనాలు, రాజ్యాంగం—వీటికి అనుగుణంగానే అమెరికా ప్రభుత్వం ఒప్పందాలు చేసుకోనగలదు. గతంలో చేసుకొన్న ఒప్పందాలు కూడా ఈ రాజ్యాంగానికి వర్తించగలవు. ఈ రాజ్యాంగంలోని సూత్రాలకు నిబంధనలకు వివిధ రాష్ట్రాల్లోని న్యాయమూర్తులు కట్టుబడి వుండాలి.

ఈ రాజ్యాంగంలో వివరించబడిన సెనేటర్లు, ప్రజా ప్రతినిధులు, రాష్ట్ర శాసన సభ్యులు, న్యాయ విచారణాధికారులు, తదితర ఉద్యోగస్థులు ప్రమాణ స్వీకరణద్వారా ఈ రాజ్యాంగాన్ని బలపరచాలి; అయితే, అమెరికా ప్రభుత్వోద్యోగాలలో దేనికైనా యోగ్యతా యోగ్యతలు నిర్ణయించేటప్పుడు ఎటువంటి ఉద్యోగాల్లోను కూడా ఆ వుద్యోగాలకు దరఖాస్తులు పెట్టుకునే అభ్యర్థులకు గల మత విశ్వాసాలను పరీక్షించ నవసరం లేదు.

## 7 వ సూత్రం

తొమ్మిది రాష్ట్రాలు ఈ రాజ్యాంగాన్ని ఆమోదిస్తే సరిపోగలదు. తత్ఫలితంగా అన్ని రాష్ట్రాల్లోనూ ఈ రాజ్యాంగం అమల్లోకి రాగలదు.

మన క్రీస్తు ప్రభువు అనంతరం ఒక వెయ్యి ఏడువందల ఎనుబది ఏడవ సంవత్సరం సెప్టెంబరు పదునేడవ రోజున ఇక్కడ హాజరైన రాష్ట్రాల

ప్రతినిధుల ఏకగ్రీవామోదంతో, అమెరికా స్వాతంత్ర్య ప్రకటనకు అనుగుణంగా ఈ రాజ్యాంగచట్టం రూపొందించబడింది. ఇందుకు సాక్షులుగా ఈ క్రింద పేర్లు గలవారము సంతకాలు చేశాము.

జార్జి వాషింగ్టన్,
ప్రెసిడెంటు;
వర్జీనియా రాష్ట్రం ప్రతినిధి.

ఎటెస్ట్ :
విలియం జాక్సన్, సెక్రెటరీ.

న్యూ హాంప్‌షైర్

జాన్ లాంగ్డన్ — నికొలస్ గిల్మన్

మసాచుసెట్స్

నెథేనియల్ గోర్హాం — రూఫస్ కింగ్

కనెక్టికట్

విలి. శాం. జాన్సన్ — రాజర్ షెర్మన్

న్యూయార్క్

అలెగ్జాండర్ హామిల్టన్

న్యూజెర్సీ

విలి. లివింగ్‌స్టన్ — విలి. పాటర్సన్
డేవిడ్ బ్రియర్లీ — జో నా. డేటన్

పెన్సిల్వేనియా

బి. ఫ్రాంక్లిన్ — థా. ఫిట్స్‌సైమన్స్
థామస్ మిఫ్లిన్ — జారెడ్ ఇంజెర్‌సాల్
రా. మారిస్ — జేమ్స్ విల్సన్
జా. క్లైమర్ — గావ్. మారిస్

డెలవేర్

జా. రీడ్ — రిచర్డ్ బాసెట్
గన్నింగ్ బెడ్‌ఫర్ (జూ.) — జాక్. బ్రూమ్
జాన్ డికిన్‌సన్

మేరీల్యాండ్

జేమ్ మెక్ హెన్రీ | డే. కారల్
డాన్ ఆఫ్ సెయింట్ థా. జెనిఫర్

వర్జీనియా

జాన్ బ్లెయిర్ | జేమ్స్ మాడిసన్ (జూ.)

నార్త్ కెరోలినా

విలి. బ్లౌంట్ | హ్యూ విలియమ్సన్
రి. డాబ్స్ స్పెయిగట్

సౌత్ కెరోలినా

జే. రట్లెడ్జ్ | ఛార్లెస్ పింక్నీ
ఛార్లెస్ కోట్స్‌వర్త్ పింక్నీ | పియర్స్ బట్లర్

జార్జియా

విలియం ఫ్యూ | అబర్ బాల్డ్విన్

# సవరణలు

## 1 వ సూత్రం

ఒక మతం నెలకొల్పే విషయానికి సంబంధించి గాని, ఒక మతావలంబనాన్ని నిషేధిస్తూగాని కాంగ్రెసు శాసనాలు చేయరాదు; పత్రికల స్వాతంత్ర్యానికి, వాక్స్వాతంత్ర్యానికి ప్రమాదం కలిగించే శాసనాలు కాంగ్రెసు చేయరాదు; ప్రశాంతంగా ప్రజలు సభలు జరుపుకొనే హక్కును, తమ ఇబ్బందులు తొలగించమని ప్రజలు మహజరు పెట్టుకొనే హక్కును భంగం కలిగించే శాసనాలు కాంగ్రెసు చేయరాదు.

## 2 వ సూత్రం

స్వతంత్ర దేశం సుస్థిర శాంతి భద్రతలకు సుశిక్షిత సైన్యాలవసరం గనుక ప్రజలు తమవద్ద ఆయుధాలు కలిగివుండే హక్కును త్రోసి రాజనరాదు.

## 3 వ సూత్రం

యుద్ధ సమయంలో గాని, శాంతి సమయంలో గాని, ప్రభుత్వం నిర్ణయించే పద్ధతిలో తప్ప, ఇంటి యజమాని అనుమతితో నిమిత్తం లేకుండా ఏ యింట్లోను, ఏ సైనికునికి నివాసం కలిగించరాదు.

## 4 వ సూత్రం

ప్రజలకు, వారి ఇండ్లకు, పత్రాలకు, సత్వాలకు తగినంత భద్రత కలిగించాలి. నిష్కారణంగా ప్రజల ఇండ్లను సోదా చెయ్యరాదు. వారి ఆస్తిపాస్తులను స్వాధీనం చేసుకొనరాదు. సోదా చేయవలసిన స్థలాలను, స్వాధీనం చేసుకోవలిసిన వస్తువులను పేర్కొంటూ, వారంటు అమలు జరపడానికి కారణాలను స్పష్టంగా వివరిస్తూ తప్ప వారంట్లు నమలు జరపరాదు.

## 5 వ సూత్రం

సక్రమమైన న్యాయస్థానము, పంచాయతీ దార్లు ఆ యా నేరాలను రుజువుచేస్తే తప్ప సాధారణ పరిస్థితులలో ఉరిశిక్ష విధించదగిన మహాపరాధాలను ఎవరిమీద ఆరోపించరాదు. అయితే, యుద్ధకాలంలో సైనికులు యుద్ధం 'చేస్తూన్నప్పుడు—వారు నౌకాదళానికి చెందినవారైనా, లేక మామూలు సైనికులే అయినా—పై నిబంధన వారి నేరాలపట్ల వర్తించబోదు. అదేవిధంగా ఉపద్రవ పరిస్థితు లేర్పడినప్పుడుకూడా సైనికులకు పై నియమం వర్తించబోదు. ఒకే నేరానికి ఒకే వ్యక్తికి ఒకేసారి రెండురకాల శిక్ష విధించరాదు. తన నేరాన్ని అంగీకరించాలని ఏ వ్యక్తిని బలవంతం చేయరాదు. సక్రమమైన న్యాయవిచారణ లేకుండా ఏవ్యక్తి స్వాతంత్ర్యాన్ని త్రోసివేయరాదు. అతని ఆస్తిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోరాదు. న్యాయమైన పరిహారం ఇవ్వకుండా ఎవరి ప్రైవేటు ఆస్తులను ప్రభుత్వావసరాలకు స్వాధీన పరుచుకోరాదు.

## 6 వ సూత్రం

క్రిమినల్ నేరాలు చేసినట్లు ఆరోపించబడిన వ్యక్తులు తమ నేరాలను నిష్పాక్షికమైన న్యాయస్థానంచేత త్వరగా, ఆ నేరాలు జరిగినట్లు చెప్పబడే

జిల్లాలోగాని, రాష్ట్రంలోగాని, విచారణ జరిపించమని కోరే హక్కు ఆ వ్యక్తులకు గలదు. ఆ జిల్లాను ప్రభుత్వం ఇదివరకే గుర్తించి వుండాలి. నేరంచేసిన వ్యక్తికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పేవారి వివరాలను తెలుసుకొని, తను నేరం చేయలేదని చెప్పగల సాక్షులను తన తరఫున వాదించే న్యాయవాదిని ఆ వ్యక్తి సేకరించుకొనగలందులకు గాను, నేరం జరిగిన జిల్లా వివరాలు, ఏమి నేరంచేసిందీ, ఆ వ్యక్తికి వివరంగా తెలియ చెయ్యాలి.

## 7 వ సూత్రం

20 డాలర్లకు మించని సాధారణ నేరాలను విచారించే విషయంలో సర్వహక్కులు జూరీకి గలవు. ఒక జూరీ విచారించిన నేరాలను అమెరికా అంతట అమలులోవున్న సాధారణ చట్టాల నతిక్రమించి మరేన్యాయస్థానం విచారించబోదు.

## 8 వ సూత్రం

ఎక్కువ మొత్తాలు ధరావతుగా చెల్లించమని నేరస్థులను కోరరాదు. మితిమీరిన జరిమానాలు విధించరాదు. అసాధారణంగా ఎవరినీ శిక్షించరాదు.

## 9 వ సూత్రం

ఈ రాజ్యాంగం ప్రకారం ప్రజలకు కొన్ని హక్కులు లభింపచేసే టప్పుడు వారికి గల ఇతర హక్కులను తగ్గించే విధంగా, వాటిని త్రోసి పుచ్చే విధంగా ఈ రాజ్యాంగానికి అర్థం చెప్పరాదు.

## 10 వ సూత్రం

ఈ రాజ్యాంగంలో పేర్కొనబడని హక్కులు కేంద్ర ప్రభుత్వానికి చెందవు. ఆ హక్కులు రాష్ట్రాలకు సంక్రమించ గలవు. ఆ రాష్ట్ర ప్రజలకు ఆ హక్కులు వుండగలవు.

## 11 వ సూత్రం

అమెరికాలో ఒక రాష్ట్ర ప్రజలు మరొక రాష్ట్ర ప్రజలమీద తెచ్చే అభియోగాలలోను, లేక విదేశస్థులు అమెరికాలోని ఒక రాష్ట్రం ప్రజల

మీద తెచ్చే అభియోగాలలోను తమతమ అనుగుణంగా ఎవరూ ఈ రాజ్యాంగాన్ని వ్యాఖ్యానించరాదు.

## 12 వ సూత్రం

వివిధ రాష్ట్రాల్లోని ఎలక్టర్లు తమ తమ రాష్ట్రాలలో సమావేశమై బ్యాలట్ ద్వారా అమెరికా ప్రెసిడెంటును, వైస్ ప్రెసిడెంటును ఎన్నుకొనగలరు. ఆ విధంగా ఎన్నుకొనేటప్పుడు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటులలో కనీసం ఒకరైనా తమ రాష్ట్ర నివాసులు కాని వారుగా వుండాలి. ప్రెసిడెంటు వోట్లను, వైస్ ప్రెసిడెంటుకు వచ్చిన వోట్లను, స్పష్టంగా వేరు వేరుగా లెక్కపెట్టాలి. ప్రెసిడెంటు పదవికి నిలబడిన అభ్యర్థుల పేర్లను, వైస్ ప్రెసిడెంటు పదవికి నిలబడిన వారి పేర్లను జాబితా వ్రాసి, వాటితో ఎలక్టర్లు తమ ధ్రువపత్రాలు జతపరిచి, వాటిమీద సీళ్ళు వేసి, వాటన్నింటినీ అమెరికా ప్రభుత్వంద్వారా సెనేటు ప్రెసిడెంటుకు పంపించాలి. సెనేటు, ప్రజా ప్రతినిధులసభ సమక్షంలో సెనేటు ప్రెసిడెంటు ఆ సీళ్ళను తెరచి, ధ్రువ పత్రాలను సరిచూచిన తరువాత వోట్లు లెక్కపెట్టబడగలవు. ఎలక్టర్లుగా నియమించబడిన వారి వోట్లలో మెజారిటీ వోట్లు వచ్చిన వ్యక్తి ప్రెసిడెంటుగా ఎన్నిక కాగలడు; ఒకవేళ ఎవరికీ ఆ విధంగా ఎలక్టర్ల వోట్లలో మెజారిటీ వోట్లు రాకపోయినట్లయితే, ప్రెసిడెంటు ఎన్నికలో నిలబడిన అభ్యర్థులలో ఎక్కువ వోట్లు వచ్చిన ముగ్గురు అభ్యర్థులలో ఒకరిని ప్రజా ప్రతినిధులసభ వెంటనే సమావేశమై బ్యాలట్ ద్వారా ప్రెసిడెంటుగా ఎన్నుకొనగలదు. ఒక్కొక్క రాష్ట్రంనుంచి ఒక ప్రతినిధి పాల్గొనే విధంగా ఆ ఎన్నికల నేర్పాటుచేసి, రాష్ట్ర ప్రతినిధులే ప్రెసిడెంటును ఎన్నుకొనగలరు. ఆ విధంగా జరిగే ఎన్నికల్లో మొత్తం రాష్ట్రాల్లో కనీసం మూడింట రెండు వంతులైనా పాల్గొనాలి. ఆ ఎన్నికలో మెజారిటీ వోట్లు వచ్చినవారే గెలుపొందినట్లు నిర్ణయించ బడగలరు. ప్రెసిడెంటు ఎన్నిక లయిన తవారుత వచ్చే మార్చినెల నాలుగవ తేదీలోగా ప్రజా ప్రతినిధులసభ ఒకవేళ ప్రెసిడెంటును ఎన్నుకోక పోయినట్లయితే, ప్రెసిడెంటు మరణించడం మొదలైన సందర్భాల్లోవలెనే, వైస్ ప్రెసిడెంటే ప్రెసిడెంటుగా పని

చేయగలడు. వైస్ ప్రెసిడెంటుగిరికి ఎన్నికలో నిలబడ్డ అభ్యర్థులలో మెజారిటీ వోట్లువచ్చిన అభ్యర్థి వైస్ ప్రెసిడెంటుగా ఎన్నిక కాగలడు. ఒకవేళ ఏ అభ్యర్థికీ ఎక్కువ వోట్లు రాకపోయినట్లయితే, ఎన్నికలో ఎక్కువ వోట్లు వచ్చిన యిద్దరు అభ్యర్థులలో ఒకరిని వైస్ ప్రెసిడెంటుగా సెనేటు ఎన్నుకోగలదు. మొత్తం సెనేటర్లందరిలో మూడింట రెండు వంతులు ఆ ఎన్నికలో పాల్గొనడం అవసరం; ఆ ఎన్నికలో మెజారిటీ వోట్లు వచ్చిన అభ్యర్థి గెలిచినట్లు నిర్ణయించ బడగలడు. రాజ్యాంగ నియమావళి ననుసరించి ప్రెసిడెంటుగా నిలబడడానికి అనర్హుడైన వ్యక్తి వైస్ ప్రెసిడెంటు పదవికికూడా అనర్హుడే.

## 13 వ సూత్రం

1 వ నిబంధన:—సక్రమంగా విచారించి శిక్ష విధించబడిన సందర్భాలలో తప్ప అమెరికాలో ఏ ప్రాంతంలోగాని, అమెరికాకు చెందిన మరే ప్రాంతంలోగాని బానిసత్వం, వెట్టి చాకిరీ నిషిద్ధాలు.

2 వ నిబంధన:—తగిన శాసనాల ద్వారా ఈ సూత్రాన్ని అమలు జరిపే అధికారం అమెరికా కాంగ్రెసుకు గలదు.

## 14 వ సూత్రం

1 వ నిబంధన:—అమెరికాలో జన్మించినవారు, అమెరికా పౌరసత్వాన్ని పొందిన వారందరు, అమెరికాకు అధికారంగల ప్రాంతాలన్నింటిలో పౌరులుగా పరిగణించ బడగలరు. అమెరికా పౌరుల హక్కులకు భంగం కలిగించే శాసనాలను అమెరికాలోని ఏ రాష్ట్రము చేయరాదు; సక్రమమైన న్యాయ విచారణ లేకుండా ఎవరికీ ఏ రాష్ట్ర ప్రభుత్వమువారి హక్కులను, ఆస్తి పాస్తులను భగ్నపరచరాదు; ఏవ్యక్తికీ చట్టరీత్యా రక్షణలేకుండా చెయ్యరాదు.

2 వ నిబంధన:—పన్నులు విధించబడని రెడ్ ఇండియన్లు పోను మిగిలిన జనాభానుబట్టి వివిధ రాష్ట్రాలకు ప్రతినిధులు నిర్ణయించ బడగలరు.

21 సంవత్సరాల వయస్సు కలిగిన మగవారందరకీ వోటింగు హక్కు కలదు. అయితే, ఏ రాష్ట్రంలోనైనా జరిగే రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లోగాని, ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు మొదలైన ఎన్నికల్లోగాని 21 సంవత్సరాల వయస్సు కలిగిన కొంతమంది పురుషులు పాల్గొనడానికి వీలు లేదని నిర్ణయించ బడినట్లయితే, ఆ విధంగా నిర్ణయించబడినవారి మొత్తం సంఖ్యను రాష్ట్రంలో వోటింగు హక్కుగల పురుషుల సంఖ్యనుంచి తీసివేసి ఆ రాష్ట్రానికి లభించే ప్రాతినిధ్యం నిర్ణయించ బడగలదు. అంటే వోటింగులో పాల్గొనే యుక్త వయస్కుల సంఖ్యనుబట్టే ఆ రాష్ట్రానికి ప్రాతినిధ్యం లభించగలదన్న మాట. అయితే, తిరుగుబాట్లు మొదలైన మహాపరాధాలు చేసినవారికి వోటింగు హక్కు నిరాకరించబడినప్పుడు మాత్రం పై నిబంధన వర్తించదు.

**3 వ నిబంధన:**—అమెరికా కాంగ్రెస్ సభ్యుడుగాని, ప్రభుత్వాధికారి గాని, జడ్జీ గాని, మరే వుద్యోగిగాని రాజ్యాంగ చట్టాన్ని బలపరచగల నంటూ ప్రమాణం స్వీకరించి ఆ పదవిలో వున్నవాడు ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవంలోనో, తిరుగుబాటులోనో పాల్గొన్న ట్లయితే అతడు తిరిగి ఆ పదవులకు ఎన్నుకోబడకూడదు. ఆ వ్యక్తిని నిషేధించాలి. కాని, కాంగ్రెసులోని ఉభయ శాసనసభలలో మూడింట రెండువంతుల మంది అనుమతిస్తే ఆ నిషేధాన్ని తొలగించ వచ్చు.

**4 వ నిబంధన :**—తిరుగుబాట్లను అణచే విషయంలో సైనికులు బాగా పనిచేసినందుకుగాను వారికి యివ్వబడే బహుమానాలు, పించన్లు మొదలైన వాటితో సహా అమెరికా చట్టం ఆమోదించే ఋణాలు విధిగా న్యాయమైనవి. వాటికి ఎవరూ అడ్డుచెప్పరాదు. బానిసలను విడిచిపెట్టించి నందుకుగాని, అమెరికా ప్రభుత్వంపై జరిగిన తిరుగుబాటు మొదలైన వాటికి సహాయ పడినందుకు గాని అయే ఋణాలను అమెరికా ప్రభుత్వంగాని, రాష్ట్ర ప్రభుత్వాలుగాని భరించరాదు. అటువంటి ఋణాలు చెల్లనేరవు.

**5 వ నిబంధన :**—తగు శాసనాలద్వారా ఈ సూత్రాన్ని అమలులో పెట్టే అధికారం అమెరికా కాంగ్రెసుకు కలదు.

## 15 వ సూత్రం

1 వ నిబంధన :—గతంలో బానిసలనే నెపంవల్లగాని, జాతి, వర్ణ వివక్షతలవల్లగాని అమెరికా పౌరుల్లో ఎవరికీ కేంద్ర ప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వంగాని వోటింగు హక్కు లేదనరాదు.

2 వ నిబంధన :—తగు శాసనాలద్వారా ఈ సూత్రాన్ని అమలులో పెట్టే అధికారం అమెరికా కాంగ్రెసుకు కలదు.

## 16 వ సూత్రం

ఆ యా రాష్ట్రాల జనాభాతో, వోటర్ల సంఖ్యతో నిమిత్తం లేకుండా, ఆ యా రాష్ట్రాలలోని ప్రజల అన్ని రకాల ఆదాయాలమీద పన్నులు విధించి, వసూలుచేసే అధికారం అమెరికా కాంగ్రెసుకు కలదు.

## 17 వ సూత్రం

1 వ నిబంధన :—ప్రరాష్ట్రంనుంచి అమెరికా సెనేటుకు యిద్దరు సభ్యులు ఎన్నుకొన బడగలరు; ఆరేండ్లపాటు వారా పదవుల్లో వుండగలరు. వారిద్దరికి చెరి వొక వోటు వుండగలదు. రాష్ట్ర శాసనసభలలో ఎక్కువ సభ్యులుగల శాసనసభ నిర్ణయించే యోగ్యతలు కలవారు మాత్రమే ఎలక్టర్లుగా నియుక్తులు కాగలరు.

2 వ నిబంధన :—ఏ రాష్ట్ర శాసనసభలోనైనా కొన్ని స్థానాలు ఖాళీ అయినప్పుడు తిరిగి జనరల్ ఎన్నికలు జరిగేవరకు ఆ ఖాళీలలో తాత్కాలికంగా కొందరిని నియమించడానికి ఎన్నికలు జరపాలని రాష్ట్ర శాసనసభ్యులు నిర్ణయించినట్లయితే, రాష్ట్ర ప్రభుత్వం ఆ విధంగా చేయగలదు.

3 వ నిబంధన :—ఇదివరకే ఎన్నుకోబడిన సెనేటరు ఆ పదవిలో వుండే కాలాన్ని పరిమితం చేసే దృష్టితోగాని, లేదా ప్రస్తుతం ఎవరి ఎన్నికనైనా వాయిదావేసే దృష్టితోగాని ఈ సూత్రాన్ని వ్యాఖ్యానించరాదు. ఈ సవరణ రాజ్యాంగ చట్టంలో ఒక భాగమయేవరకు దానిని అమలు జరపరాదు.

## 18 వ సూత్రం

1 వ నిబంధన :—ఈ సూత్రం ఆమోదించబడిన ఒక యేడాది తరువాతనుంచి, మత్తుకలిగించే పానీయాలు అమెరికాకుగాని, దానికి అధికారం గల ప్రాంతాలకుగాని తెప్పించరాదు; అమెరికాలోని ఏ ప్రాంతంలోను వాటిని తయారు చేయరాదు; ఇతర ప్రాంతాలకు వాటిని ఎగుమతి చేయరాదు; వాటిని అమ్మరాదు.

2 వ నిబంధన :—తగు శాసనాలద్వారా ఈ సూత్రాన్ని అమలు జరిపే అధికారం అమెరికా కాంగ్రెసుకు రాష్ట్ర శాసనసభలకు కలదు.

3 వ నిబంధన :—అమెరికా కాంగ్రెసు ఈ సూత్రాన్ని వివిధ రాష్ట్రాల ఆమోదానికి పంపించిన ఏడేండ్లలోగా రాజ్యాంగంలో సూచించబడిన పద్ధతుల్లో ఈ సూత్రాన్ని ఆ యా రాష్ట్రాలు ధ్రువపరచి, అందుకనుగుణంగా సవరణలు ప్రతిపాదిస్తేనే తప్ప ఈ సూత్రం అమల్లోకిరాదు.

## 19 వ సూత్రం

1 వ నిబంధన :—స్త్రీపురుష భేదంవల్ల అమెరికా పౌరుల వోటింగు హక్కుకు ప్రమాదం కలిగించరాదు.

2 వ నిబంధన :—తగు శాసనంద్వారా ఈ సూత్రాన్ని అమల్లోకి తెచ్చే అధికారం అమెరికా కాంగ్రెసుకు కలదు.

## 20 వ సూత్రం

1 వ నిబంధన :—ఈ సూత్రాన్ని సవరిస్తే తప్ప, ఆ యా పదవుల కాలపరిమితులు సమాప్తి కావలసిన సంవత్సరం జనవరి 20 వ తేదీ మిట్ట మధ్యాహ్నంతో ప్రెసిడెంటు, వైస్‌ప్రెసిడెంట్ల అధికారం సమాప్తం కాగలదు. సెనేటర్లు, ప్రజాప్రతినిధులు అదే సంవత్సరం జనవరి 3 వ తేదీ మిట్ట మధ్యాహ్నం తమ పదవులనుంచి వైదొలగాలి; క్రొత్త సెనేటర్లు, ప్రజాప్రతినిధులు, ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంట్లు విడివిడిగా పైన సూచించబడిన రోజుల మిట్టమధ్యాహ్నంనుంచి అధికారంలోకి రాగలరు.

**2 వ నిబంధన :**—అమెరికా కాంగ్రెసు శాసనరీత్యా మరొక విధంగా నిర్ణయిస్తే తప్ప, కాంగ్రెసు సమావేశం యేడాదికొక్కసారయినా జరిగి తీరాలి; జనవరి 3 వ తేదీ అపరాహ్ణంనుంచి ఆ సమావేశం ప్రారంభం కావాలి.

**3 వ నిబంధన :**—ఎన్నికలు పూర్తికాగానే కొత్త ప్రెసిడెంటు మరణించినట్లయితే వైస్‌ప్రెసిడెంటే ప్రెసిడెంటుగా పనిచేయగలడు. ప్రెసిడెంటు ఎన్నిక పూర్తి అయి, ఆయన పదవీ స్వీకరణకు నిర్ణయించబడిన కాలంలోగా ప్రెసిడెంటు ఎన్నిక పూర్తికాక పోయినా, ఆ కార్యక్రమం పూర్తయి ఒకవేళ ప్రెసిడెంటు పదవికి కావలసిన యోగ్యతలు ఆ అభ్యర్థికి అప్పటికి లేకపోయినా, ఆ అవరోధాలు వైదొలగేవరకూ వైస్‌ప్రెసిడెంటే ప్రెసిడెంటుగా పనిచేయగలడు. ఒకవేళ కొత్తగా ఎన్నికయిన ప్రెసిడెంటు, వైస్‌ప్రెసిడెంటు—ఇద్దరికీ ఆ పదవులకు కావలసిన యోగ్యతలు లేకపోయినట్లయితే, కాంగ్రెసు శాసనరీత్యా ప్రెసిడెంటుగా ఎవరు పనిచేయవలసిందీ, వారిని ఏ విధంగా ఎన్నుకోవలసిందీ నిర్ణయించగలదు. ఆ విధంగా నియుక్తుడైన ప్రెసిడెంటు కొత్త ప్రెసిడెంటు అధికారంలోకి రావడానికి అప్పటికి వున్న అభ్యంతరాలు వైదొలిగేవరకు అధికారంలో వుండగలడు.

**4 వ నిబంధన :**—అసలు ప్రెసిడెంటు మరణించినట్లయితే ప్రజాప్రతినిధుల సభవారు ఒకరిని ప్రెసిడెంటుగా ఎన్నుకోవలసిన సందర్భంలో తిరిగి కొందరినుంచి ఎవరిని ప్రెసిడెంటుగా ఎన్నుకోవలసిందీ నిర్ణయించే అధికారం అమెరికా కాంగ్రెసు శాసనరీత్యా ప్రజా ప్రతినిధులసభకు ఇవ్వగలదు. అదేవిధంగా సెనేటు సభ వైస్ ప్రెసిడెంటును ఎన్నుకొనే అవకాశం వచ్చినప్పుడుకూడా, సెనేటు అందుకు వీలుగా వ్యవహరించే అధికారం అమెరికా కాంగ్రెసు శాసనరీత్యా సెనేటుకు ఇవ్వగలదు.

**5 వ నిబంధన :**—ఈ సూత్రం ఆమోదించబడిన తరువాత వచ్చే అక్టోబరు నెల 15 వ తేదీనుంచి ఈ సూత్రంలోని 1, 2 నిబంధనలు అమల్లోకి రాగలవు.

6 వ నిబంధన :—రాష్ట్ర శాసనసభల ఆమోదంకొరకు ఈ సూత్రాన్ని వాటికి పంపించిన ఏడేండ్లలోగా నాలుగింట మూడువంతుల రాష్ట్ర శాసనసభలు ఆమోదించని పక్షంలో ఈ సూత్రం అమల్లోకిరాదు.

## 21 వ సూత్రం

1 వ నిబంధన :—ఈ రాజ్యాంగానికి ప్రతిపాదించబడిన 18 వ సవరణ సూత్రం ఇందు మూలంగా రద్దుచేయబడుతూంది.

2 వ నిబంధన :—మద్యపాన నిషేధ చట్టాలు అమల్లో వున్న ఏస్టేట్లకు, ప్రాంతాలకు మద్యపానాలు సరఫరాచేయడం, అమ్మడం ఇందు మూలంగా నిషేధించబడుతూంది.

3 వ నిబంధన :—ఈ సూత్రాన్ని వివిధ రాష్ట్ర శాసనసభలు, ఇది అందిన ఏడేండ్లలోగా రాజ్యాంగంలో సూచించబడిన విధంగా సమావేశమై ఆమోదించక పోయినట్లయితే, ఈ సూత్రం రాజ్యాంగానికి సవరణగా ఆమోదించబడదు. కనుక, అటువంటి సందర్భంలో యిది అమల్లోక్షి రానేరదు.

